అపరాధ పరిశోధన అనుబంధం—30

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## ప్రాణాలకు పదిలక్షలు

రచన : శ్యాంబాబు

## తెరవెనుక న్యూస్

రచన : సుజనశ్రీ

## తిరిగిరాని ఖైదీలు

రచన : సంపత్

## నా పేరే భగవాన్

రచన : కురుమద్దాలి విజయలక్ష్మి

"ఖైదీ" సీరియల్ - 25 వ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్—30
జూన్, 1976
వెల : 3_00 రూపాయలు
ఏడాది చందా 30 రూపాయలు
ఉచిత చందా డిపాజిట్లు 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ; హైదరాబాదు_29
ఫోన్_36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.

గేదా రంగారావు

# ప్రాణాలకు పదిలక్షలు

శ్యాంబాబు

ఉదయం ఎనిమిది గంటలు...

గుంటూరు రైల్వేస్టేషనులో జనం హడావిడి చూడ ముచ్చటగా వుంది.

రంగురంగుల చీరల్లో అందమైన అమ్మాయిలు, చేతుల్లో నోట్ పుస్తకాలు పట్టుకొని, బెల్ బాటమ్ పాంట్లతో, భుజాలవరకూ పెంచుకొన్న జుట్టుతో అమ్మాయిల వెనకే ఎస్కార్ట్సులా తిరుగుతోన్న కాలేజీ కుర్రాళ్ళు, మరచెంబు దగ్గరనుండి తట్టా, బుట్టలతో సహా సంసారాన్నంతా ఈ రైలుకే లాగించేయాలనే తాపత్రయంలో వున్న కుటుంబ రావులు, పుస్తకాలు దినపత్రికలు, పళ్ళు, తినుబండారాలు అమ్మేవాళ్ళ కేకలు—అంతా హడావిడిగా వుంది.

గుంటూరు స్టేషన్లో ఉదయమే ప్లాట్ ఫారంమీద హడావిడికి కొన్ని కారణాలున్నాయి. ప్రత్యేకంగా ఉదయం ఎనిమిదినుండి పదివరకూ వరుసగావున్న డీసిల్ కార్ సర్వీసుకు ఈ ఊరినుండి విజయవాడకు వెళ్ళే స్టూడెంట్సూ, ఉద్యోగులు, రైల్వే పనివారు, వ్యాపారస్థులు అనేకమంది వెళతారు.

"ది షటిల్ సర్వీస్ ఫ్రమ్ గుంటూర్ టు విజయవాడ ఈజ్ ఆన్ ప్లాట్ ఫారం నెంబర్ వన్"—మైక్‌లో ఎనౌన్సర్ గొంతు వినిపిస్తోంది.

ప్లాట్ ఫారం మీదికి అప్పుడే వచ్చిన జ్యోతి, 'సీజన్ టికెట్' వుందో లేదో అని ఓసారి హేండ్ బాగ్ తెరిచి చూసికొని, ఒకటో నెంబర్ ప్లాట్ ఫారంవైపు దారి తీసింది.

జ్యోతి అందమైన అమ్మాయి. ఇరవై రెండు సంవత్సరాల వయస్సు. అందమైన ముఖం, చక్కటి పర్సనాలిటీ. చక్రాల్లాటి కళ్ళు చూపరుల్ని ఇట్టే ఆకర్షిస్తాయి. స్వంత ఊరు గుంటూరే అయినా, విజయవాడలో ఓ కాలేజీలో లెక్చరరుగా పనిచేస్తూండడంవలన,రోజూ ఈ సమయానికి విజయవాడ వెళుతుంది. తిరిగి సాయంత్రం నాలుగునుండి ఏడుగంటలవరకూ వున్న షటిల్ సర్వీస్‌లో తిరిగి వచ్చేస్తుంది. డీసిల్ సర్వీస్ కావడంవల్లా, ముఫైఅయిదు నిముషాలే ప్రయాణవ్యవధి అవడంవల్ల పెద్దగా శ్రమ అనిపించదు.

ప్లాట్ ఫారంమీద ట్రైన్ సిద్ధంగా వుంది. నిజానికి ట్రైన్ అన్న పేరు దానికి సరిపడదేమో. ముందు ఓ డీసిల్ కారు, దాని వెనుక రెండు మామూలు రైలుపెట్టెలు

తగిలించి వున్నాయి. డీసిల్ కారులోనే వున్న ఫస్ట్‌క్లాస్ కంపార్టుమెంటులోకి ఎక్కి కూర్చొన్నది జ్యోతి.

మామూలు డీసిల్ రైలింజన్లకు, డీసిల్ కార్లకు ప్రాథమికంగా ఓ తేడా వున్నది. డీసిల్ ఇంజన్లు రైలింజన్లకు మల్లే బరువైన ఇరవై ముప్ఫై కంపార్టుమెంట్లు లాగడానికి ఉపయోగపడతాయి. కాని డీసిల్ కార్లు అలా కాదు. స్థూలంగా చెప్పాలంటే రైలుపట్టాలపై ప్రయాణం చేసే బస్సుల్లాంటివి అనొచ్చు. కంపార్టుమెంట్ ముందు భాగంలో ఇంజన్ రూము వుంటుంది. వెనుకవైపు మామూలుగా ప్రయాణీకులు కూర్చోడానికి అనువుగా సీటింగ్ అమర్చబడి వుంటుంది.

మామూలుగా కంపార్టుమెంట్ బరువు లాగటానికే ఇంజన్ ఉద్దేశింపబడినా, చిన్నరూట్లలో ప్రతి డీసిల్ కారుకూ రెండు మామూలు రైల్వే కంపార్టుమెంట్లు ఎటాచ్ చేసి సర్వీసులు నడుపుతూ వుంటారు.

జ్యోతి తన సీట్లో కూలబడి ఓసారి కంపార్టుమెంటంతా కలియజూసింది. అన్నీ బస్సు సీట్లలా విడివిడిగా వున్న కుషన్ సీట్లు... మొత్తం నలభై.

పరిమళ ఇంకా రాలేదు అనుకొంది మనసులోనే. పరిమళ కూడా విజయవాడలో ఓ ప్రయివేట్ కంపెనీలో సెక్రటరీగా పనిచేస్తోంది. కిటికీప్రక్క సీట్లలో గురుమూర్తీ, సాంబశివరావు సిగరెట్లు కాల్చుకొంటూ లోకాభిరామాయణం మాట్లాడుకొంటున్నారు. వాళ్ళిద్దరూ ఫుడ్ కార్పొరేషన్‌లో డెప్యూటీ మేనేజర్లు. గురుమూర్తి జ్యోతిని చూసి పలకరింపుగా నవ్వాడు.

తన వెనకసీట్లో మిస్టర్ విల్సన్ దీక్షగా 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' చదువుకొంటున్నాడు. ఆయన రైల్వే ఆఫీసరు.

ఇంకా రోజూ వచ్చేవాళ్ళు కాక క్రొత్తవాళ్ళు వున్నారు కొంతమంది.

తనతోపాటు రెగ్యులర్‌గా ఈ ట్రయిన్‌కే ఫస్ట్ క్లాస్‌లో సీజన్ టికెట్ మీద వచ్చేవాళ్ళు ఇంకా నల్గురు రాలేదు. ఓసారి నింపాదిగా ఖాళీసీట్లను లెఖ్ఖ బెట్టింది. ఇంకా చాలా సీట్లు ఖాళీగా వున్నాయి. ఎందు కయినా మంచిదని పరిమళ వస్తే కూర్చోడానికి ప్రక్క సీట్లో హేండ్ బాగ్ పారేసింది.

"హలో మిస్ జ్యోతీ" అన్నాడు సేతుమాధవన్ కంపార్టుమెంటులోకి ఎక్కుతూ.

"హలో మిష్టర్ మాధవన్" అన్నది జ్యోతి ముభావంగా.

సేతుమాధవన్ నవ్వుతూ జ్యోతి ఎదురుసీట్లో కూర్చొన్నాడు. సేతు అంటే జ్యోతికి వళ్ళు మంట. అతనేదో ప్రయివేట్ ట్రాన్స్‌పోర్టు కంపెనీలో ఎక్కౌంటెంట్‌గా పనిచేస్తున్నాడు. రోజూ ఈ ట్రయిన్‌కే విజయవాడ వస్తాడు. అతని వెకిలినవ్వు, తినేస్తున్నట్లు చూసే చూపులూ జ్యోతికి కంపరం పుట్టిస్తాయి. తల త్రిప్పుకొని కిటికీలో నుండి రెండో నంబరు ప్లాట్‌ఫారం మీదకు చూస్తూ కూర్చొంది.

స్టేషన్‌లో గంట మ్రోగింది.

"ది షటిల్ సర్వీస్ యీజ్ ఎబవుట్ టు స్టార్ట్" ఎనౌన్స్‌మెంటు వినిపిస్తోంది. పరిమళ ఈ వేళ ఇక రాదేమో అనుకొంది జ్యోతి.

అప్పుడే సుబ్బారావు, పరిమళా కంగారుగా కంపార్టు మెంట్‌లోకి ఎక్కారు. పరిమళను చూడగానే ప్రాణం

లేచివచ్చినట్లయింది జ్యోతికి. ఆమె రాకపోతే జర్నీ అంతా సేతుమాధవన్ ఎక్స్‌రేచూపులు భరిస్తూ గడపాలి.

"హమ్మయ్య! ట్రైను వెళ్ళిపోతుందేమో అనుకొన్నాను" అన్నది పరిమళ జ్యోతి ప్రక్క సీట్లో కూలబడుతూ.

"ఇంత సేపూ రాకపోతే ఈరోజు కిక రావేమో అనుకొన్నాను" అన్నది జ్యోతి చిన్నగా నవ్వుతూ.

డీసిల్ కారు 'గుంయ్' మంటూ కూత వేసి చటుక్కున కదిలింది.

"ఏమండోయ్! ఈరోజు అహమ్మద్ గారు రాలేదల్లే వుందే" అన్నాడు గురుమూర్తి అందర్నీ ఓసారి కలయజూస్తూ.

"పాపం! లేటయిందేమో" అన్నారు ఎవరో.

## 2

స్టేషన్ ముందు రిక్షా దిగి, స్టేషన్ హాల్లోకి ప్రవేశించేప్పటికే బండి కదలబోతున్నట్లు అనౌన్సుమెంట్ వినిపించింది అహమ్మద్‌కి. గబగబా గేట్లో అడ్డంగావున్న జనాన్ని తోసుకుంటూ ప్లాట్‌ఫారంమీదికి పరిగెత్తాడు. డీసిల్‌కార్ అప్పుడే 'గుంయ్' మంటూ కూ తేసింది. పరుగు వేగం మరికాస్త ఎక్కువచేశాడు అహమ్మద్. ఒకటో నెంబరు ప్లాట్‌ఫాం ఎంట్రెన్సుకు దూరంగా వుంటుంది.

ఒగుర్చుకొంటూ బండి దగ్గరికి వచ్చేప్పటికి బండివేగం పుంజుకొంది. ఫస్ట్‌క్లాస్ అందుకొనే ఆశ లేదు అనుకొన్నాడు చటుక్కున సెకండ్‌క్లాస్ కంపార్టుమెంట్లోకి వ్రేళ్ళాడుతూ ఎక్కి.

కాలు కదపడానికి చోటు లేకుండా వుంది సెకండ్ క్లాస్ కంపార్టుమెంటు. సీట్లమీద కాకుండా పాస్‌వే

లోనూ, తలుపులదగ్గరా టిఫిన్ కారియర్లు, సంచులూ చేత్తో పట్టుకొని నిలబడివున్నారు జనం. రోజూ ఇలానే వుంటాయి సెకండ్ క్లాస్ పెట్టెలు. అందుకే తను మూడు రెట్లు ఎక్కువయినా ఫస్ట్ క్లాస్ సీజన్ తీసుకున్నది. ఏం చేస్తాం! ఆలస్యంగా వచ్చినందుకు పనిష్మెంట్ అనుకొన్నాడు ముక్కుకు కర్చీఫ్ అడ్డం పెట్టుకొంటూ.

తను లేటుగా రావడం తన అదృష్టమనీ, సెకండ్ క్లాస్‌లోకి ఎక్కడం పనిష్మెంటు కాదనీ అహమ్మద్ గ్రహించడానికి ఇంకా సమయం వుంది.

బండి మంగళగిరిలో ఒక్క నిమిషం మాత్రం ఆగింది పదిహేను నిముషాల రన్ తరువాత.

బండి ఆగీఆగగానే దిగి ఫస్ట్ క్లాస్ ఎక్కుదామనుకొన్న అహమ్మద్ ఆశ నిరాశ అయింది. బండి ఆగీ ఆగడంతోనే మరో ఇరవైమంది ఉప్పెనలా పెట్టెలోకి ఎక్కగానే అహమ్మద్ దిగడానికి వీల్లేకపోయింది. అలవాటున్న వాళ్ళు అంత తొక్కిడిలోనే దిగిపోవడం అహమ్మద్ చూస్తూ కూడా అనుకరించలేకపోయాడు.

ఫస్ట్ క్లాస్ కంపార్టుమెంట్లో ఇద్దరు క్రొత్త వ్యక్తులు ఎక్కారు. ముందు ఓ పెద్ద ట్రంక్ పెట్టెను లోపలికితోసి వెనకే ఎక్కారు వాళ్ళు.

పేపరు చదువుకొంటున్న విల్సన్ ముఖం చిట్లించి చూశాడు వాళ్ళవైపు. ఫస్ట్ క్లాస్‌లో ఎక్కదగ్గ మనుషుల్లా కనిపించలేదు అతనికి వాళ్ళిద్దరూ.

ఒకడు బలిష్టంగా, కండలు తిరిగి బాక్సర్‌లా వున్నాడు. ఎత్తు దాదాపు ఆరడుగులు వుండొచ్చు. ముఖమంతా ఎర్రగా కందిపోయినట్లు వుంది. వెనక్కి దువ్వుకొన్న తల, వత్తుగా గడ్డం మీసాలు పెరిగివున్నాయి.

సిమెంటు కలరు పాంటుమీద అదేరంగు షర్టు ఇన్‌షర్టు చేశాడు. చేతికి పాతకాలంనాటి దీర్ఘ చతురస్రంగా వున్న గడియారం వుంది.

రెండో వ్యక్తి సన్నగా తీగెలా వున్నాడు. స్కైబ్లూ కలర్ జీన్స్ వేసుకొన్నాడు. అదేరంగు ఓపెన్ షర్టు. మెడలో చిన్నిచిన్ని శంఖులతో చేసిన దండ వ్రేల్లాడుతోంది. వయసు పాతిక మించదనిపిస్తోంది.

భారీ పర్సనాలిటీ తలుపు దగ్గరగావున్న సీట్లో కూలబడ్డాడు. అతడి పేరు విక్రం. రెండో అతనుమాత్రం అలానే నిలబడి అందరినీ ఓసారి పరీక్షగా చూశాడు. అతని పేరు గనీ.

బండి మంగళగిరి స్టేషన్ దాటి అయిదు నిముషాలయింది. కృష్ణా సిమెంటు హాల్టు దాటి మెల్లిగా వేగం తగ్గింది. ఇక్కడినుండి కృష్ణా కెనాల్ స్టేషన్ చేరుకొనే లోపల దాదాపు డెభ్భై డిగ్రీలు వంపు తిరుగుతుంది రైలు మార్గం. ఎంత పెద్ద ట్రెయినయినా ఈ వంపులో స్పీడు తగ్గించుకొని మెల్లిగా పోవలసిందే.

"ఎవరో రౌడీ వెధవల్లా వున్నారు" అన్నది పరిమళ నిలబడి సిగరెట్టు వెలిగించుకొంటున్న జీన్స్ యువకుడిని చూస్తూ గుసగుసలుగా.

"పెద్ద పెట్టెలో సవాలు ఎక్కారు. అసలు టిక్కెట్టు వుందో లేదో" అన్నాడు సేతుమాధవన్ ఆడాళ్ళతో మాటలు కలపడానికి.

మరో అయిదు నిముషాలు గడిచాయి.

బండి వంపు పూర్తిగా తిరిగి వేగం పుంజుకొంది. కృష్ణా కెనాల్ స్టేషన్ వచ్చేసింది. స్టేషన్ మాస్టర్ ప్లాట్‌ఫాం మీద నిలబడి 'ఆల్ క్లియర్' అని పచ్చ జండా చూపిస్తు

న్నాడు. ఆ స్టేషన్‌లో బండి ఆగదు. దాని తరువాత కృష్ణా నదిమీద వంతెన దాటితే విజయవాడే.

బండి కృష్ణా కెనాల్ స్టేషన్ దాటగానే లేచి నిలబడ్డాడు విక్రమ్. ఒక్క క్షణం అందరివైపు చూసి డ్రైవర్ కాబిన్ వైపు చకచకా అడుగులు వేశాడు.

డ్రైవర్ కాబిన్‌కు, కంపార్ట్‌మెంట్ సీట్లకు మధ్య రెండు లావెటరీలు వున్నాయి. లావెటరీ మధ్యగా వున్న సందు నుండి డ్రైవర్ కాబిన్ ఓ చిన్న తలుపుద్వారా కనెక్ట్ చేయబడి వుంది. డోర్ దగ్గరికి వెళ్ళి హేండిల్ తిప్పాడు విక్రమ్. డ్రయివర్ అవతల లాక్ చేసుకొని వుండాలి తెరుచుకోలేదు.

రైల్వే కంపార్ట్‌మెంట్స్ అన్నిటికీ టూవే లాక్స్ వుంటాయి. అంటే లోపల్నుండి, బయట నుండి తాళం వేసుకోడానికి వీలవుతుందన్నమాట. జేబులోనుండి సన్నని రాడ్‌లా వున్న తాళంచెవి కీ హోల్‌లో పెట్టాడు.

అదే సమయంలో కంపార్ట్‌మెంట్ వెనుకవైపు సీట్లలో నుండి రాజా, జానీలు లేచి నిలబడ్డారు. లేచి నిలబడినప్పుడు బలిష్టంగా, ప్రత్యేకంగా కనిపించినా మొదటి నుండీ కంపార్ట్‌మెంట్‌లో కూర్చొని వుండడంవలన వాళ్ళిద్దర్నీ ప్రత్యేకంగా ఎవరూ గమనించలేదు.

కంపార్టుమెంట్‌లో అందరి కళ్లూ డ్రైవర్ కాబిన్ తెరవబోతున్న విక్రమ్‌మీదే వున్నాయి. రైల్వే పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసరు విల్సన్ తీక్షణంగా చూశాడు. చటుక్కున లేచాడు.

"హే మిస్టర్! వాట్ ది హెల్..." అతని గొంతు మధ్యలోనే ఆగిపోయింది.

విక్రంతోపాటు మంగళగిరిలో కంపార్టుమెంట్లో ఎక్కిన గనీ చేతిలో నల్లని ఆటోమెటిక్ పిస్తోలు విల్సన్ వైపు గురిపెట్టబడివుంది.

"సిడవున్ జంటిల్మన్! చావదలచుకోంటే అడుగు ముందుకు వెయ్యి" అన్నాడు తీక్షణంగా.

"యస్! ఎవ్వరూ కదలకండి..." కంపార్టుమెంట్ వెనకవైపునుండి అన్నాడు జానీ.

అందరి తలలూ ఆశ్చర్యంగా అటు తిరిగాయి. అటు చివరి రెండు తలుపులూ మూసి వాటి ప్రక్కనే నిలబడి వున్నారు రాజా జానీ లిద్దరూ.

సంభ్రమాశ్చర్యాలతో చకితులయి కళ్ళప్పగించి చూస్తున్నారందరూ.

# 3

డీసిల్ కార్ డ్రైవరు దైవానందం బ్రిడ్జి అప్రోచ్ నే చూస్తూ డీసిల్ను పోనిస్తున్నాడు.

రెండు రైలు వంతెన్లు ప్రక్క ప్రక్కనే కనిపిస్తున్నాయి కృష్ణానదిమీద. ఒకటి చాలా ఏళ్ళ క్రితం కాటన్ దొర కట్టింది. రెండవది పదేళ్ళ క్రితం కట్టారు. ఎక్స్ప్రెస్ ట్రైన్స్ అన్నింటికీ పాత వంతెనకే 'వే' ఇస్తారు. క్రొత్తగా కట్టిన వంతెన్ని 'స్లో ట్రాక్'అంటారు. మెల్లిగా వెళ్ళే గూడ్సు రైళ్ళు, పాజింజరు ట్రైన్సు ఆ వంతెన మీద వెళతాయి.

డీసిల్ కార్లో ఈ షటిల్ సర్వీసు మొదలుపెట్టిన దగ్గర్నుండీ రోజూ ఉదయం సాయంత్రం ఇదే ట్రాక్ మీద డ్యూటీ చేస్తున్నాడు తను. కళ్ళు మూసుకొని బండి నడపగలడు. స్పీడామీటర్ యాభై కిలోమీటరు

చూపుతోంది. టైము చూసుకొన్నాడు. బండి బిఫోర్ టైమ్ నడుస్తోంది. విజయవాడ చేరడానికి ఇంకా ఎనిమిది నిముషాలుంది. వంతెన దాటితే విజయవాడ స్టేషనే.

కొద్దిగా స్పీడ్ కట్ చేసి 'సైరన్' మోగించాడు రెండు సార్లు. వంతెనమీదికి బండి తీసుకెళ్ళేప్పుడు విధిగా సైరన్ మోగించాలి. వంతెన ఇంకా యాభై గజాల్లో వుంది.

విక్రమ్ ఎప్పుడు కాబిన్‌లోకి వచ్చాడో గమనించ లేదు దైవానందం. వెనక అలికిడి వినిపించగానే చటుక్కున వెనక్కి తిరిగాడు.

"ఎవరు మీరు...కాబిన్‌లోకి రాకూడదు" అన్నాడు విసుగ్గా.

బండి చప్పుడు చేసుకొంటూ బ్రిడ్జి ఎక్కింది.

"ఇంజన్ కట్ చెయ్యి" అన్నాడు విక్రమ్ పిస్తోలు గురిపెట్టి.

బండి పూర్తిగా బ్రిడ్జిమీదకు వచ్చేసింది.

ఆశ్చర్యంనుండి తేరుకోడానికి క్షణంసేపు పట్టింది దైవానందానికి. "నీకేమన్నా పిచ్చా!" అని మాత్రం అనగలిగాడు.

"షటప్ అండ్ డు యాజ్ ఐ సే! రైను ఆపకపోతే నిర్దయాత్మకంగా కాల్చి చంపేస్తాను" అన్నాడు విక్రమ్.

ఇంజన్ శబ్దంలోనూ, వంతెన శబ్దంలోనూ కూడా విక్రం గొంతులో కాఠిన్యం దైవానందాన్ని చకితుణ్ణి చేశాయి. అతని పదిహేనేళ్ళ సర్వీసులో ఇలాంటి సంఘటన ఎప్పుడూ జరగలేదు. కనీసం జరిగినట్లు విన్నట్లుకూడా గుర్తులేదు. కాని అవతలి వ్యక్తి గొంతు వింటోంటే

అన్నంత పనీ చేయగలడన్న నిజం మాత్రం తలకెక్కింది. మెల్లిగా చేయి కంట్రోలుమీద వేశాడు.

"మేకిట్ స్లో! మెల్లిగా అతి మెల్లిగా ఆపు" అన్నాడు విక్రమ్ అతని చేతుల్ని జాగ్రత్తగా గమనిస్తూ.

డీసిల్ ఇంజన్లవ వేగం పెంచడం, తగ్గించడం అతి త్వరగా చెయ్యొచ్చు. కంట్రోలును గట్టిగా పట్టుకొని పూర్తిగా వెనక్కి లాగాడు. ట్రైను పెద్ద శబ్దంచేస్తూ వంతెన మధ్యలో ఆగిపోయింది.

"లాక్ వెయ్యి" అన్నాడు విక్రం. లాక్ వెయ్యడం వలన వేసిన బ్రేక్ వెనక్కి జారకుండా పట్టి వుంటుంది. దైవానందం చెప్పినట్లు చేశాడు.

"ఆల్ రైట్ తలమీద రెండు చేతులూ పెట్టుకొని అలాగే నిలబడు" అన్నాడు విక్రమ్.

"ఏమిటి? ఏం జరిగింది? బండి ఆగిందెందుకూ?" రకరకాలుగా ఒకళ్ళ నొకళ్ళు ప్రశ్నించుకొంటున్నారు. చివరని అహమ్మద్ ఎక్కిన సెకండ్ క్లాస్ బోగీలో ప్రయాణీకులు.

"బహుశా సిగ్నల్ ఇవ్వలేదేమో—"

"లేదు లేదు సిగ్నల్ ఇచ్చేవుంది."

"మరెందు కాగిపోయింది? సరిగ్గా వంతెన మధ్యలో వుంది రైలు."

ఒకొక్కళ్ళు ఒకో రకమైన ప్రశ్న, సమాధానం. అహమ్మద్ విసుగ్గా టైమ్ చూసుకొన్నాడు. ఈసరికి విజయవాడలో వుండవలసింది. ఇంకా సెకండ్ క్లాస్ కంపులో ఎంతసేపు వుండాలో! అనుకొన్నాడు దూరంగా కృష్ణాబరాజ్ మీద హడావిడిగా అటూ ఇటూ పోతున్న మోటారు వాహనాలు చూస్తూ.

ఇంతలో డోర్ దగ్గర నిలబడిన వాళ్ళలో కలకలం ప్రారంభమయింది. కిటికీల దగ్గర కూర్చున్న వాళ్ళు తలలు బయటికి పెట్టి బయట చూస్తున్నారు.

"అమ్మో! డేంజరు! బండి కదిత్తే చస్తాడు" అంటున్నారు ఫస్ట్ క్లాస్ కంపార్టుమెంటులోనుండి మెల్లిగా వంతెనమీదికి దిగిన రాజాని చూస్తూ.

"ఏం గురూ బ్రతకాలని లేదా?" అరుస్తున్నారు గుమ్మం దగ్గర వున్న వాళ్ళు.

అహమద్ కూడా క్యూరియాసిటీ చంపుకోలేక గుమ్మం దగ్గరి చువ్వ గట్టిగా పట్టుకొని ముందుకు వంగాడు.

## 4

దైవానందాన్ని కాబిన్ లోనుండి బయటికి తీసుకువచ్చి అందరితోపాటు సీట్లమీద కూర్చోబెట్టాడు విక్రం.

"లుక్ మిస్టర్ ఇలా రైలును ఆపి పిస్తోళ్ళతో బెదిరించడం చట్ట విరుద్ధం" అన్నాడు విల్సన్ గొంతు పెగల్చుకొని.

విక్రం అతన్ని పట్టించుకోలేదు. తన పిస్తోలును సీట్ల పైకి గురిపెట్టి వుంచి గనీకి సైగ చేశాడు. గనీ గబగబ పెట్టె తెరిచి రెండు గ్రెనేడ్లు బయటికి తీసి అందరికీ కనిపించేలా పట్టుకొన్నాడు.

"జాగ్రత్తగా వినండి" అన్నాడు విక్రం. "ఎవరూ ఏమాత్రం సీట్లలో నుండి లేవాలని ప్రయత్నించినా, హీరోయిజం చేయడానికి సాహసించినా ఆ రెండు గ్రెనేడ్లు ప్రేలడం ఖాయం. అందరి ప్రాణాలు పోవడంతోపాటు వంతెన కూలి ఎందుకూ పనికి రాకుండా పోతుంది. మేము ప్రాణాలకు తెగించే ఈ పనిని తలపెట్టాం.

కాబట్టి మాకు ప్రాణాలు ముఖ్యం కావని గుర్తుంచుకోండి" అన్నాడు.

కంపార్టుమెంట్ లో జనం ఇంకా షాక్ నుండి తేరుకో లేదు. జరుగుతున్నదేమిటో ఎవరికీ పూర్తిగా అర్థంకావడం లేదు.

విక్రం రాజాకు ఏదో సైగ చేశాడు. రాజా తల వూపి పిస్తోలు బొడ్లో దోపుకొని బయటికి కనిపించకుండా షర్టు దానిపైకి లాక్కొని తలుపు తెరిచాడు.

వంతెన ఇనుప కమ్మిల క్రిందనుండి వర్షాకాలపు కృష్ణానది నిండుగా ప్రవహిస్తోంది. మెల్లిగా తలుపుకు అటూ ఇటూ వున్న ఇనుపరాడ్డు పట్టుకొని క్రింద స్లీపర్ల మీదికి జారాడు. అక్కడనుండి జాగ్రత్తగా ఒక్కొక్క అడుగే వేస్తూ వెనక్కి జరిగాడు.

వెనుక సెకండ్ క్లాస్ బోగీలోని జనం రాజాను చూసి గోలగా అరుస్తున్నారు.

రాజా వాళ్ళవైపు చూసి, "వాక్యూమ్ లీక్ అవుతోంది. క్షణంలో బిగిస్తాను" అన్నాడు రెండు కంపార్టు మెంట్స్ మధ్యలోకి వెళుతూ.

జనంలో కాస్త అలజడి తగ్గింది.

రాజా చకచకా వాక్యూం ట్యూబు వూడదీసి డీసిల్ కార్ కు కనెక్ట్ చేశాడు. తర్వాత రెండు పెట్టెలకు మధ్య ఉండే కప్లింగ్ వూపి చూశాడు. టెన్షన్ గా కదప లేనట్లు వుంది. డీసిల్ కారువైపున వున్న రేకుమీద పిస్తోలు పిడి తిప్పి రెండుసార్లు గట్టిగా కొట్టాడు. తను రడీగా వున్నట్లు విక్రంకు సంకేతం అది.

రాజా సంకేతం వినగానే విక్రం డ్రైవర్ కాబిన్ లోకి వెళ్ళాడు. లాక్ తీసేసి, బ్రేక్ ను అదిమిపట్టి రివర్స్ గేర్

వేశాడు. బ్రేక్‌ను అలానే నొక్కిపట్టి ఇంజన్ రివర్స్ పెంచాడు. 'కుఁయ్' మని రెండుసార్లు సైరన్ మ్రోగించాడు—రడీగా వుండమని రాజాకు సంకేతం అది.

సైరన్ వినగానే రాజా కప్లింగ్ జాయింట్ చేతో పట్టుకొని రడీగా వున్నాడు. డీసిల్ కారు సడన్‌గా ఒక్క అరడుగు వెనక్కి జరిగి ఆగిపోయింది. సరిగ్గా అదే సమయంలో రాజా కప్లింగ్ ఊడతీశాడు. డీసిల్ కార్ నుండి విడిపోయిన రెండు పెట్టెలు వెనక్కి కదలడం మొదలెట్టాయి. రాజా మెల్లిగా పాక్కుంటూ కంపార్టుమెంటులోకి ఎక్కాడు.

"ఓకే!" అరిచాడు రాజా.

రాజా అరుపు వినడంతోనే విక్రం వేగంగా కార్‌ను వెనక్కి పోనిచ్చాడు. వెనక్కి జరుగుతోన్న రెండు సెకండ్‌క్లాస్ బోగీల్ని వేగంగా గుద్దుకొన్నది. డీసిల్ కారు రెండు బోగీల్లో జనం హాహాకారాలు చేశారు ఆ కుదుపుకు. షంటింగ్ తోపిడికి రెండు పెట్టెలూ అతి వేగంగా వెనక్కి వెళ్ళిపోవడం మొదలుపెట్టాయి.

విక్రం మళ్ళీ బ్రేక్ వేసి లాక్ అరేంజ్ చేశాడు.

విడిపోయిన రెండు బోగీలు వెనక్కి వెళ్ళే కొలదీ వేగాన్ని పెంచుకోసాగాయి. వంతెన తరువాత ట్రైన్ పల్లంలో వుండడంలో క్షణక్షణానికీ ఇంజన్ లేకపోయినా వేగం పెంచుకొంటూ వెనక్కి పరిగెత్తసాగాయి.

నలుగురు దుండగుల ముఖాల్లోనూ చిరునవ్వు మెదిలింది.

# 5

విజయవాడ ఈస్ట్ అవుట్ కాబిన్ ఎ. యస్. యమ్., పాయింట్స్‌మన్ షటిల్ సర్వీస్ ట్రైన్ ఎందుకు బ్రిడ్జ మీద నుండి కదలడంలేదో తెలియక తికమక పడ్డారు.

సిగ్నల్ ఇచ్చినా ట్రైను ఎందుకు ముందుకు రావడంలేదో అర్థం కాలేదు.

"సిగ్నల్ లైటు వెలగలేదేమో!" అన్నాడు కాబిన్ మాస్టర్ అనుమానంగా.

"అక్కడ లైటు వెలిగినట్లు మన కాబిన్‌లో ఇండికేటర్ బల్బు చెపుతోంది. ట్రాక్ ఫాల్ట్ ఏమన్నా వుందేమో" అన్నాడు పాయింట్స్‌మన్.

కాబిన్ నుండి అర కిలోమీటరు దూరంలో వుంటుంది వంతెన. వంతెన మధ్యలో ఆగిపోయి వుండడంవలన చూడ్డానికి కనిపించడంలేదు ట్రైను. క్యాబిన్ మాస్టరు మనసులో తెలియకుండానే అనీజిగా ఫీలవసాగాడు.

జూనియర్ పాయింట్స్‌మెన్ వైపు తిరిగి, "ఎందుకయినా మంచిది. నీవు ఫ్లాగ్స్ తీసుకొని వంతెనమీదకు వెళ్ళు. ఏం జరిగిందో కనుక్కో" అన్నాడు.

"కనుక్కోవడం కాదు, కాస్త హడావిడి చెయ్యి. కనీసం వార్నింగ్ సైరనన్నా ఇవ్వకుండా ఎందుకు ఆగిపోయాడో గట్టిగా అడుగు. వెనక సర్కారు ఎక్స్‌ప్రెస్ వచ్చే టైమ్ దగ్గరపడింది" అన్నాడు సీనియర్ పాయింట్స్‌మన్ గట్టిగా.

అతను తల వూపి జండాలు తీసుకొని గబగబా కాబిన్‌లోనుండి క్రిందకు దిగసాగాడు.

కాబిన్ మాస్టర్ ఫోన్ తీసి డ్యూటీ ఎ. యస్. యమ్‌ను పిలిచాడు. "హలో! ఈస్ట్ అవుట్ కాబిన్ మాస్టర్‌నండీ! షటిల్ సర్వీస్ డీసెల్ స్పీడ్ ట్రాక్ బ్రిడ్జ మీద నుండి ముందుకు కదలడంలేదు. సిగ్నల్ ఇచ్చి పావుగంటయినా అలాగే వుంది. కనీసం వార్నింగ్ సైరన్ కూడా ఇవ్వడంలేదు."

"హలో! హలో! వాట్ ది హెల్! ఏమొచ్చింది ఆ డ్రైవర్‌కి, బండి స్టేషన్‌లోకి రాగానే మెమో ఇవ్వాలి రాస్కెల్‌కి; షటిల్ లేట్ అయిందంటే మా ప్రాణాలు తోడేస్తాడు డి. యమ్" అంటున్నాడు డ్యూటీ స్టేషన్ మాస్టర్.

"పాయింట్స్‌మన్‌ని ట్రైన్ దగ్గర కెళ్ళమని ఇప్పుడే డిస్పాచ్ చేశాను."

"గుడ్...గుడ్...ఆ వెధవ త్వరగా ట్రాక్ క్లియర్ చెయ్యకపోతే ట్రాఫిక్ ఆగిపోతుంది. నేనిప్పుడే యల్. యమ్‌కి, సూపర్నెంటుకు ఇన్‌ఫాం చేస్తాను" అన్నాడు డ్యూటీ ఎ. యస్. ఎమ్ ఫోన్ పెట్టేస్తూ.

విషయం వినగానే స్టేషన్‌మాస్టర్ రాజం కుర్చీలోంచి ఎగిరిపడ్డాడు.

"కృష్ణా కెనాల్ ఎ. యస్. ఎమ్. నుండి డిపార్చర్ రిపోర్టు వచ్చిందా? ఎంత సేపయింది వచ్చి?" కరుస్తున్నట్లు అడిగాడు.

"ఎనిమిది ఇరవై ఆరుకు వాళ్ళ ఔటర్ దాటిందండి."

"మన వెధవలు సిగ్నల్ ఇచ్చారా?"

"ఇచ్చి పావుగంటయిందండి."

"వాట్స్ రాంగ్...బాస్టర్డ్స్..." ఎవర్ని తిడుతున్నాడో తనకే తెలియడంలేదు రాజంకు. "ఇలా నడిపితే సర్వీసులు నడిపినట్లే. మళ్ళా రింగ్ చెయ్యి కాబిన్ మాస్టర్‌కు" అన్నాడు హడావిడిగా.

అంటూండగానే రాజం బల్లమీది ఫోన్ మ్రోగింది. "యస్!" అన్నాడు రాజం ఫోనెత్తి.

"డిసీజ్ ట్రాఫిక్ కంట్రోల్. వాట్స్ ది మాటర్ విత్ ది షటిల్ సర్వీస్. ఇంకా బండి స్టేషన్లోకి ఎందుకు

రాలేదు" అవతల కంట్రోలర్ గర్జిస్తున్నాడు.

"సెర్చ్ మి. అయామ్ ట్రయ్యింగ్ టు ఫైండవుట్" షీంకరించాడు రాజం. బల్లమీది మరో టెలిఫోన్ మ్రోగింది. మరోచేత్తో ఆ టెలిఫోన్ అందుకొన్నాడు.

"డిసీజ్ కృష్ణాకెనాల్/డ్యూటీ యస్. ఎమ్. పటిల్ సర్వీస్ సెకండ్ క్లాస్ బోగీలు రెండు డిలింక్ అయి వెనక్కి వచ్చేశాయి" కృష్ణా కెనాల్ స్టేషన్‌మాస్టర్ గొంతులో కంగారు స్పష్టంగా వినిపిస్తోంది.

"సెకండ్ క్లాస్ బోగీస్...వాట్" మతిపోయినవాడికి మల్లే అరిచాడు రాజం.

"హలో...డిసీజ్ కంట్రోల్...ఆన్సర్ మి..." అరుస్తున్నాడు కంట్రోలర్ మరో ఫోన్లో.

బయట డ్యూటీ యస్. ఎమ్. ఫోన్లు మ్రోగడం మొదలెట్టాయి. అంతా హడావిడి. గందరగోళం. విజయవాడ జంక్షన్‌లో రైల్వే ఆఫీసర్లందరూ మరో అరగంటలో గుండె దడతో చెమటలు క్రక్కుతున్నారు.

# 6

ట్రైన్‌లో అందరి ముఖాల వంకా పరీక్షగా చూశాడు విక్రం. అందరి భావాలూ ఒకేలా కనిపించాయి. భయం, ఆందోళన, ఏం జరుగుతుందో తెలియని అయోమయ స్థితి.

మొత్తం పాసింజర్లను ఓసారి లెఖ్ఖపెట్టాడు. మొత్తం పదిమంది వున్నారు. ఇద్దరు ఆడవాళ్ళు, ఎనిమిదిమంది మొగవాళ్ళు. నలభైసీట్లలోనూ అక్కడక్కడా కూర్చొని వున్నారు.

"నౌ! లేడీస్ అండ్ జంటిల్‌మన్! మేం చెప్పినట్లు తూ. చ. తప్పకుండా చేస్తే ఎవ్వరికీ, ఏ ప్రమాదమూ జరక్కుండా ఇంటికి చేరుకోగలరు. ఏవిధమైన గలాభా

సృష్టించాలని ప్రయత్నించినా మీ ప్రాణాలను వృధాగా పోగొట్టుకొంటారు'' అన్నాడు అందరికీ వినిపించేలా గట్టిగా విక్రమ్.

''ఎవరు మీరు? ఇలా రైలును బ్రిడ్జి మధ్యలో ఆపేసి మమ్మల్ని బెదిరించడంలో మీ ఉద్దేశ్యమేమిటి?'' వణుకు తున్న గొంతుతోనే ధైర్యంగా అడిగాడు సుబ్బారావు.

''దటీజ్ నన్ ఆఫ్ యువర్ బిజినెస్! మేమెవరమో ఏమిటో కాసేపట్లో తెలుస్తుంది. అంతవరకూ నోరు మూసుకు కూర్చోండి'' గనీ గొంతు కంపార్టుమెంటులో ప్రతిధ్వనించింది.

సేతుమాధవన్ మనసు రకరకాల ఆలోచనలతో ఉక్కిరిబిక్కిరవుతోంది. వీళ్ళెవరో తమను దోచుకోవడానికి ఈ రైలు ఆపినట్లున్నారు. రాస్కెల్స్ ఎలా తప్పించుకుపోతారనో. ఆ చేతిలో వున్నవి నిజం పిస్తోళ్ళేనా? జ్యోతి దగ్గర తన వ్యక్తిత్వం పెంచుకోవాలంటే ఇదే సమయం. చటుక్కున లేచి నిలబడ్డాడు.

''స్టాప్ ది ఫన్నీ గేమ్ జంటిల్‌మన్! డ్రైవర్ని వదిలిపెట్టి ట్రైన్ను ముందుకు పోనివ్వండి'' అన్నాడు సీటు దగ్గర్నుండి ముందుకు కదుల్తూ.

''అవును! దిసీజ్ నాన్సెన్స్! ఈ దుండగాన్ని చూస్తూ ఊరుకోకూడదు. వెనక రెండు బోగీల్ని డిలింక్ చేయడంలోనే వీళ్ళ ఉద్దేశ్యం అర్థమవుతుంది'' అన్నాడు విల్సన్ సీటుమీదనుండి లేవకుండానే.

సేతుమాధవన్ భయంగానే రెండడుగులు ముందుకు వేశాడు.

''సిడవున్ మిస్టర్!'' ప్రశాంతంగా అన్నాడు విక్రమ్.

అందరూ సేతుమాధవన్ వంకే చూస్తున్నారు. ఉన్నట్లుండి భయం పోయి, తెగింపు వచ్చింది సేతుమాధవన్‌కి. ఇంతదూరం వచ్చాక వెనక్కి తిరిగి కూర్చోవడం అవమానకరం. జ్యోతి దృష్టిలో తను మరింత చులకన అయిపోతాడు. మరో రెండడుగులు ముందుకు వేశాడు.

రాజా, జానీ ఇద్దరూ పిస్తోళ్ళు పట్టుకొని గురిపెట్టి నిలబడివున్నారు. గనీ చేతిలో గ్రనేడ్లు జీన్ జేబులో వేసుకొని బొడ్లోంచి పిస్తోలు తీసి జనంవైపు గురిపెట్టాడు.

విక్రం అడుగు ముందుకు వేశాడు. దూరంగా ఎక్కడో రైలుకూత వినబడింది. ఇద్దరికీ మధ్య అడుగున్నర దూరం వుంది. చటుక్కున పిస్తోలు పిడి వెనక్కి త్రిప్పి మెఱపులా సేతు గడ్డంమీద గుద్దాడు విక్రం.

సేతు 'అమ్మో' అని అరిచి మనిషంతా ఎవరో ఎత్తి పడేసినట్లు వెనక్కి ఎగిరి ఉండలా కూలిపోయాడు. ప్రక్కసీట్లోని సుబ్బారావు చటుక్కున లేవబోయి, విక్రంచేతిలో పిస్తోలు చూసి రాయికిమల్లే కూర్చుండిపోయాడు.

ఎవ్వరూ కదల్లేదు. మాట్లాడలేదు. పరిమళకు భయంవల్ల, ఆందోళనవల్ల ఎక్కిళ్ళు వస్తున్నాయి. విక్రం, గనీకి సైగచేసి మళ్ళీ జనంవైపుకు తిరిగాడు.

"నేనన్న మాటలో నిజం మీకు ఇప్పుడర్థమై వుంటుంది. ఈసారి అతన్లా ఎవరైనా పిచ్చివేషాలు వెయ్యాలని ప్రయత్నిస్తే నిజంగా కాల్చి చంపుతాను... నా: ఒకొక్కరూ మెల్లిగా లేచి ఆమధ్య నున్న రెండు వరసల్లో కూర్చోండి. అటు అయిదుగురు, ఇటు అయిదుగురు ఎదురెదురుగా కూర్చోండి."

మెల్లిగా ఒక్కొక్కరే విక్రం చెప్పినట్లు మధ్య వరసలో వున్న పది సీట్లలో సర్దుకొన్నారు. సేతుమాధవన్ స్పృహపోయి అలానే క్రింద పడి వున్నాడు.

ఈలోగా గనీ బాక్సులో నుండి రెండు లౌడ్ స్పీకర్లు, ఆంప్లిఫయరు, బ్యాటరీ బయటకు తీశాడు. రాజా వచ్చి ఒక స్పీకర్ని వెనకవైపుకు తీసుకెళ్ళి వెనక భాగంలో వున్న రెండు అద్దాల కిటికీల్లో ఓ అద్దం పగలగొట్టి లౌడ్ స్పీకర్‌ను వైర్‌తో కట్టేశాడు. కృష్ణాకెనాల్ వైపుకు మైక్ తిన్నగా వుంటుందన్నమాట. గనీ రెండవ మైక్‌ను డ్రైవర్ కాబిన్ కిటికీలోనుండి విజయవాడవైపుకు వుండేలా కట్టాడు. తర్వాత రెండు లౌడ్ స్పీకర్లనూ వైర్లతో ఆంప్లిఫయర్‌కి, బ్యాటరీకి కనెక్టు చేసి మైక్‌ను విక్రమ్ చేతికిచ్చాడు.

"రాజాకు ఓ కార్బయిన్ ఇచ్చి, ఒకటి కాబిన్‌లో పెట్టు" అన్నాడు విక్రమ్ గుసగుసలుగా.

గనీ పెట్టెలోనుండి రెండు కార్బయిన్‌లు బయటికి తీశాడు. చిన్నసైజు స్టెన్‌గన్స్‌లాంటివి అవి. పదిమంది మీదా పిస్తోలు గురిచేసి నిలబడ్డ జానీని చూసి చిన్నగా నవ్వి కన్నుకొట్టి రాజాకు కార్బయిన్ అందించాడు.

రాజా కార్బయిన్ తీసుకొని ఓసారి మాగజైన్ చెక్ చేసి, వెనకవైపు అద్దం పగలగొట్టి లౌడ్ స్పీకర్ ఫిట్ చేసిన కంతలోనుండి బయటకు చూస్తూ నిలబడ్డాడు. అంటే ఇక కృష్ణాకెనాల్ వైపునుండి ఎవరు ట్రైన్ వైపు వచ్చినా ఆ బాధ్యత రాజాదన్నమాట.

విక్రం, గనీవైపు చూసి, "టేక్ కేర్ ఆఫ్ దెమ్" అని కాబిన్‌లోకి నడిచాడు.

అంటే కంపార్టుమెంట్‌లో పదిమందికీ జానీ, గనీలు కాపలా కాస్తోంటే, డీసిల్ కారు వెనకవైపు రాజా, ముందువైపు విక్రం డిఫెన్స్ వున్నారన్నమాట.

'చాలా పకడ్బందీగా వుంది వీళ్ళ ప్లాను. ఏం చేస్తారో? అసలు ప్రాణాలతో బయటపడగలమో, లేదో' అనుకొన్నాడు గురుమూర్తి గుడ్లు మిటకరిస్తూ.

'ఏం చెయ్యబోతున్నారు వీళ్ళు?' అందరి మనసుల్లో అదే ప్రశ్న!!!

## 7

డ్రైవర్ కాబిన్లో సీట్లో కూలబడి సిగరెట్ వెలిగించాడు విక్రమ్. టైము చూసుకొన్నాడు. తొమ్మిదికి యింకా అయిదు నిముషాలుంది. బండి స్టేషన్‌లోకి రాకుండా ఇక్కడే ఆగిపోతే ఇంకా ఎవరూ రారేం అనుకొన్నాడు డ్రైవర్ సీటుకు ముందువున్న విండో షీల్డ్ అద్దాన్ని పైకి ఎత్తి ఆ ఖాళీ ప్రదేశంలోనుండి ట్రాక్ పొడుగునా వంతెన చివరికంటూ చూస్తూ.

దూరాన ఎవరో నీలంరంగు యూనిఫాం వ్యక్తి ఎర్ర జెండా ఊపుతూ వంతెనమీదకు రావడం కనిపించింది.

వెనక్కు తిరిగి, "ఎవరో వస్తున్నారు. జాగ్రత్తగా వుండండి" అన్నాడు.

జూనియర్ పాయింట్స్‌మన్ తనను ఇంతదూరం నడిపించిన డ్రైవర్ని తిట్టుకొంటూ జండా ఊపుతూ, జాగ్రత్తగా అడుగులువేస్తూ ట్రైన్‌కు సమీపంగా రాసాగాడు.

సరిగ్గా ట్రైనుకు యాభైగజాల దూరంలో వుండగా సైరన్ మోగించాడు విక్రమ్. పాయింట్‌మన్ ఆగిపోయి ఎర్రజెండా విపరీతంగా ఊపసాగాడు. ట్రైను ముందుకు

కదలడంలేదని గమనించగానే గబగబా ముందుకు వచ్చాడు.

కొద్దిక్షణాల్లో అతనికి కలిగే షాక్‌ను ఊహించుకొని మనసులోనే నవ్వుకొన్నాడు విక్రమ్. డ్రైవరు అయిదు గజాల దూరానికి రాగానే మైక్ స్విచ్ ఆన్ చేసి, కిటికీ ఖాళీలోనుండి కార్బయిన్ బయటకు పెట్టాడు.

"హలో! అక్కడే ఆగు. ఇంకా ముందుకు రాక" అన్నాడు మైక్‌లో గట్టిగా.

ఉలిక్కిపడి చటుక్కున ఆగిపోయాడు పాయింట్ మన్. బాగా దగ్గరికి వచ్చేవరకూ అతను కిటికీ ప్రక్కనే వున్న స్పీకర్‌ని గమనించలేదు.

"ఏమిటది? బండి ఎందుకు ఆగిపోయింది" అరుస్తున్నాడు పెద్దగా.

మైక్‌లో గట్టిగా నవ్వాడు విక్రమ్. "ఇక బండి ముందుకు రాదు. మెల్లిగా ఒక్కొక్క అడుగే వేస్తూ ముందుకు రా" అన్నాడు.

పాయింట్‌మన్‌కు తను వింటున్నది, చూస్తున్నది ఏమాత్రం తలకెక్కడంలేదు. కాని ఏదో జరగకూడనిది జరుగుతున్నట్లు మాత్రం అర్థమయింది. అలాగే నిలబడి డీసిల్ కార్ వైపు పరకాయించి చూశాడు. కాబిన్ గదిలో విక్రమ్ నిలబడి తనవైపే చూడ్డం గమనించాడు. ఎవరతను? డ్రైవరా?

"అలా నిలబడ్డావేం. మెల్లిగా ముందుకురా" అన్నాడు విక్రం మైక్‌లో.

అతను ముందుకు కదిలాడు. డీసిల్ కార్‌కు ఇంకా రెండు గజాలుండగానే తుపాకిలాంటి ఆయుధం తన వైపు గురిచేసి వుండడం చూసి చటుక్కున ఆగిపోయాడు.

"చూశావుగా, ఈ కార్బాయిన్‌లో బండికి దగ్గరగా వచ్చినవాళ్ళ నెవరినయినా కాల్చి చంపొచ్చు" అన్నాడు విక్రమ్ అతన్నే పరీక్షగా చూస్తూ.

పాయింట్స్‌మన్ కాళ్ళలో వణుకు ప్రారంభమైంది. కళ్ళు తిరిగి బ్రిడ్జిమీదనుండి జారి క్రింద నదిలో పడిపోతాడేమో అనిపించింది. గుడ్లప్పగించి కార్బాయిన్ వైపు చూస్తూ వుండిపోయాడు. అతను చూస్తుండగానే విక్రమ్ తెల్లటి కవరొకటి విండ్‌షీల్డ్ అద్దం ఎత్తిన ఖాళీలోంచి బయటకు పెట్టాడు.

"ఈ కవర్ని తిన్నగా తీసుకెళ్ళి మీ స్టేషన్‌మాస్టర్‌కి ఇయ్యి. వెళ్ళు" అన్నాడు ఒక్కొక్క పదమే వత్తి, స్పష్టంగా పలుకుతూ.

# 8

విజయవాడ డివిజనల్ ఆఫీసు కాన్ఫరెన్స్ రూమది. దీర్ఘచతురస్రంగా వున్న టేబిల్ ముందు రకరకాల అధికారులు కూర్చొనివున్నారు. ఎయిర్ కండిషనర్ చల్లదనం వారిలో వేడిని ఏమాత్రం తగ్గించలేకపోతోంది.

జిల్లా కలెక్టర్, సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్, టౌన్ స్పెషల్ ఆఫీసర్, పోలీస్ స్పెషల్ బ్రాంచ్ సీనియర్ ఇన్‌స్పెక్టర్, రైల్వే తరపున డివిజనల్ మేనేజర్, ఆర్. పి. యఫ్., డి. ఐ. జి. అందరి ముఖాల్లో ఆందోళన స్పష్టంగా కనిపిస్తోంది.

"జంటిల్‌మన్. భారత రైల్వే చరిత్రలో ఇలాంటి సంఘటన జరగడం ఇదే మొదటిసారి. అది మన డివిజన్లో జరగడం మన దురదృష్టం" అన్నాడు డి. యమ్. రాజం ఉపోద్ఘాతంగా.

"ఓ.కె. ఓ.కె. మేకిట్ బ్రీఫ్ మిష్టర్ రాజం. ఇంతకీ ఆ దుండగులు ట్రైన్‌ను ఆపి పాసింజర్లను బందీలుగా తీసుకొన్నదెందుకు" అన్నాడు కలెక్టర్ అసహనంగా.

రాజమ్ తన ముందుబల్లమీద వున్న ఓ తెల్లటి కవర్ లోంచి ఓ కాగితం బయటకు తీసి మడతలు విప్పాడు.

"ఈ ఉత్తరం ట్రైన్ ఎందుకు ఆగిందో కనుక్కోవడానికి వెళ్ళిన జూనియర్ పాయింట్స్‌మన్ కిచ్చి పంపించారు వాళ్ళు. స్టేషన్‌మాస్టర్ ఈ ఉత్తరం నాకందించిన మరుక్షణం మీ అందరికీ ఫోన్ చేసి పిలిపించాను."

"ఏమి వ్రాశారు?"

"చదువుతాను వినండి" అన్నాడు రాజం కళ్ళజోడు ఓసారి సవరించుకొని చదవడం మొదలెడుతూ.

"డీసిల్ కార్ ఫస్ట్‌క్లాస్ పాసింజర్లు, మీ డ్రైవరు మా చేతిలో బందీలు అన్న విషయం నీకు అర్థమయే వుండాలి. మూడుగంటల్లోగా పదిలక్షలరూపాయలు మా కందించకపోతే ఈ ప్రయాణీకులందర్నీ ఒక్కొక్కర్నే చంపి క్రింద కృష్ణానదిలో పారేస్తాము. ఇదీ జరగబోయే కార్యక్రమం.

అంతేకాక, మా అనుమతి లేకుండా ట్రైను సమీపంగా ఈలోగా ఎవరయినా రావడానికి సాహసించినా, మాకు ఇబ్బంది కలిగించే ఏ ఇతర ప్రయత్నాలు చేసినా, మీరు చేసే ప్రతి తప్పుకు ఓ పాసింజరు బలైపోతాడని గుర్తు పెట్టుకోండి. మీ సమాధానాన్ని వైర్‌లెస్‌లో 31.205 వేవ్ లెంగ్త్ మీద తెలియజెయ్యండి."

సంతకం లేదు. ఎవరో ఆర్టిస్టు వ్రాసినట్లు అక్షరాలు అందంగా, చక్కటి వరుసలో వున్నాయి. అందరూ

ఉత్తరాన్ని స్వయంగా చదివేవరకూ ఎవరూ ఏమీ మాట్లాడలేదు.

"డామిట్! ఎవరో టెర్రరిస్టుల్లా వున్నారు వీళ్ళు. దుండగులు ఎంతమందో ఏమయినా తెలిసిందా?" అడిగాడు క్రిష్ణా యస్. పి.

"లేదు. ఉత్తరం అందించిన వాణిమాత్రం మా పాయింట్స్‌మన్ చూశాడు" అన్నాడు రైల్వే ప్రొటెక్షన్ ఫోర్స్ డి. ఐ. జి.

"ట్రైన్‌లో పాసింజర్లు ఎంతమంది వున్నారో తెలుసా?" అడిగాడు కలెక్టరు.

"ఖచ్చితంగా తెలియదు. గుంటూరునుండి ఇన్‌ఫర్మేషన్ అడిగాను. రోజూ ఓ పదిమందివరకూ ఈ ట్రైనుకు వెళతారని తెలిసింది. అదీకాక ఆ ట్రైనుకు ఈ రోజు నాలుగు ఫస్ట్‌క్లాస్ టికెట్లు అమ్మారట. మంగళగిరిలో మరో రెండు ఫస్ట్‌క్లాస్ టికెట్లు అమ్మినట్లు వార్త వచ్చిందిప్పుడే. అంటే ఆ దుండగులతో కలిపిగాని, వాళ్లు కాకుండాగాని దాదాపు పదహారుమంది వుండవచ్చు ట్రైన్లో" అన్నాడు డి. యమ్. రాజం.

"ఓ. కె. జంటిల్‌మన్. ఇప్పుడు చెప్పండి. సెక్యూరిటీ మెజర్స్ ఏం తీసుకోవాలి? ఈ విషయం హేండిల్ చేయడానికి మీ సలహాలు ఏమిటి? వాళ్ళు నిజంగా కిరాతకులైనా కాకపోయినా, లోపలవున్న ప్రయాణీకుల దృష్ట్యా మనం అతి జాగ్రత్తగా చర్యలు తీసుకోవాలి."

"ముందు ఆ రెండు వంతెనల ప్రాంతానికి ఎవ్వరూ వెళ్ళకుండా గట్టి కట్టుదిట్టాలు ఏర్పాటుచెయ్యాలి" అన్నాడు స్పెషల్ ఆఫీసరు.

"యస్. యస్. యూ ఆర్ రైట్. అందుచేతే

విషయం తెలియగానే వంతెన రెండువైపులకు ఓ ఆర్. పి. యఫ్. దళాన్ని కాపలాకు పంపించాను. అఫ్‌కోర్స్ స్ట్రిక్టు ఆర్డర్స్ ఇచ్చాను వాళ్ళకి. వంతెనమీదకు వెళ్ళకుండా అప్రోచెస్ మాత్రమే కాపలా కాయమని" అన్నాడు ఆర్. పి. యఫ్. డి. ఐ. జి.

అందరూ అంగీకారసూచకంగా తలలు ఊపారు.

"నెక్స్ట్ క్వశ్చెన్ యీజ్ ట్రాఫిక్. బ్రిడ్జికి రెండు వైపులా ట్రాఫిక్ ఓ గంటసేపు ఆపేయమని ఇన్‌స్ట్రక్షన్స్ ఇచ్చాను" అన్నాడు రాజం.

"వెరీ వెల్! అంతేకాదు. నేను వెంటనే స్టేట్ గవర్నమెంట్‌కి, చీఫ్ మినిస్టర్‌కి ఇన్‌ఫాం చేస్తాను. అవసరమైతే ఆర్మీ హెల్ప్ తీసుకొందాం మనం. ఆ డీసిల్ కార్లో వున్న ప్రయాణీకుల ప్రాణాలు ముఖ్యం మనకి. రైల్వే మినిస్ట్రినుండి, హోంశాఖనుండి పాజిటివ్ ఇన్‌స్ట్రక్షన్స్ వచ్చేవరకూ వాళ్ళను ఏదో రకంగా ఆపాలి" అన్నాడు కలెక్టర్ చకచక తన ఆలోచనలు బయటపెడుతూ.

"అవును. ఆ పదిలక్షలు ఇస్తామనే ముందు వాళ్ళకి ఇన్‌ఫాం చెయ్యాలి" అన్నాడు రాజం.

డి. ఐ. జి. కాలింగ్ బెల్ నొక్కాడు. లోపలకు వచ్చిన గార్డుతో వైర్‌లెస్ ఆపరేటర్ని లోపలకు పంపమని చెప్పాడు.

# 9

కాబిన్ కిటికీలోనుండి చివరికంటా కాలిన సిగరెట్‌ను బయటికి విసిరేసి, టైము చూసుకొన్నాడు విక్రమ్. తొమ్మిదిన్నరయ్యింది. ఆ ఉత్తరం వాళ్ళకు అంది దాదాపు అరగంట అయింది. వాళ్ళు సమాధానం చెప్పడానికి ఈ టైము చాలు అనుకొన్నాడు.

మరో సిగరెట్ వెలిగించి నిర్మానుష్యంగా కనిపిస్తోన్న వంతెన ముఖద్వారంవైపు చూస్తూ వుండిపోయాడు. విక్రం చూస్తూండగానే ఖాకీ యూనిఫాంలో వున్న ఆర్. పి. యఫ్. జవాన్లు వంతెన ముఖద్వారం దగ్గర, నది ఒడ్డమ్మట రైఫుల్స్ పట్టుకొని నిలబడడం కనిపించింది.

మనసులోనే నవ్వుకొని ఓసారి కార్బ్రయిన్ మేగజైన్ సరిచూసుకొన్నాడు. వాళ్ళెవరికీ వంతెనమీదకు వచ్చే ధైర్యం వుండదని తెలుసు. ట్రైన్‌లో వుండే పాసింజర్లు తమకు ఇన్సూరెన్సు పాలసీలు.

"విక్రం!" రాజా కేక వినిపించింది వెనకనుండి. బహుశా వంతెనకు అవతలివైపుకూడా ఆర్. పి. యఫ్. కాపలాకు వచ్చుండాలి.

"టేకిట్ ఈజీ! వాళ్ళు వంతెనమీదకు రారులే" అన్నాడు విక్రం వెనక్కు తిరిగి.

"నో...నో...కొంతమంది అవతల వంతెనమీదకు వస్తున్నారు" అరిచాడు రాజా జవాబుగా.

'ఫూల్స్! ఆ బెటాలియన్ ఇన్‌స్పెక్టర్ యెవడో ఆర్డర్స్ సరిగా అర్థంచేసుకొని వుండడు' అనుకొన్నాడు విక్రం ఓసారి వంతెన పొడవునా చూసి కంపార్టుమెంటులోకి వస్తూ.

విక్రంను చూసి గనీ ఏం చేద్దామన్నట్లు చూశాడు. తొందరపడవద్దన్నట్లు కళ్ళతోనే సైగచేసి కిటికీలోనుండి జాగ్రత్తగా అవతలి వంతెనవైపు తొంగిచూశాడు. నలుగురు ఆర్. పి. యఫ్ జవాన్లు వంతెన ఇనుపకమ్మీలవెనుక నక్కుతూ మెల్లిగా ట్రైను సమీపానికి వస్తున్నారు.

"కిటికీ షట్టర్లు మూసేయి" అన్నాడు జానీవైపు చూసి విక్రం.

జానీ చకచక కిటికీలకు వుండే ఇనుప షట్టర్లు క్రిందికి దించేశాడు. గనీమాత్రం తన పిస్తోలు ప్రయాణీకులమీద నుండి ప్రక్కకు తిప్పలేదు.

"విక్రం! దె ఆర్ కమింగ్ వెరీ క్లోజ్" అరిచాడు రాజా అసహనంగా.

"టేకిట్ ఈజీ మాన్. నేను ముందు వాళ్ళకు వార్నింగ్ ఇస్తాను. నువ్వు తొందరపడకు" అన్నాడు వంగి తెరిచివున్న బాక్స్‌లోనుండి వైర్‌లెస్ ట్రాన్స్ రిసీవర్ బయటకు తీసి తనతోపాటు కాబిన్‌లోకి తీసుకు వెళుతూ.

ట్రాన్స్ రిసీవర్ ఓ ప్రక్కన పెట్టి, అంతకుముందే అరేంజ్ చేసివున్న మైక్‌ను చేతిలోకి తీసుకొని కాబిన్ విండోలోంచి బయటకు తొంగిచూశాడు విక్రం.

ఒక ఆర్. పి. యఫ్. జవాను అప్పటికే కృష్ణా కెనాల్ వైపునుండి అవతల వంతెనమీద ట్రైన్‌కు వందగజాల దూరంలోకి వచ్చేశాడు.

విక్రం మైక్ స్విచ్ ఆన్ చేసి, "ఆర్. పి. యఫ్. ప్లీజ్ గెట్ బాక్! వంతెనమీద వున్న నలుగురు జవాన్లూ వెంటనే వెనక్కి తిరిగి వెళ్ళిపోవాలి. ఐ రిపీట్! ప్లీజ్ గెట్ బాక్" అరిచాడు. విక్రం అరుపు వంతెనమీద ప్రతిధ్వనించింది.

క్రొత్త వంతెనమీద మెల్లిగా ముందుకు జరుగుతోన్న ఆర్. పి. యఫ్. జవాన్లు నలుగురూ శిలాప్రతిమల్లా నిలబడి పోయారు. విక్రం కొద్దిగా తల త్రిప్పి విజయవాడ వైపు చూశాడు. లౌడ్‌స్పీకర్లు డీసిల్ కార్‌కు రెండువైపులా అమర్చడంవలన మైక్‌లో ఏం చెప్పినా రెండు పక్షాల

వాళ్ళకూ వినిపిస్తుంది. పదిమంది ఆర్. పి. యఫ్. లు విజయవాడవైపు నిలబడి ఆశ్చర్యంగా చూస్తున్నారు.

"క్రొత్త వంతెనమీదకు వచ్చిన ఆర్. పి. యఫ్. లు వెంటనే వెనక్కి వెళ్ళిపోవాలి. దిసీజ్ లాస్ట్ వార్నింగ్" అరిచాడు విక్రం మళ్ళీ.

అయినా వంతెనమీద జవాన్లు కదల్లేదు. ఇనపకమ్మీల్ని అడ్డంగా వుంచుకొని అలానే నిలబడిపోయారు. నిముషం పాటు అలానే చూశాడు విక్రం. అవతలి వంతెనమీద కదలికలేదు. విక్రం ముఖం విసుగుకొంది.

అందరికన్నా ముందువున్న ఆర్. పి. యఫ్. రెండు చేతుల్లో రైఫుల్ పట్టుకొని మెల్లిగా ఇనపకమ్మీలమీద పాకొంటూ ముందుకు జరుగుతున్నాడు. వెనక ముగ్గురూ స్థంభాల వెనక నిలబడి వుండడం లీలగా కనబడుతోంది.

"రాజా! ముందు వచ్చేవాణ్ణి నాకొదిలెయ్! వెనక ముగ్గుర్నీ నువ్వు చూసుకో" అన్నాడు విక్రం కార్బయిన్ పొజిషన్లోకి తెచ్చుకొంటూ...

"ఓ. కె." అన్నాడు రాజా.

విక్రం చెయ్యి ట్రిగ్గర్ మీద బిగుసుకొంది. మరుక్షణం రెండు వంతెనలూ కార్బయిన్ గుళ్ళ ప్రేలుళ్ళతో మారు మ్రోగాయి.

ముందు వస్తోన్న ఆర్. పి. యఫ్. శరీరం కార్బయిన్ గుళ్ళతో తూట్లుపడి, వంతెన కమ్మీల మధ్యనుండి జారి కృష్ణా ప్రవాహంలో పడి సుళ్ళు తిరుగుతూ కొట్టుకు పోసాగింది.

# 10

"వాళ్ళను వంతెనమీదకు వెళ్ళమని ఆర్డరిచ్చిన ఫూల్ ఎవడు? ఆ వెధవను పట్టుకొని వెంటనే డిస్మిస్ చేసి తోలు

వలిచేయండి" అరుస్తున్నాడు డి. యమ్. రాజం వంతెన మీద కాల్పుల వార్త చేరగానే.

"యస్. యస్. ఇన్‌స్పెక్టర్‌ని రిలీవ్ చేసి నెక్స్టు సీనియర్‌కు ఇంచార్జి ఇమ్మని ఇప్పుడే మెసేజ్ పంపాను" అన్నాడు డి. ఐ. జి.

"రిలీవ్ చెయ్యడమా? డామిట్. కాల్చిపారేయాలి వెధవని. వంతెనమీదకు వెళ్ళవద్దని స్ట్రిక్టు ఆర్డర్స్ ఇచ్చినా తల కెక్కించుకోలేదంటే ఏమనుకోవాలి? గ్రాస్ ఇన్ సబార్డినేషన్ రాస్కెల్" పిచ్చి కోతిలా గంతులేస్తున్నాడు రాజం.

"ఎనీ కాజువాల్టీస్?" అడిగాడు సిటీ స్పెషల్ ఆఫీసరు.

"వన్ డెడ్. వన్ ఊండెడ్. మిగిలిన ఇద్దరూ వెనక్కి పారిపోయొచ్చారు. నీళ్ళలోకి పడిపోయినతను చనిపోయాడని ఊహిస్తున్నాము. బాడీకోసం వెతుకుతున్నారు. గాయపడిన మరో జవాన్ ఇంకా వంతెన మధ్యలో అలానే వున్నాడు" అన్నాడు డి. ఐ. జి.

"మైగాడ్! సీరియస్ వూండ్ అయితే బ్లీడింగ్ వల్ల రక్తం కారి అతను చనిపోవచ్చు. డూ సమ్ థింగ్ టు గెట్ హిమ్ బాక్" అరిచాడు రాజం కీచుగా.

రాజం కోపంగా ఓ మూల కూర్చొని ఓపిగ్గా ట్రైన్ హైజాకర్స్‌కి మెసేజ్ సిగ్నల్స్ పంపుతున్న సిగ్నల్‌మన్ వైపు తిరిగాడు.

అదే సమయంలో___

"కాలింగ్ డీసిల్ సర్వీస్ ఆన్ థర్టీవన్ పాయింట్ జీరో ఫైవ్ ... కాలింగ్ ...?" పిలిచాడు సిగ్నల్‌మన్ వాల్యూం పెంచుతూ.

రిసీవింగ్ సెట్‌లో కరకర ఏదో శబ్దం అయింది.
"డిసీజ్ డీసెల్ సర్వీస్ రిసీవింగ్...డు యు రీడ్ మి" అవతలనుండి విక్రం గొంతు వినిపించింది.

"యస్...యస్...వియ్ రీడ్‌యు లౌడ్ అండ్ క్లియర్...గో హెడ్..." అన్నాడు సిగ్నల్‌మన్.

"గుడ్! ఇకనుండి మన కమ్యూనికేషన్స్‌కు కోడ్ వర్డు 'ఆపరేషన్ మిలియన్' అర్థమయిందా? రిపీట్" అవతల విక్రం గొంతు.

"కోడ్ వర్డ్ ఆపరేషన్ మిలియన్...గో ఎ హేడ్!"

"గుడ్! ఇంచార్జి ఎవరు?" అడిగాడు విక్రం.

సిగ్నల్‌మన్ రాజంకు మౌత్‌పీస్ అందించాడు."డిసీజ్ జనరల్ మానేజర్ రాజం! మీ వుత్తరం అందింది."

"గుడ్ మిస్టర్ డి. యమ్. ఉత్తరం జాగ్రత్తగా చదివారు కదా? ఇప్పుడు సరిగ్గా తొమ్మిదినలభైఅయిదు అయింది. ఇంకో రెండు గంటల్లో...అంటె పదకొండూ నలభైఅయిదుకల్లా పది లక్షల రూపాయలు మాకు ఇవ్వక పోతే ఈ డీసెల్ కారులో వున్న ప్రయాణీకుల ప్రాణాల మీద మీరు ఆశ వదులుకోవచ్చు."

"లుక్ మిస్టర్! నా బాధ్యతగా మిమ్మల్ని హెచ్చరిస్తున్నారు. ఇలా దౌర్జన్యంచేసి ఆ డబ్బు తీసుకొని మీరు తప్పించుకొని పారిపోలేరు. ఇప్పటికే మీ దౌర్జన్యానికి ఓ మనిషి చనిపోయాడు. ఇప్పటికయినా లొంగిపోతే శిక్ష తగ్గుతుంది. నేరం చేసి తప్పించుకోలేరు మీరు" అన్నాడు రాజం గుళ్ళో స్వాములవార్లా.

"కట్ ది క్రాప్" విక్రం గొంతు గర్జించింది. "తప్పించుకొనే విషయం మాకొదిలేయ్. మీ ఆర్. పి. యఫ్ మనుషులు మేము చేసిన హెచ్చరిక వినకుండా

ముందుకు వచ్చిన ఫలితం చూశారుగా. మరో రెండు గంటల్లో పది లక్షలూ అందకపోతే మరో శవానికి మీరు అంత్యక్రియల ఏర్పాట్లు చెయ్యాల్సి వుంటుంది.”

“నో...నో...అలాంటి పని చేయకండి. మీ పది లక్షలూ ముట్టచెపుతాము. కాని రెండుగంటల వ్యవధి చాలదు. మరో మూడు గంటలు. అంటె రెండూనలభై అయిదువరకూ ఆగండి. పది లక్షలు ఒకేసారి సమకూర్చాలంటే కష్టం...” రాజం దీనంగా బ్రతిమాలుతున్నాడు.

“నథింగ్ డూయింగ్. పదకొండూ నలభైఅయిదుకల్లా పది లక్షలు మాకందాలి. మరో విషయం. ఆ పదిలక్షలు చిన్న చిన్న నోట్ల రూపంలో కావాలి. అయిదులు, రెళ్ళు, ఒకట్ల రూపంలో కావాలి. పదులైనా పర్వాలేదు. అంత కన్న పెద్ద విలువ నోట్లు అక్కరలేదు. డబ్బు సేకరించేప్పుడు ఈ విషయం గుర్తుంచుకో...”

గదిలో సంభాషణ వింటున్న వాళ్ళందరికీ ఒక్క క్షణం వూపిరి ఆగినట్లయింది. పది లక్షల విలువకు చిల్లర నోట్లు తేవడం అంత తేలికయిన పని కాదు.

“సీ...మిష్టర్...బి రీజనబుల్! అంత పెద్ద మొత్తం చిల్లర నోట్లలో దొరకాలంటే కష్టం...” రాజం దీనంగా ప్రాధేయపడుతున్నాడు.

“దొరక్కపోతే ఉరి పోసుకో! మరో విషయం...ఆ నోట్లలో వేటికీ సీరియల్ నంబర్లు వుండకూడదు. అన్ని పాత నోట్లు కావాలి. గుర్తుంచుకో. కాల్ యూ ఎట్ క్వార్టర్ టు ట్వెల్వ్...గుడ్ బై!” విక్రమ్ స్విచ్ ఆఫ్ చేశాడు.

“డామ్...బగ్గర్ ... స్వయిన్ ...పిగ్ ... బాస్టర్డ్.”

నోటికొచ్చినట్లు తిడుతున్నాడు రాజం పిచ్చెక్కినవాడికి మల్లే.

బౌన్ స్పెషలాఫీసర్ రాజం చెయ్యి పట్టుకొని కుర్చీలో కూర్చోబెట్టాడు. "డోన్ట్ లూజ్ యువర్ హెడ్! వెంటనే బోర్డు వాళ్ళకు ఈ విషయం తెలియచేయండి" అన్నాడు.

రాజం నిముషంపాటు అతనివైపు గుడ్లప్పగించి చూశాడు. తరువాత కోపంనుండి తేరుకొని సిగరెట్ వెలిగించాడు.

"యస్...యు ఆర్ రైట్" అన్నాడు గబగబా రైల్వే బోర్డ్‌కి ఓ మెసేజ్ వ్రాసి మెసింజర్ చేతికిస్తూ.

"అంతే కాదు. రైల్వే మినిష్టర్‌నుండి ఆ డబ్బు వాళ్లకు ఇమ్మని క్లియరెన్స్ వస్తే, ఆ పది లక్షలూ మన దగ్గర సిద్ధంగా వుండాలి. వెంటనే స్టేట్ బాంక్‌కు ఇతర బాంకు లకు ఫోన్ చేసి చిల్లర నోట్లన్నీ అట్టిపెట్టమని చెప్పండి" అన్నాడు స్పెషల్ ఆఫీసరు.

"యస్ యస్. నిజమే" అన్నాడు రాజం టెలిఫోన్ ముందుకు లాక్కొని.

అరగంటలో విజయవాడ, గుంటూర్లలో వున్న అన్ని పెద్ద బ్యాంకులకూ కాష్‌కోసం రిక్వెజిషన్ పంపాడు.

# 11

విక్రం కొట్టిన దెబ్బకు స్పృహతప్పి పడిన సేతు మాధవన్‌కు మరో అరగంటవరకూ స్పృహ రాలేదు. తెలివి వచ్చిన తరువాత కూడా, నీరసంవల్ల, అవమానంవల్ల మరి కాసేపు అలానే క్రింద పడివున్నాడు. తర్వాత మెల్లిగా లేచి కూర్చున్నాడు మూలుగుతూ ప్రయాణీకులు కూర్చున్న రెండు వరసల మధ్య.

"ఆ మధ్యలో నుండి లేవకు. అలాగే కూర్చో" అన్నాడు గనీ తన పొజిషన్ ఏమీ మార్చకుండానే.

షట్టర్లు దించివేయడం వలన లోపల కాస్త చీకటిగా ఉక్కగా-వుంది. ప్రయాణీకులందరి మనస్సుల్లో ఆందోళన తగ్గి, ఏం జరుగుతుందోనన్న భయం, ఆతృత పెరుగుతున్నాయి. విక్రం ట్రాన్స్ రిసీవర్‌లో చేసిన సంభాషణ అందరికీ వినిపిస్తూనే వుంది.

సేతుమాధవన్‌ని చూసి జీవితంలో మొట్టమొదటి సారిగా జాలిపడ్డది జ్యోతి. హీరాయిజంకోసం కాని, లేక నిజంగానే కానీ, అమాత్రం ధైర్యం చూపగలవాళ్ళు మిగిలిన మొగాళ్ళలో ఎవరూ లేకపోయారు. కాల్పులు జరిగినప్పటినుండి అందరూ ఊపిరి పీల్చడం కూడా మానేసినట్లు ఒకరి ముఖాలొకరు చూస్తూ శిలాప్రతిమలకి మల్లే సమయం గడుపుతున్నారు.

'పాపం మాధవన్‌కి ఎవరైనా మంచినీళ్ళు ఇప్పిస్తే బావుణ్ను!' అనుకొంది జ్యోతి.

ప్రక్కనే కూర్చొన్న పరమళ సొమ్మసిల్లిపోయినదానికి మల్లే సీటులో జారగిలబడి కళ్ళు మూసుకొని వుంది.

సేతుమాధవన్ పెదాలు తడుపుకొంటున్నాడు నాలికతో. ఎడమ చెంపమీద దెబ్బ తగిలిన చోట నల్లగా కమిలిపోయి కనిపిస్తోంది.

"మిస్టర్ విక్రం...అతనికి కాస్త మంచినీళ్లు ఇప్పించండి" అన్నది జ్యోతి విక్రంవైపు చూసి.

క్షణంపాటు ఆశ్చర్యపోయాడు విక్రం ఆమెకు తన పేరెలా తెలిసిందా అని. మళ్ళీ గుర్తొచ్చింది ఇందాక రాజా తనను పేరుతో పిలిచినట్టు.

విక్రం క్షణంసేపు తటపటాయిస్తూ వుండిపోయాడు. నీళ్లు టాయిలెట్‌లో వుంటాయి. మాధవన్‌ని అందులోకి వెళ్ళనివ్వాలి లేదా తనన్నా తెచ్చివ్వాలి. కాని మాధవన్ ముఖంవైపు చూడగానే మళ్ళీ అతనికి తెలియకుండానే కోపం వచ్చింది. పిస్తోళ్ళు చూసి కూడా హీరోయిజమ్ ప్రదర్శింపబోయాడు వెధవ! మంచినీళ్లు లేకపోతే చావడు లే అనుకున్నాడు.

"సారీ లేడీ! వెధవ పన్లు చేసేవాళ్ళకి పనిష్మెంట్ వుండాలి" అన్నాడు తల అడ్డంగా వూపుతూ.

సమయం భారంగా గడిచింది. విక్రం చేతిగడియారం వంక చూసుకొన్నాడు. రైలు పెట్టెలో వున్న ప్రతివాళ్లూ గడియారాల వంకే చూస్తున్నారు. పదకొండు ముప్పావు దగ్గర పడుతోంది. ఏమవుతుందో అన్న ఆలోచన ప్రయాణీకుల గుండెల్లో రైలు పరిగెత్తిస్తోంది.

పదకొండు ముప్పావుకు ఇంకా మూడు నిముషాలుంది.

విక్రం కాబిన్‌లోకి వెళ్ళి జానీని కంపార్టుమెంటులోకి పంపించాడు. డీసిల్ కార్ విండ్‌షీల్డ్‌లోనుండి బయట ప్రపంచాన్ని ఓసారి పరికించి చూశాడు.

కృష్ణా రైలువంతెనమీద డీసిల్ కారు ఎవరో దుండగులు స్వాధీనం చేసుకొన్నారనే విషయం తెలియగానే వూళ్లో జనమంతా తండోపతండాలుగా కృష్ణానది ఒడ్డుకు చేరారు. ఇసుక వేస్తే రాలనట్లు విజయవాడవైపు ఒంతెనకు ఇరువైపులా నది ఒడ్డునా బారేజిమీదా నిలబడి బ్రిడ్జికేసి చూస్తోన్న జనాన్ని చూస్తోంటే విక్రంకు ఒళ్ళు మండింది.

జనం ముందుకు తోసుకు రాకుండా పోలీసులు నానా అవస్థలు పడడం కనిపిస్తోంది. అంతా గోలగా, తిరునాళ్లాగా వుంది. బండిలో చిక్కుపడిన ప్రయాణీకులమీద

జాలికన్నా, ఏం జరుగుతుందో చూద్దాం అనుకొనేవాళ్లే ఎక్కువున్నారు జనంలో.

పదకొండు ముప్పావయింది. ట్రాన్స్ రిసీవర్ స్విచ్ ఆన్ చేశాడు.

"ఆపరేషన్ మిలియన్ కాలింగ్...ఆపరేషన్ మిలియన్ కాలింగ్..." డి. యమ్. గదిలో సిగ్నల్‌మన్ గొంతు వినిపిస్తోంది.

"ఆపరేషన్ మిలియన్...రిసీవింగ్...గో ఎ హెడ్" జవాబిచ్చాడు విక్రం.

"దిసీజ్ డివిజినల్ మానేజర్" రాజం లైన్లోకి వచ్చాడు.

"ఓ. కే...కాష్ రడీ అయిందా?" అడిగాడు విక్రం.

క్షణంసేపు రాజం మాట్లాడలేదు. "సారీ మిష్టర్! మాకు ఇంకా స్తవ్యవధి కావాలి. పది లక్షలు చిల్లగనోట్లు పోగుచెయ్యాలంటే తేలిక పని కాదని నీకు తెలుసు. మాకు కనీసం మరో మూడు గంటలు టైం కావాలి. కాష్ ఇంకా దొరకలేదు." రాజం కంఠంలో ఆతృత, వేడుకోలు కనిపిస్తున్నాయి.

"అయితే ఓ పాశింజరు పోయినట్లే లెక్క వేసుకోండి. మరో నిముషంలో శవం అప్పజెపుతాను" అన్నాడు విక్రం ధృఢంగా.

"హలో...హలో...ప్లీజ్...ప్లీజ్...దయచేసి నా మాట వినండి. ఉయార్ ట్రైయింగ్ అవర్ బెస్ట్...మరి కాస్సేపు ఓపిక పట్టండి. మూడు గంటలకల్లా పదిలక్షలూ మీకు అప్పజెపుతాను" రాజం గొంతులో సన్నని ఏడుపు జీర వినిపించింది.

‘పూర్ బాస్టర్డ్’ అనుకొన్నాడు విక్రం మనసులో. తను చెప్పిన టైమ్‌లో వాళ్ళు కాష్ తేలేరని తనకు తెలుసు. కాని అలా బెదిరించకపోతే పది రోజులకయినా కాష్ తన చేతికి వచ్చే నమ్మకం లేదు.

“ఓ. కె...ఓ. కె...మరో మూడు గంటలు...నో మోర్...ఈలోగా నాకు కాష్ అందించకపోతే ఈసారి రెండు ఇన్‌స్టాల్‌మెంట్స్‌కి రెండు శవాలు అప్పచెపుతాను. రిమెంబర్. మూడు గంటలలోగా కాష్ మాకు అందాలి” కఠినంగా అన్నాడు విక్రం.

“థాంక్యూ మిస్టర్! థాంక్యూ వెరీమచ్! ప్లీజ్ షో సమ్ రిస్ట్రెయింట్! డబ్బు మీకు అందుతుంది” అన్నాడు రాజం.

“యు బెటర్ కీప్ యువర్ వర్డ్. లేకపోతే ఇద్దరు మనుషుల చావుకు నీవు కారణమవుతావు” అన్నాడు, విక్రం స్విచ్ ఆఫ్ చేస్తూ.

స్విచ్ ఆఫ్ చేసి చటుక్కున ఏదో గుర్తొచ్చి మళ్ళీ ట్రాన్స్ రిసీవర్ ఆన్ చేశాడు.

“హలో...” అన్నాడు అవతల ఇంకా రాజం సెట్ దగ్గరే వున్నాడు.

“హలో...హలో...ఏమిటి చెప్పండి!” రాజం గొంతులో మళ్ళీ ఏ మొచ్చి పడుతుందో అనే ఆతృత కనిపిస్తోంది.

“ఇరవై మందికి సరిపడా డబుల్ టిఫిను, కాఫీ కావాలి. పాపం పాసింజర్లు ఉదయంనుండీ ఏం లేకుండా వున్నట్లున్నారు. నువ్వు డబ్బు పంపకపోతే వాళ్ళు చావడం ఖాయం అయినా ఖాళీ కడుపుల్తో వాళ్ళను చంపడం నాకు ఇష్టంలేదు” అన్నాడు విక్రం.

అవతల రాజం గొంతులో ఎంతో రిలీఫ్ కనిపించింది. "ష్యూర్ మిస్టర్! వెంటనే పంపిస్తాను. కానీ..."

"ఎలా పంపించాలనా? చెపుతాను విను. వాటన్నిటినీ పాక్ చేసి, పైకి కనిపించేలా ఓ పళ్లెంలో పెట్టి, కెటిల్ నిండా కాఫీ పోసి పంపించు. నో ఫన్నీ బిజినెస్. పదార్థాలు తెచ్చే వ్యక్తి తప్ప ఇంకెవరూ బ్రిడ్జిమీదకు రాకూడదు. ఆ వచ్చేవాడి వంటిమీద మొల కప్పడానికి 'డ్రాయరు' తప్ప మరేమీ వుండకూడదు. అండర్‌స్టాండ్" చెప్పాడు విక్రం.

"యస్. యస్. అర్థమయింది" అన్నాడు రాజం వణుకుతున్న గొంతుతో.

# 12

స్పెషల్ బ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్, సబ్ ఇన్‌స్పెక్టర్ గోపాల్ జీపులోనుండి క్రిందకు దిగి ఓసారి చుట్టూ చూశారు.

చుట్టూ జనసముద్రం. పెద్దలు, పిల్లలు, ఆడా, మగా అందరూ ఒకర్నొకరు త్రోసుకొంటూ, తొక్కుకొంటూ, అరచుకొంటూ కృష్ణా రైలుబ్రిడ్జికేసి వింతగా చూస్తూ వున్నారు కృష్ణ ఒడ్డునే.

బ్రిడ్జికి సమీపంలో నిలబడి ఇన్‌స్ట్రక్షన్సు యిస్తున్న డి. ఐ. జి. దగ్గరకు నడిచారు స్పెషల్ బ్రాంచి ఆఫీసర్లు ఇద్దరూ. డి. ఐ. జి. ముఖంలో అలసట స్పష్టంగా కనిపిస్తోంది.

"గాయపడిన రెండో ఆర్. పి. యఫ్. కూడా చనిపోయాడు. బాస్టర్డ్స్...వాళ్ళు దొరికితే స్వయంగా ఉరి తీస్తాను" అన్నాడు డి. ఐ. జి. కోపంగా.

"ఇంకా దొరక లేదు వాళ్ళు మనకి? ఇంతకీ మొత్తం ఎంతమందున్నారు?" అడిగాడు ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్.

"తెలియదు. ఇద్దర్ని మాత్రం స్పష్టంగా చూశారు మావాళ్ళు. ఒకడు గడ్డంవాడు.

ఇద్దరూ కాబిన్లో కనిపించారు. వాళ్ళు కాక వెనక విండో దగ్గర కూర్చుయున్నో మరోడున్నాడు. కంపార్టు మెంటులో యెందరున్నారో తెలియదు."

"ఐ సీ. డబ్బు తీసుకొన్నా ఎలా తప్పించుకపోవాలని వాళ్ళ ఆలోచన? వాళ్ళు ప్రయాణీకుల్ని వదలి ట్రైను దిగిన మరుక్షణం వాళ్ళను చంపో, సజీవంగానో బంధించడం ఖాయం గదా" అన్నాడు శ్రీనివాస్.

"ఇంత ప్లాన్ వేసినవాళ్ళు డబ్బు తీసుకొన్న తరువాత తప్పించుకోవడానికి ఏదో మార్గం ఆలోచించి వుంటారు. బహుశా ప్రయాణీకుల్లో కొందర్ని తమతో బందీలుగా తీసుకెళతారేమో" దీర్ఘంగా వంతెనవైపు చూస్తూ ఆలోచిస్తూ అన్నాడు గోవింద్.

"ఎంతదూరం అలా వెళ్ళగలరు? వాళ్ళు ఎటు కదిలినా మనకు తెలిసిపోతుంది కదా. బహుశా ఏ హెలీకాప్టర్ నన్నా ఏర్పాటు చేసుకొన్నారేమో!" అన్నాడు శ్రీనివాస్.

శ్రీనివాస్ మాట పూర్తవక ముందే జనంలో యేదో కలకలం వినిపించింది. దాంతోపాటే ఆకాశంలో యేదో చప్పుడు. చటుక్కున తలలు త్రిప్పిచూశారు అందరూ. ఆకాశంలో తూనీగల్లాగ ఎగురుతూ రెండు హెలీకాప్టర్లు వస్తున్నాయి.

"హైదరాబాద్ ఎయిర్ బేస్‌నుండి వాటిని ఇక్కడ పెట్రోలింగ్‌కు డిస్పాచ్ చేసినట్లు ఇందాకే మెసేజ్

వచ్చింది" అన్నాడు డి. ఐ. జి. వాటివంకే చూస్తూ.

రెండు హెలికాప్టర్లూ ఒకదాని వెనుక ఒకటి యెగురుతూ వెళ్ళాయి బ్రిడ్జిలమీదుగా.

"ఏదో రకంగా వాళ్ళ కంట పడకుండా డీసిల్ కార్ దగ్గరకు చేరగలిగితే!" అంటున్నాడు శ్రీనివాస్ దీర్ఘంగా ఆలోచిస్తూ.

"ఏమిటి ఉపయోగం?" అడిగాడు గోపాల్.

"నాకో ఆలోచన వస్తోంది. వాళ్ళనుగాని మనం పట్టుకోవాలంటే వాళ్ళు ఆ ట్రైనులోనుండి బయటికి వచ్చే సమయానికి ట్రైన్‌లోనే వుండాలి మనం. ఎందుకంటే ట్రైన్‌లోనుండి దిగింతరువాత మనకు దొరికిపోయే విధంగా వాళ్ళు పథకం వేసుకొని వుండరు. ఆ పథకం ఏదయినా మనమెవ్వరం ఊహించలేనిది మాత్రం తప్పని సరిగా అయ్యుంటుంది. మనకందరికీ కనిపించేలా మాత్రం వాళ్ళు ట్రైను దిగరు. అంచేత ఆ సమయానికి మన మెవరమయినా అక్కడ వుండగలిగితే" అన్నాడు శ్రీనివాస్.

"యు ఆర్ క్రేజీ. ఆ వంతెన మధ్యవున్న ట్రెయిన్ దగ్గరికి వాళ్ళ కంట బడకుండా వెళ్ళడం అసంభవం. ఒక వేళ వెళ్ళినా ఒకడు వెళ్ళి చేయగలిగిందేమీ లేదు" అన్నాడు డి. ఐ. జి.

నవ్వాడు శ్రీనివాస్. "మే బి యు ఆర్ రైట్. కాని నా సిక్స్త్ సెన్స్ ఎందుకో ఎవరన్నా ట్రెయిన్ దగ్గరకు చేరుకొని ట్రెయిన్‌తోపాటు వుండడం అవసరం అని హెచ్చరిస్తోంది."

"నీ సిక్స్త్ సెన్స్ గురించి ఓ మనిషి ప్రాణాలు..." అంటున్నాడు డి. ఐ. జి.

"ట్రైన్ను దగ్గరికి వాళ్ళ కంట బడకుండా చేరుకోవడం ప్రాబ్లం కాదనుకొంటాను" అన్నాడు గోపాల్.

"ఎలా?"

నదివైపు చూపించాడు. "వంతెన క్రిందనుండి ఈదుకొంటూ వెళ్ళి స్థంభం ఎక్కి ట్రైనుక్రిందకు చేరుకోవచ్చు" అన్నాడు గోపాల్.

"నో... ట్రైనుకు దగ్గరగావున్న స్థంభం దగ్గరకు ఈదుకొంటూ వెళ్ళగలిగినా స్థంభం యెక్కడంమాత్రం జరిగే పని కాదు. నది మట్టంనుండి దాదాపు ఇరవైఅడుగుల ఎత్తులో వుంది బ్రిడ్జి. ఏ ఆధారం లేకుండా ఆ స్థంభం ఎక్కడం కుదరదు" అన్నాడు డి. ఐ. జి.

"యస్. యూ ఆర్ రైట్. కాని వాళ్ళ కంట బడకుండా ట్రైన్ చేరడానికి మరోమార్గం వుందనుకొంటాను" అన్నాడు గోపాల్.

"ఏమిటది?"

వంతెనవైపు చూపించి, "ఆ వంతెన దూలాలని పట్టుకొని వ్రేలాడుతూ క్రిందనుండి ఆ డీసిల్ కారు దగ్గరికి చేరుకోవచ్చు, వాళ్ళకు కనిపించకుండా" అన్నాడు గోపాల్.

# 13

టిఫిను, కాఫీలతో మనిషిని పంపిస్తున్నామని మెసేజ్ రాగానే విక్రం కార్బయిన్ తీసుకొని కాబిన్‌లోకి వెళ్ళాడు. పావుగంట తరువాత ఓ మనిషి ఔదురుగా అడుగులు వేస్తూ వంతెనమీదికి రావడం కనిపించింది.

ఎర్రగా, బలంగా వున్నాడతను. ఒంటిమీద చారల డ్రాయరు తప్ప మరేమీ లేదు. ఓ చేతిలో ట్రేలో టిఫిన్ పొట్లాలూ, మరోచేతిలో కాఫీ కెటిలు పట్టుకొని, అతి

జాగ్రత్తగా ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తూ వస్తున్నాడతను. బహుశా ఏ సి. ఐ. డి. ఆఫీసరో అయివుంటాడు అనుకొన్నాడు విక్రం. తమని దగ్గరనుండి చూసే అవకాశాన్ని ఈ సమయంలో ఎవరూ పోగొట్టుకోరు.

మిగిలినవాళ్ళను హెచ్చరించి తనచూపు వంతెనమీద వస్తున్న మనిషిమీదనే నిలిపాడు విక్రం. అతను మెల్లిగా అడుగులు వేసుకొంటూ వచ్చి ట్రైనుకు పదిగజాల దూరంలో ఆగిపోయాడు.

విక్రం అతన్ని ముందుకు రమ్మన్నట్లు సైగ చేశాడు చెయ్యి ఊపుతూ. కార్బయిన్ మాత్రం ఆ వ్యక్తి శరీరం మీదకే గురి పెట్టబడివుంది. కార్బయిన్ ఒకచేత్తో పట్టుకొని రెండవచేత్తో 'విండ్‌షీల్డ్' షటర్ పూర్తిగా పైకెత్తేశాడు. ఇప్పుడు కాబిన్‌లోనుండి బయటకు ఇద్దరు మనుషులు పట్టగలిగిన కంత ఏర్పడింది.

"ఆ ట్రే, కెటిలు, అక్కడ బ్రిడ్జిమధ్య పెట్టి నువ్వు వెనక్కి తిరుగు" అన్నాడు విక్రం.

విక్రం కళ్ళు ఆ మనిషిమీదనుండి ప్రక్కకు తిరగలేదు. అలాగే ఆ మనిషీ విక్రంనే చూస్తున్నాడు. మెల్లిగా వంగి కెటిలు, ట్రీ క్రింద పెట్టి వెనక్కి తిరిగాడు.

"ఇప్పుడు మెల్లిగా ఒక్కొక్క అడుగే వేస్తూ ముందుకు కదులు" అన్నాడు.

అతను ఒక్కొక్క అడుగే ముందుకువేస్తూ అతి మెల్లగా కదలసాగాడు. జానీకి సైగ చెయ్యగానే, జానీ విండ్‌షీల్డ్ వుండే ప్రాంతంనుండి క్రిందకు దిగి చకచకా కెటిలు, ట్రే లోపలకు తెచ్చాడు నిముషంలో. ఆ వ్యక్తి ఇంకా వంతెన చివరకు చేరుకోనేలేదు.

జానీ లోపలకు రాగానే షట్టర్ క్రిందికి దించేశాడు విక్రం.

"గుడ్. పాసింజర్లందరికీ తలో ఓ పాకెట్టు అందించు" అన్నాడు విక్రం జానీతోపాటు కంపార్టుమెంటులోకి వస్తూ.

జానీ చకచకా అందరిమీదకూ తలొక పాకెట్ విసిరేశాడు. తాము తెగించిన పనులు ఏమీ చెయ్యకపోతే, దుండగులు తమకు ఏమీ హాని చెయ్యరనే విషయం అర్ధమయిన పాసింజర్లు చకచకా టిఫిన్ పొట్లాలు విప్పుకొని ఇడ్లీలు తినసాగారు.

పరిమళ మాత్రం "నాకు లంచ్ బాక్స్‌లో మీల్సు వున్నాయి. నాకు అక్కరలేదు" అంది తన పాకెట్‌ను ప్రక్కనున్న గురుమూర్తికి ఇచ్చేస్తూ.

పది నిముషాల్లో అందరూ టిఫిన్ చేశారు.

"విక్రం మనం కూడా..." అంటున్నాడు జానీ.

విక్రం మాట్లాడలేదు. చిత్రంగా పాసింజర్ల వైపు చూస్తున్నాడు. అందరూ, చూస్తుండగానే, టిఫిన్‌లు తిన్న అందరూ కళ్లు తేలవేయసాగారు. మరో రెండు నిముషాల్లో అందరికీ స్పృహపోయింది పరిమళకు తప్ప.

వరుసలో, మొదటి సీట్లో కూర్చున్న సాంబశివరావును అటూ ఇటూ కదిపాడు విక్రం. ప్రక్కసీట్లో విల్సన్ మీద చలనరహితంగా వాలిపోయాడతను. పరిమళ స్పృహ వున్నా చుట్టూ జరుగుతున్నది చూసి బొమ్మలా వుండిపోయింది.

"క్లెవర్ బాస్టర్డ్! మనం టిఫిన్ తిని వుంటే మనకీ ఆ గతి పట్టివుండేది" అన్నాడు విక్రం గబగబ ఓ టిఫిన్ పాకెట్ విప్పి వాసన చూస్తూ.

“విషమా?” అడిగాడు గనీ.

“నో... బాగా ఘాటైన మత్తుమందు అయ్యుండాలి. వాసన తెలియడంలేదు” అన్నాడు విక్రం పాకెట్‌ను కిటికీలోనుండి బయటికి విసిరేస్తూ.

బొమ్మలా కూర్చొన్న పరిమళ వున్నట్లుండి వెక్కి వెక్కి ఏడవడం మొదలుపెట్టింది. కన్నీళ్ళు రావడంలేదు. కానీ విపరీతమైన ఎక్కిళ్ళు. గుర్తు తెలియని జంతువు అరవులా ఒళ్ళు గగుర్పొడిచే స్వరంతో ఏడుపు.

“స్టాపిట్! యు బిచ్” అరిచాడు గనీ పళ్ళ బిగువున. పరిమళకు ఆ అరుపు వినబడినట్లు లేదు. బొమ్మలా అలాగే కూర్చొనివుంది. వెక్కిళ్ళు, ఏడుపు ఆగడంలేదు.

“బహుశా షాక్ అయివుండాలి” అన్నాడు విక్రం ఆమె దగ్గరికి వెళుతూ.

పరిమళలో ఏం మార్పులేదు. ముందుకు వంగి ఆమె రెండు చెంపలమీదా ‘చెళ్ళు’ మనేలా కొట్టాడు విక్రం. పరిమళ చెంపలు ఎర్రబడి బూరెల్లా పొంగాయి. వెక్కిళ్లూ, ఏడుపూ ఆగి, కళ్ళలోకి తెలివి వచ్చింది. కళ్ళు జల పాతాల్లా నీళ్ళు కార్చడం మొదలుపెట్టాయి.

“టేకిట్ యీజీ మిస్! వాళ్ళు చావలేదు. స్పృహ తప్పారు. అంతే! టేకిటీజ్” అన్నాడు అనునయంగా.

పరిమళ రెండు చేతుల్లోనూ ముఖం దాచుకొని యేడుస్తోంది. చటుక్కున ఏదో గుర్తొచ్చినట్లు వెనక్కి తిరిగాడు విక్రం. ట్రాన్స్‌రిసీవర్ దగ్గరికి వెళ్ళి స్విచ్ ఆన్ చేశాడు.

“ఆపరేషన్ మిలియన్ కాలింగ్” అన్నాడు.

వెంటనే అవతలివైపునుండి సమాధానం వినిపించింది.

‘డి. యమ్. రాజంను రమ్మను” అన్నాడు.

రెండునిముషాల్లో డి. యమ్. రాజం కంఠం వినిపించింది "యస్. మిష్టర్."

"థాంక్యూ మిస్టర్ రాజం! మీరు చేసిన సహాయానికి కృతజ్ఞతలు" విక్రం కంఠంలో వ్యంగ్యం ధ్వనించింది.

"ఓ...." అన్నాడు రాజం, ఏం జవాబు చెప్పాలో తోచక.

గట్టిగా నవ్వాడు విక్రం. "అవును! మీరు మత్తుమందు కలిపిన టిఫిన్ తిని పాసింజర్లందరూ హాయిగా గాఢ సుషుప్తిలో వున్నారు. ఓపిగ్గా నిలబడి వాళ్ళకు కాపలా కాసే బాధ్యత తగ్గించినందుకు నీకు మా కృతజ్ఞతలు."

"నీ వంటున్నదేమిటో నా కర్థం కావడంలేదు మిస్టర్" అన్నాడు రాజం కంగారుగా.

విక్రం కంఠం పిడుగులా తయారయింది. "స్టాప్ ది నాన్సెన్స్ మిస్టర్ రాజం! ప్రయాణీకులతోపాటు మేం కూడా ఆ టిఫిన్ తింటామని ఊహించి అందులో మత్తు మందు కలిపారు మీరు. కాని అలా జరగలేదు. బహుశా మేం మత్తులో పడగానే డీసిల్ కారును స్వాధీనం చేసుకోవడానికి మీ రైల్వే రక్షక సిబ్బంది ఆయత్తమవుతూ వుంటారనుకొంటాను. వాళ్ళను ఆ ప్రయత్నంలోనుండి విరమించుకోమని తెలియచేయి."

"అయామ్ సారీ...మిస్టర్" రాజం కంఠం అపాలజటిక్‌గా వుంది.

"నెవర్ మైండ్ మిస్టర్ రాజం! మూడుగంటలకల్లా మాకు కాష్ అందకపోతే యూ విల్ బి రియల్లీ సారీ. మీరు చేసిన పనివల్ల ఇద్దరు పాసింజర్లు నెప్పి తెలియకుండా పరలోకం చేరుకొంటారు" అన్నాడు ట్రాన్సురిసీవర్ స్విచ్ ఆపేస్తూ.

కంపార్టుమెంట్‌లోని నలుగురి ముఖాల్లోనూ చిరు నవ్వులు వెలిశాయి. అందరూ సిగరెట్లు వెలిగించారు. పరిమళ ఏడుపు మాని పిచ్చిచూపులు చూస్తూ కూర్చొంది. మూడుగంటలు ఎప్పుడవుతుందా అని యెదురుచూడ్డం మొదలుపెట్టారు.

# 14

గనీ బాక్సులోనుండి నైలాన్ రోప్ తీసి, జానీకి ఓ ఉండ విసిరేసి తనో ఉండ తీసుకొన్నాడు. సీట్లమీద జారగిలబడి ఒళ్ళు తెలియకుండా నిద్రపోతున్న వాళ్ళందరినీ వరసగా తాడుతో చేతులు కట్టేశారు ఇద్దరు. విడి త్రాడుతో మాధవన్ కాళ్ళూ చేతులూ కలిపి కట్టేశారు.

తాడుతో చేతులు రెండూ బిగించి కడుతున్నప్పుడు కూడా పరిమళ ఏమీ మాట్లాడలేదు. కళ్ళప్పగించి చూస్తూ వుండిపోయింది. కన్నీళ్ళు కారి, అరిపోయి చారలుకట్టే వున్నది ఆమె ముఖమంతా.

"డోన్ట్ వర్రీ మిస్! నీకేం భయంలేదు," అన్నాడు జానీ జాలిగా.

గనీ నవ్వుతూ ఆమెవైపు చూశాడు. "యు ఆర్ ప్రెటీ! నీ పేరేమిటి?" అన్నాడు.

పరిమళ మాట్లాడలేదు. భారంగా కళ్ళు మూసుకొంది. తన జీవితంలో ఈరోజు ఓ పీడకలలా మిగిలిపోతుంది. అసలీ భయంకరమైన సంఘటననుండి తను బయటపడ గలదా అనే సంశయం ఆమె భయాన్ని మరింత పెంచు తోంది.

గనీ ఆమెకు దగ్గరగా వచ్చాడు. భుజంమీద చెయ్యి వేసి బలంగా కుదిపాడు. పరిమళ ఆకులా వణికిపోయింది.

"మాట్లాడవేం?" గర్జించాడు గనీ.

"ప్లీజ్...నన్నేం చెయ్యక!" ఆమె మాటలు నూతిలో నుండి వచ్చినట్లున్నాయ్.

పెద్దగా నవ్వాడు గనీ. "భయపడక! పేరడిగితే కళ్ళు మూసుకొంటే మాటలు రావేమో అనుకొన్నాను" అన్నాడు వెకిలిగా.

పరిమళ అతన్ని బెదురుతో చూస్తోంది. నలుగురు దుండగులు, పదిమంది చలనరహితులు, మధ్య తనొక్కతి. వాళ్ళేమయినా అఘాయిత్యం తలపెడితే? పైగా చేతులు కూడా కట్టేసివున్నాయి. ఆమె గుండెలు వేగంగా కొట్టుకోసాగాయి.

గనీ చూపుల్లో పిచ్చితనం కనిపిస్తోంది. వంటరి ఆడదానిలోని నిస్సహాయత అతణ్ణి రెచ్చగొడుతోంది. నవ్వుతూ ఆమె భుజంమీద చెయ్యివేశాడు.

పరిమళకు ఒళ్ళు జలదరించింది. అతని చేతివేళ్ళు ఒంటిమీద కదుల్తోంటే బల్లులులా అనిపించాయి. గనీ చెయ్యి ఆమె భుజంమీదనుండి క్రిందకు జారింది. గుండ్రని ఆమె రొమ్ము అతని చేతికి బలంగా, మృదువుగా తగుల్తోంది.

పరిమళ ఇక వుండబట్టలేకపోయింది. ఇంతవరకూ జరిగింది ఒకటి, ఇప్పుడు జరగబోతున్నది మరొకటి. రెండు కాళ్ళూ ఒకేసారి పైకి ఎత్తి గనీ మోకాళ్ళమీద పిచ్చిగా తన్నింది.

గనీ ఊహించని ఆ దెబ్బకు, ముందు సీట్లలో నిద్రపోతున్నవారిమీద పడి క్రిందికి దొర్లి సీట్లమధ్య సందులో పడిపోయాడు.

జరుగుతోన్న డ్రామాను ఆసక్తితో చూస్తోన్న జానీ, రాజా లిద్దరూ విరగబడి నవ్వారు. క్రిందపడిన గనీ క్షణంలో తేరుకొని లేచి నిలబడ్డాడు.

"యూ డర్టీ బిచ్..." అంటూ పరిమళ జాకెట్టు ప్రదర్శన చించేశాడు.

విక్రం తన దగ్గరకు ఎప్పుడు వచ్చాడో గనీ గమనించ లేదు. భుజంమీద పడిన చెయ్యిని విదిలించుకోబోయేడు. కాని విక్రం పిడికిలి అతని భుజాన్ని వదల్లేదు.

విక్రం అతన్ని బలంగా వెనక్కి తనవైపుకు త్రిప్పి కుడిచేత్తో పిడికిలి బిగించి గడ్డంమీద బలంగా గుద్దాడు.

గనీ బుర్రలో నక్షత్రాలు మెరిశాయి. తనకు తెలియ కుండానే మోకాళ్ళు తోటకూర కాడల్లా వంగి కుప్పలా కూలిపోయాడు.

"బండిలో ఆడవాళ్ళ జోలికి వెళ్ళవద్దని చెప్పిన ఆజ్ఞ పాటించనందుకు అది" అన్నాడు విక్రం రెండు నిముషాల తరువాత లేవకొని నిలబడిన గనీని చూసి.

"ఓ. ది హెల్ విత్ యువర్ ఆర్డర్! కుర్రాళ్ళకు అప్పుడప్పుడూ ఆ మాత్రం జల్సా లేకపోతే ఎలా?" అన్నాడు గనీ నవ్వుతూ.

"షటప్! అండ్ లీవ్ హర్ ఎలోన్" అన్నాడు విక్రం కాబిన్‌లోకి నడుస్తూ.

# 15

మూడయింది.

విక్రం ట్రాన్స్ రిసీవరు స్విచ్ ఆన్ చేసి, స్పీకర్ వాల్యూం పెంచాడు.

"ఆపరేషన్ మిలియన్ కాలింగ్..."

"ఆపరేషన్ మిలియన్ రిసీవింగ్..." అవతల ఆప రేటర్ గొంతు వినిపించింది.

మరుక్షణం. డి. యమ్. రాజం గొంతు వినిపించింది. "యువర్ మనీ యీజ్ రడీ మిష్టర్!"

"అన్నీ పాత నోట్లే కదా?" అడిగాడు విక్రం.

"యస్...యస్...అన్నీ పాతవి. చిన్న డినామినేషన్‌వి."

"సీరియల్ నంబర్స్ లేవు కదా?"

"లేవు!"

"గుడ్! ఇప్పుడు డబ్బు ఎలా అందజేయాలో చెపుతాను. స్పష్టంగా విను."

"ప్లీజ్! కారీఆన్!" రాజం కంఠంలో టెన్షన్ కనిపిస్తోంది.

"ఆ డబ్బును నాలుగు సూట్‌కేస్‌లలో సమాన మొత్తాలుగా సర్దండి. తర్వాత ఆ నాలుగు సూట్‌కేస్‌లను ఒక మోటార్ ట్రాలీమీద పెట్టించి ఒక మనిషి ద్వారా ట్రైన్ దగ్గరకు పంపండి. సూట్‌కేసుల్లో డబ్బు కాకుండా మరేదన్నా పెట్టి పంపించి మోసం చెయ్యాలని ప్రయత్నించారా...అవి తెచ్చిన మనిషిని అక్కడికక్కడే పక్కల్ని కాల్చినట్లు కాల్చి చంపుతాను. అర్థమయిందా?"

"యస్...యస్...అర్థమయింది" అన్నాడు రాజం.

"రిపీట్!"

విక్రం చెప్పిన ఇన్‌స్ట్రక్షన్స్ అన్నీ రిపీట్ చేశాడు రాజం.

"గుడ్! వెంటనే కాష్ పంపించు" అన్నాడు విక్రం స్విచ్ ఆఫ్ చేస్తూ.

మరో గంటలో వంతెనమీదకు మోటార్ ట్రాలీ రావడం కనిపించింది. రాజాను వెనకవైపు జాగ్రత్తగా కాపలా కాస్తూండమని, గనీకి ప్రయాణీకులను కనిపెట్టుకొని వుండమని చెప్పి జానీని తీసుకొని ఫ్రంట్ కాబిన్‌లోకి వెళ్ళి విండ్‌షీల్డ్ అద్దం ఎత్తేసి తయారుగావున్నాడు విక్రమ్.

మోటారు ట్రాలీ మెల్లిగా ముందుకు కదుల్తూ వస్తోంది. ట్రాలీమీద ఓ మనిషి, అతని ప్రక్కనే వరసగా పేర్చి వున్న నాలుగు సూట్ కేసులు కనిపిస్తోన్నాయి.

ట్రైన్ లో వున్న నలుగురిలో ఉత్సుకత ఉరకలు వేస్తోంది.

ట్రాలీ డీసిల్ కారుకు అయిదు గజాల దూరంలోకి వచ్చి ఆగిపోయింది. విక్రం చేతిలో కార్బయిన్ ట్రాలీ డ్రైవర్ మీదకే గురిపెట్టబడి వుంది. ఉత్సుకతలో మైక్ ఉపయోగించలేదు విక్రం.

"ట్రాలీని డీసెల్ కారుకు దగ్గరగా తీసుకురా!" అరిచాడు గట్టిగా.

ట్రాలీ మెల్లిగా ముందుకు కలిదింది. డీసిల్ కారుకు అరడుగు దూరంలోకి వచ్చి ఆగిపోయింది. జానీకి సైగ చెయ్యగానే, విండ్ షీల్డ్ లోనుండి క్రిందకు దిగాడు జానీ. ఒక్కొక్క సూట్ కేసే వరుసగా కేబిన్ లోకి అందించాడు. సూట్ కేసులు తీసుకొంటున్నంత సేపూ విక్రం కార్బయిన్ ట్రాలీమీద వ్యక్తికే గురిపెట్టబడింది.

జానీ లోపలకు రాగానే కార్బయిన్ జానీ చేతికిచ్చి, "చెక్ చేసేవరకూ వాణ్ణి వెళ్ళనియ్యకు" అన్నాడు.

నాలుగు సూట్ కేస్ లనూ కాబిన్ నుండి ఎడంగా లాగి మూతలు తెరిచాడు విక్రం. అన్నిటినిండా పదులూ, అయిదులు, రెండ్లు, ఒకట్లు కట్టలుగా కట్టే వున్నాయి. అన్నీ పాత నోట్లు. ఇక సూట్ కేసు అడుగుకు చెయ్యి పోనిచ్చి ఓ అయిదుల కట్ట బయటికి లాగాడు. నెంబర్లు చెక్ చేశాడు. అన్నీ విడి నంబర్లు. సూట్ కేసులు మూత వేసి కాబిన్ లోకి వచ్చాడు.

ఆర్మీ హెలీకాప్టర్లు రెండూ రయ్యిన ఎగురుతూ వెళ్ళి నయి. తాము తప్పించుకోవడానికి ఈ హెలీకాప్టర్లు ఓ తలనొప్పి అనుకొన్నాడు మనసులో.

"ఓ. కె. వెనక్కి వెళ్ళిపో! సరిగ్గా ఆరు గంటలకి మమ్మల్ని కాంటాక్టు చెయ్యమని చెప్పు డి. యమ్.కు" అన్నాడు.

నాలుగున్నరయింది అప్పుడు.

అదే సమయంలో—

బ్రిడ్జికి వ్రేలాడుతూ అతి కష్టంమీద డీసిల్ కారు క్రిందకి చేరుకొన్నాడు గోపాల్.

కాసేపు విశ్రాంతి తీసుకున్నాక మెల్లిగా స్లీపర్ల మధ్య నుండి పైకి ఎగబ్రాకి పట్టాలమధ్యకు వచ్చాడు. డీసిల్ కారు అడుగు భాగం దుమ్ముకొట్టుకొని, ఆయిల్ మరక లతో అసహ్యంగా కనిపిస్తోంది. ఈ క్షణంలో బండి కది లితే తన జీవితం ఇంతటితో ఆఖరు. బండి కదిలినా ప్రమాదం లేకుండా బండికి వ్రేలాడ్డానికి అనువైన ప్రదేశం ఏముందా అని చుట్టూ చూశాడు.

కంపార్టుమెంటు స్ట్రిక్చర్ సపోర్టుచేస్తూ వున్న రెండు దూలాలకు మధ్య బలంగా వుండడానికి వేసిన యినుప రాడ్లు కనిపించాయి. అడుగుకు ఓ రాడ్ చొప్పున వున్నది. ఓ రాడ్లో చేతులు దూర్చి, అక్కడినుండి నాలుగో రాడ్ మీద కాళ్ళు ఆనించి వ్రేలాడవచ్చు. కాని బండి కదిలితే ఆ వేగానికి తన పట్టు యెంతవరకు ఆగు తుందో చెప్పడం కష్టం. అంతేకాక బండి కదుల్తోన్న ప్పుడు అక్కడనుండి కంపార్టుమెంటులోకి యెక్కడం అసంభవం.

మెల్లిగా పాక్కుంటూ కంపార్టుమెంటు చివరికి వెళ్ళాడు. సరిగ్గా కంపార్టుమెంటు డోర్‌లు వుండే ప్రదేశానికి క్రింద రెండు రెండు చక్రాలు వున్నాయి. చక్రాల బయటికి డోర్ నుండి క్రిందకు దిగడానికి వున్న ఇనుప మెట్లు కనిపిస్తోన్నయ్. అదీ తనకు కావలసిన ప్రదేశం అనుకొన్నాడు.

మెల్లిగా, నిశ్శబ్దంగా చక్రాల మధ్యనుండి పాక్కుంటూ పట్టా అవతలికి వెళ్ళాడు. ఇక్కడినుండి చెయ్యి బయటికి చాస్తే కంపార్టుమెంటునుండి బయటికి చూసేవాళ్ళకి కనిపిస్తుంది.

మెల్లిగా రెండు చక్రాలకూ జాయింట్‌లా వున్న స్ప్రింగ్ మీద సీట్ ఆనించి, రెండుకాళ్ళూ డోర్ దగ్గర చివరి మెట్లమీద పెట్టి, మరో మెట్టును ముందుకు వంగి గట్టిగా పట్టుకొన్నాడు.

ఈ పొజిషన్‌లో బండి కదిలినా పడిపోకుండా వుండొచ్చు. కాని ఎక్కువసేపు ఆ పొజిషన్‌లో వుంటే, నడుం వంగి విపరీతమైన నొప్పి పుడుతుంది. అయినా అలాగే కూర్చొన్నాడు గోపాల్.

మోటార్ ట్రాలీ రావడం, సూట్ కేసులు అందించడం, పెట్టెలో వాళ్ళు నలుగురూ అటూ ఇటూ తిరుగుతున్న చప్పుడూ, అన్నీ వినిపిస్తున్నయ్. ఇంకా యెంత సేపో! అనుకొన్నాడు యెదురుగా కనిపిస్తోన్న మరో రైలుబ్రిడ్జి చూస్తూ.

# 16

సాయంత్రం ఆరయింది.

వర్షాకాలం కావడంవల్ల ఆకాశమంతా మబ్బుపట్టి అయిదింటినుండీ చీకటి పడడం ప్రారంభించింది. అరయే

ప్పటికి పూర్తిగా చీకటి పడింది. దూరంగా కృష్ణా బారేజ్ మీదా, ఆక్వెడక్టుమీదా, కనకదుర్గ ఆలయం లోనూ, ఘాట్ రోడ్ మీదా ఫ్లోరెసెంట్ లైట్లు దేదీప్య మానంగా వెలగడం మొదలెట్టాయి.

డబ్బు ముట్టినా, ఇంకా బ్రిడ్జిమీదనుండి కదలని డీసిల్ కారును చూసి రైల్వే అధికారుల్లోనూ, పోలీసు ల్లోనూ ఆందోళన మొదలయింది. దుండగులు ఏ రకంగా తప్పించుకోవాలనుకొంటున్నారో ఎవరికీ అంతు బట్టడం లేదు. బ్రిడ్జికి రెండువైపులా ఆర్మీదళాలు గస్తీ తిరుగు తున్నాయి.

సరిగ్గా ఆరుగంటలకు విక్రంనుండి సంకేతం రావడంతో వైర్లెస్ రూములో సమావేశమైన అధికారులకు ప్రాణం లేచివచ్చినట్లయింది.

“డి. యస్. రాజం హియర్!” అన్నాడు రాజం.

“గుడ్ మిస్టర్ రాజం! ఇప్పుడు నేను చెప్పబోయే ప్రతీ అక్షరం జాగ్రత్తగా విను. అవసరమైతే పెన్, పాడ్ దగ్గరపెట్టుకొని వ్రాసుకో. ఏమాత్రం పొరపాటు జరిగినా పదిమంది ప్రయాణీకుల ప్రాణాలు పోతాయని గుర్తుంచుకో!” వైర్లెస్ ట్రాన్స్ రిసీవర్లో విక్రం కంఠం కఠినంగా ధ్వనించింది.

గదిలో ఒక్కసారి టెన్షన్ పెరిగింది. అందరూ చెవులు రిక్కించుకొని విక్రం చెప్పేమాటలు వినసాగారు.

“సరిగ్గా మరో అరగంటలో మేము బయలుదేర బోతున్నాం. ఎటు వెళ్ళబోతున్నాము అనేది నీ కనవ సరం. అంచేత క్రిష్ణాబ్రిడ్జి దగ్గరనుండి తెనాలిమీదుగా మద్రాస్ వరకూ, గుంటూరుమీదుగా మద్రాస్ వరకూ, మా ముందువైపు హైదరాబాద్ వరకూ రైల్ ట్రాక్ పూర్తిగా

లైన్ క్లియర్ చేసి ఇవ్వాలి. అండర్‌స్టాండ్!'' విక్రం ఆగాడు.

రాజం ముఖంమీద ముచ్చెమటలు పోసాయి. ''మిస్టర్! దటీజ్ ఇంపాసిబుల్! బ్రిడ్జిమీద మీ డీసిల్ కారు ఆగిపోవడంవలన దక్షిణ మధ్య రైల్వే మెయిన్ లైన్ ట్రాఫిక్ అంతా ఉదయంనుండి ఎక్కడికక్కడ ఆగిపోయివుంది. కొన్ని బళ్ళు మెయిన్ లైన్స్‌మీద అలాగే వున్నాయి. వాటన్నిటినీ లూప్ లైన్స్‌లోకి సర్ది మీకు లైన్ క్లియర్ ఇవ్వడం అరగంటలో అయ్యేపని కాదు'' రాజం గొంతు హిస్టీరియా వచ్చినవాడికిమల్లే వుంది.

పగలబడి నవ్వాడు విక్రం. ''మిస్టర్ రాజం! నిన్ను చూస్తే జాలేస్తోంది. కానీ నువ్వీ పని చెయ్యకతప్పదు. పోనీ మరో అరగంట టైమిస్తాను. అంటే ఏడుగంటల వరకూ. ఏడుగంటలకల్లా డీసిల్ కారు బ్రిడ్జిమీదనుండి కదలాలి. ఈలోగా నేను చెప్పిన మార్గాలన్నీ లైన్ క్లియర్ చేసివుంచు.''

రాజం తనప్రక్కనే వున్న ఛీఫ్ ట్రాఫిక్ కంట్రోలర్ వైపు తిరిగి తల ఊపాడు. వెంటనే ఛీఫ్ ట్రాఫిక్ కంట్రోలరు అన్ని స్టేషన్లకూ 'వే క్లియరెన్స్' చెయ్యమని చెప్పడానికి బయటికి పరిగెత్తాడు.

''దెన్ ది సెకండ్ పాయింట్. వింటున్నావా మిస్టర్ రాజం?'' విక్రం ప్రశ్న.

''వింటున్నాను.''

''ట్రాక్ పొడవున ఎక్కడా పోలీసుగానీ, ఆర్మీగాని వుండకూడదు. మమ్మల్ని వెంబడించకూడదు. అలాగానీ డీసిల్ కారును ఎవరయినా వెంబడిస్తున్నట్లు గాని మాకు

అనుమానం కలిగితే, ఓ పాసింజరు ప్రాణం పోయినట్లే లెక్క వేసుకోండి.''

'బాస్టర్డ్!' అనుకొన్నాడు రాజం మనసులోనే.

''పాయింట్ నెంబర్ త్రీ! ఆ ఆర్మీ హెలికాప్టరను వెంటనే గ్రౌండ్ చెయ్యాలి. అది ఏమాత్రం మమ్మల్ని ట్రాక్ చెయ్యాలని మా వెనకే వచ్చినా, పాసింజెర్లు భూమ్మీద వుండరని గుర్తుంచుకోండి. వింటున్నావా?''

''యస్. యస్. అర్థమయింది.''

''అండ్ దెన్ ది ఫోర్త్ పాయింట్. వెరీ ఇంపార్టెంట్. ఇరవై మందిని తీసుకెళ్ళగల విమానాలు రెండిటిని మద్రాసు ఎయిర్‌పోర్టులోను, బేగంపేట విమానాశ్రయంలోనూ, పైలట్‌తో సహా సిద్ధంగా వుంచమని వెంటనే మెసేజ్ పంపండి. మద్రాస్‌గాని, హైదరాబాద్‌గాని చేరుకొన్నాక వాళ్ళేం చెయ్యాలో అక్కడి అధికారులకు సేమ్ వేవ్ లెంత్ మీద మెసేజ్ పంపుతాను. ఓ. కె.''

''ఓ. కె. ఐ అండర్‌స్టాండ్!'' రాజం గొంతులో వణుకు స్పష్టంగా తెలుస్తోంది.

''ప్లీజ్ రిపీట్ మై ఇన్‌స్ట్రక్షన్స్!'' విక్రం గొంతులో పరిహాసం.

విక్రం చెప్పిన విషయాలు ఒక్కొక్కటీ అప్పజెప్పాడు రాజం.

''గుడ్! గెట్ క్రాకింగ్. ఏడుగంటలకల్లా అంతా సిద్ధం కావాలి.''

ట్రాన్స్ రిసీవర్‌లో మెసేజ్ ఆగిపోయింది.

* * *

జాగ్రత్తగా తను కూర్చొన్న పొజిషన్ నుండి క్రిందకు దిగి బెల్టులోనుండి మినీ వైర్‌లెస్ సెట్టు బయటికి తీశాడు

గోపాల్. వంతెన అంతా చీకటిగా వుంది. డీసెల్ కార్లో గూడా షట్టర్సు దించివేయడంవలన లోపలి వెలుతురు బయటికి కనిపించడంలేదు.

స్విచ్ ఆన్ చేయగానే అవతలివైపునుండి శ్రీనివాస్ కంఠం ఆత్రుతగా వినిపించింది. "గోపాల్! ఆర్ యు ఆల్ రైట్?"

"ఓ. కె. అయామ్ ఆల్ రైట్. ఏం జరుగుతోంది?" స్వరం తగ్గించి మెల్లిగా అడిగాడు.

"మరో అరగంలో...అంటే ఏడుగంటలకు వాళ్ళు బయలుదేరబోతున్నారు. మద్రాసుగాని, హైదరాబాదుగాని వెళతామంటున్నారు. కాని వాళ్ళు మధ్యలో ఎక్కడో దిగేస్తారని నా నమ్మకం. సో బి ప్రిపేర్డ్. జాగ్రత్తగా వుండు. ట్రెన్ మోషన్‌లో వున్నప్పుడు చాలా డేంజర్. గుడ్ లక్" అన్నాడు శ్రీనివాస్.

"థాంక్యూ!" అని స్విచ్ ఆఫ్ చేసి మళ్ళీ తన పొజిషన్‌లోకి మారాడు గోపాల్.

# 17

హైదరాబాద్‌కి, మద్రాసుకు రెండువైపులా ట్రాక్ క్లియర్ అయినట్లు మెసేజ్ వచ్చింది. ప్రయాణికులు ఇంకా ఎవరూ మత్తునుండి తేరుకోలేదు. బహుశా ఏ యల్. యస్. డి. లాంటి ఘాటైన మందయి వుంటుంది. పరిమళమాత్రం చిరిగిన జాకెట్‌తో అలాగే సీట్ మీదకు వాలి నిద్రపోతోంది.

విక్రం తన అనుచరులకు చకచకా ఆర్డర్లు యిచ్చాడు. ప్రయాణికులకు కట్టిన తాళ్ళన్నీ గట్టిగా వున్నదీ లేనిదీ ఓసారి సరిచూసుకొన్నారు. విక్రం ఆజ్ఞ ప్రకారం కంపార్టుమెంట్లో లైట్లు ఆర్పేశారు. కంపార్టుమెంట్ లోపల

చిమ్మచీకటిగా వుంది. నాలుగు సూట్ కేసుల్నీ బారేజ్ వైపు వుండే ఫ్రంట్ డోర్ వద్దకు తెచ్చిపెట్టారు.

విక్రంకూడా కాబిన్ లో లైటు ఆర్పేశాడు. "జానీ నువ్వు కుడివైపు వున్న కిటికీలదగ్గర నిలబడు. గనీ నీవు ఎడమవైపు, రాజా నీవు నీ మామూలు పొజిషన్ లో వుండు. ఎవరయినా ట్రాక్ ప్రక్కన మనల్ని వెండిస్తున్నారేమో జాగ్రత్తగా గమనించండి. వాచవుట్ ఫర్ ది హెలీకాప్టర్స్! ఏమాత్రం అనుమానం తగిలినా వెంటనే నాకు చెప్పండి. చివరి నిముషంలో మన ప్లాను మరింత జాగ్రత్తగా వుండాలి!" అన్నాడు విక్రం చివర ఇన్స్ట్రక్షన్స్ ఇస్తూ.

అందరూ ఎవరి పొజిషన్ లో వాళ్ళు నిలబడ్డారు. అందరి మనసుల్లో ఆనందం గంతులు వేస్తోంది. ఇంత వరకూ విజయవంతంగా నడిపిన పథకాన్ని అజాగ్రత్తగా చెడగొట్టి దొరికిపోవడం ఎవరికీ ఇష్టంలేదు.

విక్రం మెల్లిగా ఇంజన్ స్విచ్ ఆన్ చేసి, బ్రేక్ రిలీజ్ చేశాడు. డీసిల్ కారు చిన్నగా చప్పుడు చేసుకొంటూ ముందుకు కదిలింది. రెండుసార్లు గట్టిగా సైరన్ యిచ్చి ముందుకు కదలనిచ్చాడు. విజయవాడవైపు వంతెన చివర వరకూ పోనిచ్చి, బ్రేక్ వేసి, రివర్స్ చేశాడు. ఫ్యూయల్ సప్లయ్ లివర్ ను క్రిందకు లాగి వేగం పెంచాడు.

వెంటనే డీసిల్ కారు వెనక్కి, మద్రాసువైపు వేగంగా ప్రయాణం చేయడం మొదలుపెట్టింది. చకచక డీసిల్ కారు కదుల్తోంటే చల్లటిగాలి కంపార్టుమెంట్ లోకి దూసుకువస్తోంది. నలుగురి కళ్ళు ట్రాక్ చుట్టుప్రక్కల గాలిస్తున్నాయి.

మూడునిముషాల్లో కారు కృష్ణా కెనాల్ జంక్షన్‌లోకి వచ్చింది. బండిని మెల్లిగా స్లో చేశాడు విక్రం. ప్లాట్‌ఫారంమీదగాని, చుట్టుప్రక్కలకికూడా మానవసంచలనం లేకపోవడం చూసి నవ్వుకొన్నాడు. కాబిన్‌లోనుండి తల పెట్టి బయటకు చూశాడు. ఎడమకు ఒకటి, కుడికి ఒకటి పచ్చసిగ్నల్ లైట్లు వెలుగుతూ కనిపించాయి.

ఎడమవైపు ట్రాక్ తెనాలిమీదుగా మద్రాసు పోతుంది. కుడివైపు ట్రాక్ గుంటూరుమీదుగా తెనాలి, అక్కడ నుండి మద్రాసు పోతుంది. జాగ్రత్తగా డీసిల్ కార్‌ను కుడివైపు ట్రాక్‌మీదకు మళ్ళించాడు. స్పీడు పెంచాడు. అంటే ఇప్పుడు కారు గుంటూరు లైన్‌మీద పోతుందన్న మాట.

తల త్రిప్పి దూరంగా కుడివైపు కనిపించే కలకత్తా-మద్రాసు ట్రంక్‌రోడ్ వైపు చూశాడు. కార్లు, ఇతర మోటారువాహనాలు వేగంగా అటూ ఇటూ వెళ్ళడం వాటి లైట్లనుబట్టి తెలుస్తుంది. అందులో కొన్ని ఆర్మీకి, పోలీసుకు చెందిన వాహనాలున్నా ఆశ్చర్యంలేదు అనుకొన్నాడు. ఆ రోడ్డు అలా ప్రక్కకు వంపు తిరుగుతూ, మంగళగిరి దగ్గర ఈ రైల్వేలైనును క్రాస్ చేస్తుంది.

కృష్ణా సిమెంట్ స్టేషన్ దాటింది డీసిల్ కారు. ప్రక్కనే క. సి. పి. సిమెంట్ ఫ్యాక్టరీ పొగలుకక్కుతూ పనిచేస్తోంది. విక్రంలో టెన్షన్ పెరిగింది. మెల్లిగా స్పీడు కొద్దికొద్దిగా తగ్గించడం ప్రారంభించాడు. ఇక్కడనుండి మంగళగిరి మూడుమైళ్ళలో వుంటుంది.

"ఎవిరిథింగ్ ఓ. కే?" అరిచాడు విక్రం.

"ఓ. కె." కంపార్టుమెంట్‌లోనుండి జవాబిచ్చాడు జానీ.

"రైట్! బి రడీ!" అన్నాడు విక్రం స్పీడు మరింత తగ్గిస్తూ.

కృష్ణా సిమెంట్ హాల్ట్ స్టేషన్ తరువాత, ఓ అర మైలుకు రైలుమార్గం రెండు చిన్న కొండల మధ్యనుండి పోతుంది. అవి నిజానికి రెండు కొండలు కావు. ఒక కొండవాలులో రాతిని పగలగొట్టి రైలుమార్గం వేశారు. ఓ ఫర్లాంగుదూరం రైలు ఈ మార్గంలో పోతున్నప్పుడు బయటనుండి చూసేవాళ్ళకి కనిపించదు.

సరిగ్గా ఆ మార్గంలోకి రాగానే బ్రేక్ వేశాడు విక్రం. జానీ, రాజా, గనీ, ముగ్గురూ కుడివైపు డోర్ తెరుచుకొని నాలుగు సూట్ కేస్‌లను తీసుకొని చకచక క్రిందికి దిగిపోయారు. అంతా అర నిముషం పట్టలేదు. విక్రం మాత్రం కాబిన్‌లో వున్నాడు.

వెంటనే విక్రం, బ్రేక్‌ను అలానే నొక్కిపట్టి వుంచి ఫ్యూయిల్ సప్లయ్ లివర్‌ను మరింత క్రిందికి లాగాడు. ఆక్సిలేషన్ రాడ్‌ను మరింత పైకి త్రోసి, కాబిన్ విండో డోరు పూర్తిగా తెరిచాడు. తర్వాత రివర్స్ లాక్ తీసేశాడు.

బ్రేక్ రాడ్‌ను చేత్తో అలానే నొక్కిపట్టి వుంచి శరీరాన్ని పూర్తిగా తెరుచుకొన్న విండోలోనుండి బయటకు పెట్టాడు. కాళ్ళు ఇంజన్ చూముకు చుట్టూవున్న ఇనుప రెయిలింగ్ మీద ఆనగానే బ్రేక్‌ను వదలిపెట్టి ప్రక్కకు దూకేశాడు.

బ్రేక్ వదలగానే డీసిల్ కారు ఒక్క వుదుటున ముందుకు కదిలింది. విక్రం డీసిల్ కారు తనను దాటి వెళ్లే వరకూ అలాగే వుండి లేచి నిలబడ్డాడు. డీసిల్ కారు

వేగంతో, వెనక్కి, విజయవాడవైపుకు దూసుకు పోతోంది డ్రైవరు లేకుండానే.

# 18

కంట్రోలర్ రూమ్ రైల్వే అధికారుల హడావిడితో నిండిపోయి వుంది. కృష్ణా సిమెంట్ హాల్ట్ నుండి అప్పుడే డీసిల్ కారు స్టేషన్ దాటినట్లు మెసేజ్ వచ్చింది.

"ఎలర్ట్ మంగళగిరి స్టేషన్..." అరిచాడు రాజం అసహనంగా.

మరో మూడు నిముషాలకి కంట్రోలర్ ఆశ్చర్యంగా కృష్ణా సిమెంట్ హాల్ట్ ఎ. యస్. యమ్. రిపోర్ట్ వింటు న్నాడు.

"డీసిల్ కారు మళ్ళీ వెనక్కి వస్తుందట. ఎ.యస్.ఎమ్. చెప్పాడు" అన్నాడు కంట్రోలర్.

"బాస్టర్డ్! మద్రాసువైపుకు వెళ్ళినట్టే వెళ్ళి మళ్ళీ వెనక్కి తిరిగి వస్తున్నాడన్నమాట" అన్నాడు రాజం ఈ వైపు స్టేషన్స్‌ను ఎలర్ట్ చెయ్యమని చెపుతూ.

ఇంతలో కంట్రోలర్ మళ్ళీ చెప్పాడు "కృష్ణా కెనాల్ యస్. ఎమ్. డీసిల్ అతి వేగంగా విజయవాడవైపు వస్తుం దని చెపుతున్నాడు."

అయిదు నిముషాల్లో డీసిల్ కారు విజయవాడ దాటి హైదరాబాద్ రైలుమార్గంమీద దూసుకుపోతోంది. స్టేషన్ లైట్ల కాంతిలో కాబిన్‌లో డ్రైవరు లేని విషయం గమనించబడింది.

విషయం తెలియగానే రైల్వే అధికారులు క్షణంపాటు స్థాణువులైపోయారు.

"మైగాడ్! అందులో ప్రయాణికులందరూ స్పృహతప్పి వున్నారు. డ్రైవరు లేకపోతే ఏ వంపుదగ్గరో పట్టాలు

తప్పి ఏక్సిడెంట్ అయే ప్రమాదముంది. డు సమ్‌థింగ్"
డి. యస్. రాజం పిచ్చెక్కినట్లు అరుస్తున్నాడు.

"హలో...హలో...పోలీస్ కంట్రోల్...వెంటనే విజయవాడ–మంగళగిరి మధ్య రోడ్లన్నీ కాపు కాయండి. ప్రతి వాహనం, ప్రతి మనిషినీ చెక్ చేయమనండి. దుండగులు ట్రైన్ దిగిపోయి ఇంకా పది నిముషాలు కూడా కాలేదు. హెలికాప్టర్లను వెంటనే వెతకడం ప్రారంభించమనండి" డి. ఐ. జి. పోలీస్ కంట్రోల్ వైర్‌లెస్‌లో అరుస్తున్నాడు.

## 19

విక్రం గబగబా ట్రాక్ అవతలివైపునవున్న కొండ అంచుకు పరిగెత్తాడు.

అప్పటికే రాజా, గనీ, జానీలు చకచకా డ్రస్ ఛేంజ్ చేసుకొంటున్నారు అక్కడ. రెండు నిముషాల్లో గడ్డం, మీసాలు తీసేశారు.

"ఓ. కె. లెటజ్ రన్!" అన్నాడు విక్రం రెండు నిముషాల తర్వాత. అందరూ నాలుగు సూట్‌కేస్‌లతో కొండ అవలి దిగువకు వచ్చారు.

కలకత్తా–మద్రాస్ ట్రంక్ రోడ్డు ప్రక్కగా వున్నది ఆ ప్రదేశం. అక్కడ నల్ల అంబాసిడర్ కారొకటి ఆగి వుంది. సూట్‌కేసులు డిక్కీలో పెట్టి నలుగురూ చకచకా లోపలకు ఎక్కి కూర్చొన్నారు.

విక్రం కారు స్టార్ట్ చేసి విజయవాడవైపు తిప్పాడు. ఆక్సిలేటర్ మీద కాలు బలంగా నొక్కాడు. వింటి నుండి వదిలిన బాణంలా పరిగెత్తింది కారు.

కృష్ణా బారాజ్ దాటి విజయవాడ ప్రవేశిస్తుండగా, సైరన్‌లు మ్రోగించుకొంటూ పోలీస్ కార్లు బారేజ్

దారికి అడ్డంగా ఆగడం గమనించారు నలుగురూ. రోడ్ బ్లాక్ చేయబడింది.

ఆగంతకులు నలుగురూ విస్తుపోయారు. తమ కదలికను అంత క్విక్ గా ఎలా పసిగట్టారో అర్థం కాలేదు వాళ్ళకు.

# 20

రైలు చక్రాల స్ప్రింగులకు, డోర్ మెట్లకూ మధ్య వున్న గోపాల్ పరిస్థితి త్రిశంకు స్వర్గంలో వున్నట్లు వుంది. రైలు అతి వేగంగా హైదరాబాద్ ట్రాక్ మీద వెళ్ళిపోతోంది.

ముందు ముగ్గురు దుండగులు దిగినప్పుడు క్రిందికి దిగుదామనుకొంటుండగానే రైలు కదిలింది. ఆ తర్వాత విక్రం క్రిందకు దూకేయడం చూసి జరిగిందేమిటో ఊహించగలిగాడు గోపాల్.

ఇంజన్ ఆన్ చేసి క్రిందకు దిగిపోయారు దుండగులు. బయటినుండి చూస్తోన్న వాళ్ళకి ఇంకా వాళ్లు ట్రైన్ లోనే వున్నట్లు అనిపిస్తుంది. ఈలోగా వాళ్ళు తప్పించుకుపోయారు. ఎక్కడ దిగిందీ, ఎలా వెళ్ళిందీ ఎవరికీ తెలియదు.

“క్లవర్ ఫెలోస్!”అనుకొన్నాడు గోపాల్. ట్రైన్ లో ప్రయాణీకు లందరూ స్పృహతప్పి వున్న విషయం అతనికి తెలుసు. గంటకు దాదాపు వంద కి. మీ. వేగంతో డ్రైవరు లేకుండా వెళుతున్న బండి ఎక్కడో ఓ చోట ప్రమాదానికి గురవడం ఖాయం.

హైదరాబాద్ వరకూ లైన్ క్లియర్ వుండడంచేత డీసిల్ కారు ఎక్కడా ఆగకుండా పరిగెడుతోంది. ఎక్కడయినా కాస్త ఎక్కువ వంపుగా వుంటే చాలు రై

మార్గంలో బండి యాక్సిడెంట్ కి గురవడానికి— అంత వేగంలో బండి అటు ఇటు వూగిపోతోంది.

వెంటనే వైర్ లెస్ సెట్ తీసి డి. ఐ. జికి పరిస్థితి వివరించాడు గోపాల్.

*　　　*　　　*

అపరేషన్ మిలియన్ తాలూకు నలుగురు దుండగులు కొద్ది ఘర్షణ అనంతరం పోలీసులకు లొంగిపోయారు.

గోపాల్ అతి కష్టంమీద కాబిన్ లోకి ప్రవేశించి డీసిల్ కారును ఆపేశాడు.

మెంటల్ షాక్ తగిలిన పరిమళ ఆర్నెల్లపాటు ఆస్పత్రిలో వుండిపోవలసి వచ్చింది.

అహమ్మద్ ఆ తర్వాత ఎప్పుడూ సెకండ్ క్లాసులోనే ప్రయాణం చేశాడు.

జ్యోతి సేతుమాధవన్ ని పెళ్ళి చేసుకొన్నది ఇష్టపూర్వకంగా.

సబ్ ఇన్ స్పెక్టర్ గోపాల్ కు రాష్ట్రపతి పతకం లభించింది.

—: ఐపోయింది :—

# తెరవెనుక న్యూస్!

సుజనశ్రీ

నారాయణరావు సైన్యంలో హావల్దార్ గా పనిచేసి, పదేళ్ల సర్వీసు పూర్తయింది. ఆర్మీలోంచి రిటైరై తన స్వగ్రామం హైదరాబాదు చేరుకున్నాడు. అతడికి వెనుకా ముందూ ఎవరూ లేరు. ఏకో నారాయణ!

మిలటరీవాళ్లు మంజూరుచేసిన గ్రాట్యూటీ బ్యాంక్ లో వేసుకున్నాడు. ఇకపైన ఏ ఉద్యోగం చేయాలా అనే ఆలోచనలో పడ్డాడు. ఒకరిక్రింద పనిచేయకుండా స్వతంత్రంగా జీవిస్తూండే వ్యాపకం కావాలి. నిత్యనూతనంగానూ, సాహసవంతమైనదిగానూ ఉండాలి. నెలరోజుల పాటు ఆలోచించి ప్రయివేట్ డిటెక్టివ్ గా తన పేరు నమోదు చేయించుకున్నాడు.

హైదరాబాదునుంచి వెలువడే పత్రిక లన్నిటిలోనూ ఆ ప్రకటన వేయించాడు.

దినపత్రికలో అచ్చయిన తన అడ్వర్టయిజుమెంట్ చూసుకుని ఆలోచిస్తున్నాడు నారాయణరావు.

బాయ్ వచ్చి "సార్! మీకు ఫోన్ వచ్చింది సార్!" అన్నాడు.

నారాయణరావు గర్వంగా మీసాల్ని సవరించుకున్నాడు. తన ఆఫీస్‌కి టెలిఫోన్ లేదు. కానీ తన ఆఫీసున్న ఇంటి ప్రక్కనే సబ్ పోస్టాఫీసుంది. అందులో పబ్లిక్ టెలిఫోన్ ఉంది. ఆ పోస్టాఫీసులో పనిచేసే సబ్ పోస్టుమాస్టరు నారాయణరావుకి మంచి స్నేహితుడు.

అందుకే ధైర్యంగా తన ప్రకటనలో ఆఫీసు అడ్రసు ఇస్తూనే, "లేదా ... నెంబర్‌కి ఫోన్ చేయండి!" అంటూ పోస్టాఫీసు నెంబరు ఇచ్చాడు.

ఫోన్‌లో మాట్లాడి వచ్చాడు నారాయణరావు. అతడి ఛాతీ ఇంకా రెండంగుళాలు ఉబికింది. తన ప్రకటన పడీ పడంగానే, అప్పుడే మొదటి కేసు తగిలింది.

ఆ ఫోన్ చేసింది ఎవరో కాదు. ప్రఖ్యాత దర్శక నిర్మాత చంద్రశేఖర్! వెంటనే తన ఆఫీసుకు రావలసిన దిగా కోరాడు ఫోన్‌లో.

స్కూటర్‌ని స్టార్ట్ చేసి, బయలుదేరాడు నారాయణరావు.

ఈ మధ్యనే హైదరాబాదులో సినీ సంచలనం ప్రారంభమయింది. నటసామ్రాట్ స్టుడియో ప్రారంభం కావటం, నటరత్న స్టుడియో నిర్మాణంలో ఉండటంతో తెలుగు చలనచిత్ర పరిశ్రమ అంతా రెక్కలు గట్టుకుని

మద్రాసునుంచి హైదరాబాద్ కి యెగిరివచ్చిందా అన్న ట్టుగా ఉంది.

వెండితెరపై వెలిగే తారల గురించీ, కొత్తచిత్రాల నిర్మాణం గురించీ పబ్లిసిటీ ఇచ్చేందుకు సినిమా పత్రికలు అనేకం ఉన్నయ్. కొన్ని కొత్తవి ఇంకా వస్తున్నయ్. అయితే ప్రపంచంలో ఉన్నవారంతా మంచివారే అయితే ఇంక కథేముంది? పదిమందిలో ఒక్కడైనా చెడ్డవాడు ఉంటాడు. మానవస్వభావమే అంత!

ఒకటీ అరా పత్రికలు ఈ సినీజీవుల తెరమరుగు జీవితాలనూ, వారి అసభ్య నడవడికల్నీ ప్రచురించి డబ్బు చేసుకుంటుంటయ్. అలాంటిదే హైదరాబాదునుంచి వెలువడే "తెరవెనుక న్యూస్" పక్ష పత్రిక. నారాయణ రావుకి ఆ పత్రిక అంటే పరమ అసహ్యం. లక్షణంగా ఎవరి బ్రతుకు వాళ్ళు బ్రతుకుతుంటే, వారి బ్రతుకుల్ని బజారుకీడ్చి రచ్చచేయటం ఎందుకా అని అతడి అభిప్రాయం.

స్కూటర్ చంద్రశేఖరం బంగళాముందు ఆగింది. స్కూటర్ కి స్టాండ్ వేసి లాక్ చేసి లోపలకు నడిచాడు.

డ్రాయింగ్ రూమ్ లో చలనచిత్ర దర్శకనిర్మాత చంద్రశేఖరం సోఫాలో కూర్చుని ఉన్నాడు. అతడి చేతిలో నారాయణరావు ద్వేషించే "తెరవెనుక న్యూస్" పక్ష పత్రిక ఉంది.

"నమస్కారమండీ! నా పేరే నారాయణరావ్! ప్రయివేట్ డిటెక్టివ్ ని" తనను తాను పరిచయం చేసుకున్నాడు.

"అలా కూర్చోండి!" అంటూ బాయ్ ని పిలిపించి బిస్కట్లూ, డ్రింక్స్ తెప్పించాడు చంద్రశేఖరం.

డ్రాయింగ్ రూమ్ చాలా పెద్దది. గోడలమీద నాలుగు

వేపులా చలనచిత్ర రంగంలోని వర్తమాన నాయికా నాయకుల నిలువెత్తు ఫోటోలు, చంద్రశేఖరం డైరక్టు చేసిన చిత్రాల్లోని స్టిల్స్ తాలూకు ఫోటోలు ఉన్నయ్.

చంద్రశేఖరం దాదాపు ఆరడుగుల ఎత్తున్నాడు. పసిమిఛాయతో దృఢంగా ఉన్నాడు. కళ్ళకు రిమ్‌లెస్ గ్లాసెస్, సిల్కు లాల్చీ, ధోవతీ, మెళ్ళో బంగారు ఛెయిన్, చేతికి వజ్రాలు పొదిగిన రిస్టువాచ్‌తో మనిషి చాలా హుందాగా, గంభీరంగా ఉన్నాడు.

"మీకు ఒక విషయాన్ని అప్పగిద్దామని పిలిచాను. అసలు, ముందు పోలీసులకు తెలియజేస్తే బాగుంటుం దను కున్నాను. తీరా బాగా ఆలోచించినమీదట ఇది పోలీసులకు సంబంధించింది కాదనిపించింది. పైగా ఈ విషయం బయటకు పొక్కి రచ్చ అవుతుంది. మా పరువూ, ప్రతిష్ఠలు మంట గలుస్తాయ్. అందుకే మిమ్మల్ని రప్పించాను."

"వివరాలు చెప్పండి" అన్నాడు నారాయణరావు.

"అదే! వస్తున్నా! మన హైదరాబాదునుంచి వెలువడే పక్షపత్రిక "తెరవెనుక న్యూస్"ను చూసే ఉంటారు మీరు. సినీతారల పడకటింటి రహస్యాల్ని, బాత్‌రూమ్ కబుర్లనూ ప్రచురించి, యువపాఠకుల్ని వెర్రెత్తించే పత్రిక అది. ఛీ! ఛీ! ఇలాంటి పత్రికల్ని యెందుకు బ్యాన్ చెయ్యరో!" చంద్రశేఖరం తన సోఫాప్రక్కనే పడి ఉన్న పత్రికవంక ద్వేషంగా చూశాడు.

"అవును! ఆ పేరు విన్నాను. ఆ పత్రిక అంటే నాకూ గిట్టదు."

"ఆ పత్రికవాడు నేను తీస్తున్న చిత్రంలోని హీరో యిన్నూ, తద్వారా నన్నూ బ్లాక్ మెయిల్ చెయ్యాలని చూస్తున్నాడు!"

"ఏ విధంగా?"

"మా చిత్రంలోని హీరోయిన్ అందాల తార 'మాలిని' గురించి ఏదో అసభ్యపు వ్రాతలు వ్రాయబోతున్నాడట. అది ప్రచురణ జరిగితే మాలిని పరువేం కాను? ఆమెకు చెడ్డపేరు వస్తే, మా చిత్రం దెబ్బ తింటుంది. కనుక మీ రెలాగయినా ఆ వ్యాసం అచ్చుకాకుండా చూడాలి. దాని వ్రాతప్రతులన్నిటినీ తీసుకొచ్చి నాచేతి కివ్వాలి!"

వర్ధమాన నటీమణి మాలిని ఎంతో డిమాండ్‌లో ఉన్న తార. ఆమె మాంఛి అందగత్తె కూడా. వేలాది ప్రేక్షక యువకుల హృదయాల్లో ఆరాధ్యదైవమయిన యువతి మాలిని. మరి ఆమెను గురించిన అసభ్య శృంగారసాహిత్యం బజారులో పెడితే యువకులకు గంగవెర్రులెత్తి ఆ పత్రికను ఎగరేసుకు పోతారంటే సందేహంలేదు.

"పెద్ద పెద్ద పదవుల్లో ఉన్నతహోదాల్లో ఉన్నవాళ్లకు కూడా ఏదో ఒక చిన్న బలహీనత ఉంటుంది." డిటెక్టివ్ నారాయణరావు సానుభూతి వ్యక్తం చేసాడు. "పోనీ ఆ పత్రిక ఎడిటర్‌నే అడగలేకపోయారా? ఆ వ్యాసం ప్రచురింపబడకుండా ఆపేవాదేమో?"

"అదీ అయింది! అతడికి లక్షరూపాయలిస్తే, మాతో సహకరిస్తానన్నాడు. చూస్తూ చూస్తూ అంత డబ్బు ఎక్కడ్నుంచి తేగలం? నిజానికి చేతిలో ఆ లక్షే ఉంటే మా చిత్రం పూర్తయి ఈపాటికి కలెక్షన్లు వసూలు చేస్తుండేది!"

"అయితే నన్నిప్పుడేం చేయమంటారో చెప్పండి!"

"మీరా పత్రిక ఎడిటర్ని కలుసుకోండి! ఎలాగైనా మిలిట్రీ మనుష్యులు కదా మీరు? మీకు ధైర్యం పాలు ఎక్కువ! వాడికి కొంచెం బెదురుపెట్టండి ఆ సమాచారం ప్రచురించకుండా!"

"అంటే తుపాకీ తీసుకెళ్ళి కాల్చమంటారా? యుద్ధంలో బద్ధ శత్రువుని కాల్చినట్టు! కానీ ఇది సివిల్ వ్యవహారం! యుద్ధభూమి కాదు. అదీగాక నా దగ్గర తుపాకీ కాదుగదా, రివాల్వర్ గూడా లేదు! అది సరే. యీ కేసు తీసుకుంటే నా ఫీజు ఏమిస్తారు?"

"ఎంతయినా సరే! ఆ వ్యాసం తాలూకు వ్రాతపతి ఒరిజినల్ దాని నకళ్ళేమైనా ఉంటే అవీ వీలైతే ఆ ఫైల్ అంతా తీసుకురావాలి! అంతేకాదు, ఆ వ్యాసాన్ని నీవు కూడా చదవకూడదు" చంద్రశేఖరం అనూయ చూస్తూంటే నారాయణరావుకు నవ్వు వచ్చింది.

"అసలు కొద్దిగానైనా చదవకపోతే, ఆ ఫైల్ మాలినికి సంబంధించినది అవునో కాదో ఎలా తెలుస్తుంది? అందుకని మొదలు కొంచెంగా చదివి, ఆ ఫైల్ మాలినికి సంబంధించినదే అని రూఢిపరుచుకున్నాక దాన్ని తెచ్చి మీకిస్తాను. ఇంతకీ ఫీజు విషయం ఒక అగ్రిమెంటుకు వస్తే మంచిదనుకుంటాను."

"నీ ఫీజు క్రింద అయిదువేలు ఇస్తాను. అగ్రిమెంటూ ఇలాంటివేం వ్రాయను. కావాలంటే అంతా అడ్వాన్సు గానే ఇస్తాను సరా!" అంటూ చంద్రశేఖరం సోఫా లోంచి లేచి లోపలకు వెళ్ళాడు.

నోట్లకట్టలు తెచ్చి నారాయణరావు ముందు పడేశాడు చంద్రశేఖరం.

"విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్!" అన్నాడు చంద్రశేఖరం, అతడ్ని బయటిదాకా సాగనంపుతూ.

"ఇదే నా మొదటి కేసు. ఇది విజయవంతమయేలా చూడటంపైనే నా భవితవ్యం ఆధారపడి ఉంది!" అంటూ అక్కడ్నుంచి కదిలాడు నారాయణరావు.

# 2

డిటెక్టివ్ నారాయణరావు తన రూమ్‌కి తిరిగివచ్చాడు, జేబులోని డబ్బును భద్రంగా దాచిపెట్టి, ఆ తర్వాత తన పరిశోధనకై బయలుదేరటానికి.

సబ్ పోస్టు మాస్టర్, నారాయణని పిలిచాడు నవ్వుతూ.

"మీకెవరో ఫోన్ చేశారండీ! బయటికెళ్ళారని చెప్పాను. రాంగానే మళ్ళీ ఫోన్ చెయ్యమన్నారు!" అంటూ ఏదో నెంబరు నోట్ చేసి ఉన్న స్లిప్‌ని అందించాడు.

అక్కడికక్కడే నారాయణరావు ఫోన్ ఎత్తి డయల్ చేశాడు.

"ఎవరు కావాలండీ?" కంగారుగా అవతలి కంఠం అడిగింది.

"నేను డిటెక్టివ్ నారాయణరావుని మాట్లాడుతున్నాను. నాకోసం ఎవరో ఫోన్ చేశారట ఇందాక!"

"ఓ నారాయణరావుగారా? మీరు త్వరగా ఇక్కడికి రావాలి! నన్ను చంపుతామని బెదిరిస్తున్నారెవరో! మొదటిది, మీ రీ రాత్రి నాకు రక్షణగా ఉండాలి! రెండోది నన్ను బెదిరిస్తున్న వ్యక్తులెవరో పట్టుకోవాలి! నేను "తెరవెనుక న్యూస్" పత్రిక ఎడిటర్ అర్జునరావుని మాట్లాడుతూంట!"

నారాయణరావు క్షణం కొయ్యబారిపోయాడు. వెంటనే తేరుకుని___

"మిమ్మల్నెవరు బెదిరించారు? ఎలా బెదిరించారు? వివరంగా చెప్పండి?"

"ఇందాక ఫోన్ చేశారెవరో! ఆ కంఠం ఫోన్‌లో గర గరమందే కానీ స్పష్టంగా వినిపించలేదు. ఆ విషయాలన్నీ మీరిక్కడకు వచ్చాక మాట్లాడుకోవచ్చును. మీ రీ రాత్రి నాకు సాయంగా నిలవండి! మీ ఫీజు ఎంతైనా సరే?"

నారాయణరావు ఒక్క క్షణం తటపటాయించాడు. ఈ కేసుని ఒప్పుకోవటమా, మానటమా అనే సందిగ్ధంలో పడ్డాడు. ఒకరు బ్లాక్ మెయిలర్! మరొకరు బ్లాక్ మెయిల్ చేయబడుతున్న వ్యక్తి. ఇద్దరు కేసుల్ని విభిన్న ధృవాల్లాంటి వాటిని ఒకేసారి ఎలా చేపట్టగలడు?

అయినా తను వెదకబోయిన తీగ కాలికి తగిలింది. ఈ అవకాశాన్ని వినియోగించుకుని 'మాలిని'కి సంబంధించిన రికార్డు మాత్రం సంగ్రహించు రాగలిగితే, తన మొదటి కేసన్నా విజయవంతం అవుతుంది.

"ఏమండీ! వింటున్నారా నా మాట? తర్వాత పక్ష పత్రిక ప్రచురణను ఆపకపోతే నన్ను చంపేస్తామంటున్నారు! కానీ! నా జీవనాధారం ఈ పత్రికే కదా?"

"పోనీ ఈ పక్షపత్రికను మాత్రం నిలుపు చేస్తాననక పోయారా?"

"అంటే? వాళ్ళ బెదిరింపులకు బెదిరిపోయి నన్ను సత్యాన్ని వెల్లడించకుండా మరుగుపరచమంటారా?"

"పోనీ పోలీసులకు తెలియజేయకపోయారా? వాళ్ళని రక్షణకోసం అడగవచ్చుకదా!"

"లాభంలేదు. ఆకాశరామన్న బెదిరింపుల్ని వాళ్ళు లెక్కలోకి తీసుకోమన్నారు. అందుకే మీ ప్రకటన చూడంగానే, మీకు ఫోన్ చేస్తున్నాను సార్! మీరు ఎంతసేపట్లో రాగలరు ఇక్కడకు?"

నారాయణరావు బరువుగా నిట్టూర్చాడు. "క్షమించాలి! మీ కేసు చేపట్టటమో, నిరాకరించడమో ఆలోచించిగాని నిర్ణయించుకోలేను. ఎందుకనంటే నేనిప్పుడే మరొకరి కేసు ఒప్పుకున్నాను, అదీ మీకు సంబంధించినదే? నా క్లయింట్ గూడ మీకు ప్రత్యర్థే! మీరు చనిపోతే అతడు ఇంకా సంతోషిస్తాడేమో గూడ!"

"ఇది అన్యాయం! డిటెక్టివ్ అన్నవాడు చేతనైతే హత్య జరక్కుండా కాపాడాలి! అంతేకానీ ఒక హంతకుడికి సాయపడరాదు తెలుసా?"

"ఏం? నీవు చేసే పని మాత్రం న్యాయమైనదా? ఇతర వ్యక్తుల బలహీనతల్ని ఆరా తీసి, వాటిని పేపరుకెక్కిస్తానని బ్లాక్ మెయిల్ చెయ్యటం మాత్రం నేరం కాదూ? అందుకే నేను మీ కేసు విషయం ఆలోచించినమీదట గానీ ఏ నిర్ణయానికీ రాలేను. సాయంకాలం సరిగ్గా ఆరు గంటలకు మీ ఆఫీసుకు వస్తాను. ఈలోపల మీరుగూడ మీరు చేస్తున్న బ్లాక్ మెయిల్ కు స్వస్తిచెప్పే విధానం ఆలోచించండి! అప్పుడే నావల్ల మీకు సాయం లభించగలదు," నారాయణరావు ఫోన్ పెట్టేశాడు.

సబ్ పోస్ట్‌మాస్టర్ కి థ్యాంక్స్ చెప్పి తన రూమ్‌లోకి తిరిగివచ్చాడు నారాయణ రావు.

# 3

క్లాక్ టవర్ లో సరిగా ఆరుగంటలు కొడుతోంది, 'తెర వెనుక న్యూస్' ఆఫీసు చేరుకునేసరికి.

అప్పటికి ఆఫీసులో పని చేసేవాళ్లూ, ప్రెస్‌లో పని చేసే కంపోజిటర్లు అందరూ వెళ్ళిపోయినట్లున్నారు, ఆఫీసంతా బోసిగా ఉంది.

ముందు హాలు దాటుకుని ఎడిటర్ రూమ్ దగ్గరకు వెళ్ళాడు నారాయణరావు. గదిలో లైటు వెలుగుతోంది. గది తలుపులు వారగా వేసి ఉన్నయ్.

తలుపు నెట్టుకుని గదిలోకి అడుగుపెట్టిన నారాయణ రావు అలాగే బ్రమ్మపడిపోయాడు.

తనకన్న పదినిముషాల ముందే, అర్జునరావు దగ్గరకు మరో విజిటర్ వచ్చాడు. అదే మృత్యువు.

మృత్యువే ముందు చేరింది అర్జునరావుని, తనకన్న కొద్ది క్షణాల వ్యవధిలో.

కణతల్లోంచి ఇంకా రక్తపుచారికలు ఎర్రగా ఉండటం మూలాన్ని అతడు చనిపోయి పదినిముషాలకన్న కాలేదని తెలుస్తోంది.

కాగితాలూ, ఫైల్స్ పేరుకున్న టేబుల్‌కి అవల రివాల్వింగ్ ఛెయిర్‌లో కూర్చుని, వెనక్కి వాలివున్నాడు చనిపోయిన అర్జునరావు. అతడి కళ్ళుమాత్రం తెరుచుకునే ఉన్నాయి. అతడి ముఖాన నెత్తురు మరకలు లేకపోతే, అతడింకా జీవించివున్నాడనే భావన కలుగుతుంది.

నారాయణరావు చుట్టూ కలయజూశాడు. ఒకప్రక్క గది తలుపుకున్న లాక్‌ని ఎవరో రివాల్వర్‌తో కాల్చారు.

మునిగాళ్ళమీద నడుస్తూ, టేబుల్‌ని తాకకుండా, దానిమీదకు వంగి, అక్కడున్న కాగితాల్ని చదవటానికి యత్నించాడు నారాయణరావు. అవి బహుశా తనకు కావలసినవే అయి ఉండచ్చేమో అని!

కానీ అవి 'మాలిని' గురించినవి కావు. ఎవరో నూతన దర్శకుడికీ, గ్లామర్ తగ్గిపోతున్న తారకీ మధ్య జరిగిన ప్రేమకలాపం గురించిన సమాచారం అది!

అయితే, అర్జునరావుని హత్యచేసిన వ్యక్తులు, ప్రక్క గదిలోని రికార్డురూమ్ శోధించి, వాళ్ళకు కావాల్సినవి సంగ్రహించుకు పోయివుంటారు. అంటే వాళ్ళూ, తన లాగే, త్వరలో 'తెరవెనుక న్యూస్' లో ప్రచురింపబడే అభ్యంతర సమాచారం ప్రచురింపబడకుండా నిరోధించ టానికే వచ్చివుంటారు.

నారాయణరావు ప్రక్క గదిలోకి జొరబడ్డాడు ఆత్రంగా. ఆ గదిలో ఫైలింగ్ క్యాబినెట్ ఉంది. అక్షర మాల క్రమంలో A నుంచి Z వరకు వివిధ అరలున్నై!

మాలినికి సంబంధించిన సమాచారంకోసం 'M' అర తెరిచాడు. అందులో గబగబ కవర్లు తిరగేశాడు.

పైన మాలిని అని ఉన్న కవర్ని తీసుకుని, దాన్ని తెరిచి చూశాడు నారాయణరావు. ఒక ఒరిజినల్, రెండు కార్బన్ కాపీలు ఉన్నయ్ అందులో. ఒక్కొక్కటీ ఎనిమిది పేజీలుంది. ఫొటోలు ఏమీ లేవు.

ఆ కవర్ని స్లాక్ షర్ట్ లోపలి జేబులో దోపుకున్నాడు. అంతలోనే అతడికేదో ఆలోచన మెరిసింది. ప్యాంటు జేబులోంచి గుడ్డసంచీని తీశాడు. డ్రాయర్లోని ప్రఖ్యాత తారల పేర్లున్న కవర్లను చకచక ఏరి సంచీలో వేసు కున్నాడు.

మాలిని విషయంలో చంద్రశేఖర్ తన సహాయం అర్థించినట్టుగానే ఈ ప్రఖ్యాత తారల్లో ఎవరైనా తన సహాయం కోరవచ్చు. అప్పు డీ కవర్లలోని వ్రాతప్రతులు తనకు ఎంతైనా లాభకరంగా ఉంటయ్.

గుండెల నిండా ఊపిరి పీల్చుకున్నాడు నారాయణ రావు. ఎడిటర్ రూమ్‌లోకి వచ్చి టెలిఫోన్ దగ్గరకు నడి చాడు రిసీవరెత్తి డయల్ చేశాడు.

"ఎవరూ? చంద్రశేఖరేనా మాట్లాడుతూంట? మాలిని గురించిన వ్రాత ప్రతులు నా చేతి కొచ్చినయ్."

"ఏమిటీ? నిజంగానా? అప్పుడే వాటిని జేజిక్కించుకున్నావా?" నమ్మలేనట్టుగా, ఆశ్చర్యంగా అడిగాడు చంద్రశేఖర్ ఫోన్‌లో.

"అవును! ఒరిజినల్ వ్రాతప్రతీ, రెండు కార్బన్ కాపీల ప్రతులూ ఉన్నయ్! ఫొటోలేం లేవు?"

"నిజంగా అఖండుడివే నీవు! ఏమాత్రం ఖర్చు పెట్టావేమిటి?" చంద్రశేఖర్ తన వ్యాపారపు సరళిలో మాట్లాడాడు.

"ఏంతోనా? ఒక మనిషి జీవితం! అర్థమయిందా? అర్జునరావు ప్రాణాలు కోల్పోయాడు."

చంద్రశేఖర్ ఆశ్చర్యాన్ని ఆతృతనూ కనపరచాడు. "ఏమిటీ! హత్యే? అవున్లె! మిలటరీ వాడివి కదూ? శత్రువుల్ని పిట్టల్ని కాల్చినట్టుగా కాల్చి చంపటం అలవాటే గదూ? కానీ నీవీ రకంగా పని సాధిస్తావని కలలో గూడ అనుకోలేదు సుమా!"

"మిస్టర్ చంద్రశేఖర్! నా మాటలు పూర్తిగా వినకుండానే అలా అతి ప్రసంగం చెయ్యకు! ఈ హత్య నేనే చేశానని ఎవరన్నారు?"

"పోనీలే! అంతవరకన్న జాగ్రత్త పడ్డావ్! అబ్బాయ్ హత్యా ప్రదేశంలో ఆట్టేసేపు తారాడక, పోలీసులు వచ్చేలోపలే త్వరగా వెళ్ళిపో. మాలిని కాగితాల్ని నాకు చేర్చటం మర్చిపోకు."

అతడి ఉచిత సలహాకు నారాయణరావు నవ్వుకున్నాడు. లైన్ కట్ చేశాడు, అట్టె కాలయాపన మంచిది కాదని.

పోలీస్ స్టేషన్‌కి డయల్ చేశాడు మళ్ళీ.

ఇన్‌స్పెక్టర్ రాజు బదులు పలికాడు. అతడికి తానెవరో, అక్కడికి ఎందుకు వచ్చాడో తెలియజేస్తూ, అక్కడ హత్య జరిగినట్టుగా తెలియజెప్పాడు.

చంద్రశేఖర్ చెప్పినదానికి సరిగా వ్యతిరేకంగా చెప్పాడు ఇన్‌స్పెక్టర్ రాజు. తాము వెంటనే క్షణాల మీద అక్కడకు చేరుకోబోతున్నామనీ, అంతవరకూ నారాయణరావుని అక్కడే ఉండమనీ కోరాడు ఇన్‌స్పెక్టర్.

నిర్జీవంగా పడి వున్న శవానికి కాపలా కాస్తూ, వాకిట్లోనే వెయిట్ చేస్తున్నాడు నారాయణరావు.

కొద్ది క్షణాల్లోనే పోలీసులు వచ్చేశారు రంగం మీదకు. తాపీగా సిగరెట్ కాలుస్తూన్న నారాయణరావు, కుర్చీలోంచి లేచి వెళ్ళి ఇన్‌స్పెక్టర్‌ని రిసీవ్ చేసుకున్నాడు.

ఇన్‌స్పెక్టరూ, పోలీస్ ఫొటోగ్రాఫరూ శవాన్ని తాకకుండా, కదలించకుండా అన్ని కోణాల్లోంచి చూస్తూ ఫోటోలు తీస్తున్నారు. మరికొందరు పోలీసులు హడావిడిగా అటూ ఇటూ తిరుగుతున్నారు, సినిమాలో ఎక్స్‌ట్రాల్లాగ.

"మీరే కదా మాకు ఫోన్ చేసింది? మీ రెందుకు వచ్చారిక్కడకు?" ఇన్‌స్పెక్టర్ అడిగాడు నారాయణరావు వంక చూస్తూ.

డిటెక్టివ్ నారాయణరావు టూకీగా చెప్పాడు. అటు చంద్రశేఖర్ గురించి కానీ, మాలిని గురించిన ప్రస్తావన కానీ రానివ్వకుండా, అర్జునరావే తన సహాయం కోరాడనీ

ఆ విషయమై ప్రస్తావించేందుకే తాను సరిగ్గా ఆరు గంట లకు వచ్చాడనీ, అప్పటికే అతడు యమసదనానికి చేరా డని వివరించాడు.

"ఫోన్‌లో అర్జునరావు నీతో ఏం చెప్పాడు?"

"నా కోసం అర్జునరావే ఫోన్ చేశాడు. తన నెవరో హత్య చేస్తానని బెదిరిస్తున్నారని చెప్పాడు. అలా బెదిరి స్తున్న వారి ఆచూకీ పట్టుకోవలసిందిగా అర్థించాడు. ఆ విషయమై పూర్తి వివరాలు తెలుసుకుందామనీ, అతడితో ముఖా ముఖి సంప్రదించాలనీ వచ్చాను. నేను వచ్చేసరికే అతడ్నెవరో హత్య చేసేశారు. హంతకుడు నా రాక గ్రహించి లోపల ఎక్కడన్నా దాక్కున్నాడేమో అని ఇల్లంతా వెదికాను. ఆ తర్వాత మీకు ఫోన్ చేశాను."

ఆ తర్వాత ఇన్‌స్పెక్టర్ దగ్గర సెలవు తీసుకొని ఇంటికి బయలుదేరాడు నారాయణరావు.

# 4

నారాయణరావు అలసిన శరీరంతో తన బసకు చేరుకు న్నాడు. డ్రెస్ విప్పి స్టాండ్ మీద వేశాడు. కొద్దిగా విస్కీ తాగి తలగడ మీద తలగడ పెట్టుకొని బెడ్ మీద వాలిపోయాడు.

తీరిగ్గా ఆలోచిస్తూ అర్జునరావు హత్య కేసులో తన పాత్రను మరోసారి సమీక్షించాడు. మాలిని గురించిన వ్యాసం తాలూకు వ్రాత ప్రతులు తన దగ్గర భద్రంగా ఉన్నాయ్. వాటి కోసమై తను తెర వెనుక న్యూస్ కార్యాలయానికి వచ్చినట్టుగా మాత్రం పోలీసులకు వెల్లడి చేయలేదు తను.

తలుపు మీద చిన్నగా చప్పుడయింది, ఎవరో చిటికె వేస్తున్నట్టుగా.

నారాయణరావు ఉలిక్కిపడ్డాడు. ఆ వచ్చింది పోలీసులు గానీ, లేక చంద్రశేఖరంగానీ అయి ఉంటారా అనిపించింది. వాళ్ళయితే తలుపుని గట్టిగా తట్టేవాళ్ళే! ఇలా నెమ్మదిగా, ప్రక్కింటి వాటాలోని భర్తచాటు స్త్రీలాగ ఎందుకు గీరుతుంది అనుకున్నాడు అంతలోనే!

తలుపు తెరిచేసరికి గుమ్మంలో చిరునవ్వులు చిందిస్తూ నిలబడి ఉంది ఎక్స్ట్రా నటి రాణి.

తను నాలుగంతస్థుల మేడలో ఉంటున్నాడు. ఆ మేడలో అన్నీ డబుల్ రూమ్ పోర్షన్సే! పైగా అన్నిటిలోనూ తనలాటి బ్రహ్మచారులే—ఆడా, మగా బ్రహ్మచారులు ఉంటున్నారు. రాణి గూడ వాళ్ళలో ఒకతె!

"లోపలకు రావచ్చా?" అనడిగింది రాణి.

"రాత్రివేళ అందమైన యువతి గుమ్మంలో నుంచుని రావచ్చా అని అడిగితే ఏ మగాడు వద్దంటాడు?"

"మీరు పర్మిషన్ లేకుండానే రావచ్చు!" అంటూ ఆమెను లోపలకు రానిచ్చి తలుపు మూసేశాడు నారాయణరావు.

"ఒళ్ళంతా నొప్పులుగా ఉంది. ఇవాళెవరూ క్లయింట్స్ గూడా తగల్లేదు. మీ దగ్గర మందేమన్నా ఉందేమోనని వచ్చాను!" అంది రాణి వయ్యారంగా ఒళ్ళు విరుచుకుంటూ.

"అబ్బో! మందు కావాలంటే చాలా ఖరీదవుతుందే?" నారాయణరావు ఆమె వంక ఓరగా చూస్తూ, కొంటెగా నవ్వాడు.

"అందు కభ్యంతరమా! ప్రస్తుతం నా దగ్గరున్నదంతా మీదే!" అంటూ రాణి సర్వ స్వతంత్రంగా బెడ్ మీద కూర్చుని సీసాలో ద్రవాన్ని పోసుకుని గటగట త్రాగే

సింది. ఆ తర్వాత చేతులు చాచి నారాయణరావుని ఆహ్వానించింది.

రాణి వ్యక్తిగత జీవితం నారాయణరావుకి తెలియక పోలేదు. ఆమె ఇక్కడ ఒంటరిగా ఉంటోంది. సినిమాలో వేషాలు ఎప్పుడోగానీ దొరకవు. అందుకే ఆమె ఒళ్ళు అమ్ముకొని జీవిస్తోంది.

ఆమె దగ్గరకు వచ్చేవాళ్ళంతా మధ్య వయసు వాళ్ళే. డబ్బున్న ధనికులు. ఒక్కో వారం ఒక్కొరు వచ్చి పోతుంటారు. బహుశా ఆమెలో వారిని ఉత్తేజపరిచే కీలకం ఉండి వుంటుంది. కనుకనే ఆమె దగ్గరకే విధిగా, క్రమం తప్పకుండా వస్తుంటారు.

# 5

తెల్లవారుజామున నారాయణరావుకి మెలకువ వచ్చింది. అతడిప్రక్కనే రాణి ఇంకా నిద్రపోతూనే ఉంది.

నెమ్మదిగా లేచాడు నారాయణరావు. గదిలో ఒక మూల తను 'తెరవెనుక న్యూస్' ఆఫీసునుంచి తెచ్చిన కాగితాల కట్టలున్న సంచీ ఉంది. ఎందుకైనా మంచిది, వాటిని మరెక్కడన్నా దాస్తే బాగుండు ననుకున్నాడు నారాయణరావు. కానీ ఎక్కడ దాచాలో అంతు పట్ట లేదు. ఇవాళ రేపట్లో పోలీసులు తన గదిని సోదాచేసినా చెయ్యవచ్చు. కనుక ఆ కాగితాలు తన గదిలో ఏమాత్రం ఉండగూడదు.

ట్రీపాయ్‌మీద తాళాలు కనుపించినయ్. అవి రాణి పోర్షన్ తాలూకువి. నారాయణరావు మనసులోకి మెరుపులా ఆలోచన వచ్చింది.

తను తెచ్చిన బ్యాగ్‌ని తీసుకెళ్ళి రాణి ఇంట్లో, విడిచే

సిన గుడ్డలపెట్టె అడుగున భద్రపరిచాడు.

కాలకృత్యాలు తీర్చుకుని ఆఫీసుకు చేరుకునేసరికి, అతడికోసం అప్పుడే ఫోన్ కాల్ వచ్చింది.

నారాయణరావు కాల్ అందుకున్నాడు.

"హాలో డిటెక్టివ్ నారాయణరావ్! నేను చంద్రశేఖరాన్ని మాట్లాడుతూంట! ఆ కాగితాల్ని నాకెప్పుడు చేరుస్తావ్?"

నారాయణరావుకి చిర్రెత్తుకొచ్చింది. నా కిష్టమయినప్పుడు ఇస్తాను సరా!"

"నాకు ఇప్పుడే కావాలి!" బాస్‌లాగ పలికాడు చంద్రశేఖరం.

"అలాగే తెస్తాను. నా వెనుకే పోలీసులుగూడ వస్తారు. వాళ్ళు నామీద నిఘా ఉంచారేమో అని నా అనుమానం!"

"నిజంగా! నీమీద నిఘావేశారా పోలీసులు?"

"అని నా అనుమానం. కనుక ఒకటి రెండు రోజుల్లో, ఎలాగో వీలుచేసుకుని తెచ్చిస్తాను సరా!"

"అబ్బా! రెండురోజులే! అంతదాకా నా ప్రాణం ఓపలేదు. సాయంత్రంలోగా, నీవు ఎన్ని తిప్పలన్నా పడి, వాటిని నాకు చేర్చావో, నీకు మరో వెయ్యిరూపాయలు అదనంగా ఇస్తాను సరా?" చంద్రశేఖరం బేరంలోకి దిగాడు.

"సరే! అయితే సాయంత్రంలోగా ప్రయత్నిస్తాను." టెలిఫోన్ పెట్టేసి తన ఆఫీసులో ప్రవేశించాడు.

పిట్టగోడకానుకుని నిలబడి తననెవరైనా 'వాచ్' చేస్తున్నారా అని పరిశీలనగా చూశాడు చుట్టూరా. కొద్ది క్షణాలు చూశాక ఎవరూ తనకోసం నిఘా వేయలేదని

నిర్ధారణ చేసుకున్నాడు. తర్వాత మాలిని గురించిన వ్యాసాన్ని తీసి తిరిగ్గా చదివాడు, కుర్చీలో కూర్చుని. ఆమెతో గడిపిన యువకుడు ఎవరోగానీ, ఆ వ్యాసంలో వారిద్దరి శృంగారం చదువుతూంటే, నారాయణరావుకే వెర్రెత్తిపోయింది. సెక్స్ పత్రికల్లో పడే కథలకన్న పచ్చి బూతుగా వుంది ఆ వ్యాసం. యువకుల్లో రక్తాన్ని వేడెక్కించే అలాంటి వ్యాసాల్ని ప్రచురించటంవల్లనే అర్జున రావు నడుపుతూన్న పత్రిక వేడివేడి పకోడీల్లా అమ్ముడు పోతోంది అనుకున్నాడు మనసులో నారాయణరావు.

ఆ వ్యాసం తాలూకు ప్రతిని ఒకదాన్ని తన రూమ్‌లో భద్రపరిచాడు నారాయణరావు. మరో ప్రతినీ, ఒరిజినల్నీ తీసుకుని చంద్రశేఖరాన్ని కలుసుకునే నిమిత్తం బయలు దేరాడు.

తన రాకకోసమే ఎదురుచూస్తున్నవాడిలా చంద్ర శేఖరం ఒంటరిగా కాచుకూర్చుని వున్నాడు.

జేబులోంచి కవరు తీసి చంద్రశేఖరం ముందు పడేశాడు నారాయణరావు. అతడు ఆ వ్యాసాన్ని తీసి ఆత్రతగా చదువుతుంటే, బల్లమీది సిగరెట్ ప్యాకెట్స్ అందుకుని, తాపీగా సిగరెట్‌ని వెలిగించాడు నారాయణరావు.

"దీనికోసమై అర్జునరావుని నీవేం చేయలేదు గదా?" చదవడం పూర్తయాక చంద్రశేఖరం అడిగాడు.

"లేదు! నా కా శ్రమ లేకుండా, యెవరో నా రాకకు ముందే అతడికి టిక్కెట్టు ఇచ్చేశారు. కాగా పోగా నా అనుమానం నీవే ఆ పని చేయించలేదు గదా అని?" కొన కంటితో చిలిపిగా చూస్తూ అడిగాడు నారాయణరావు.

"నీకేం మతిపోయిందా? అతడ్ని హత్య చేయించాల్సిన పని నాకేముంది? కాకపోతే డబ్బు పారేసి నీలాంటి

కిరాయి మనుష్యుల్ని ఇంకా పదిమందిని పెడతాను. నాకు కావలసిన కాగితాల్ని తెప్పించుకుంటాను. దీనికోసం నా చేతుల్ని ఎందుకు ఖరాబు చేసుకోవాలి? అయినా ఆ విధంగా నీవే అనుమానిస్తున్నావా? లేక పోలీసులకు కలిగిందా ఆ ప్రశ్న?"

"లేదు. నేనే ఊరికే అడిగాను!"

"చంపావ్ ఫో! ఇదిగో నాయనా! ఇక ఎన్నడూ అలాంటి వెధవ 'విట్'లు వెయ్యకు. నాకు అసలే గుండె పోటు గూడాను. ఠపీమని చెప్పా చెయ్యకుండా, నా గుండె ఆగిపోతుంది గూడ!"

"అలాగా! అయితే నా పొరబాటుకి మన్నించండి. పోతే మీరు ఫోన్‌లో వాగ్దానం చేసిన అదనపు ఫీజు గురించి..."

"తప్పకుండా! ఈ చంద్రశేఖరం డబ్బుదగ్గర వెనుకాడే వ్యక్తి కాదు. మాటంటే మాటే!" అంటూ డ్రాయర్ సొరుగు తెరచి వెయ్యిరూపాయలు నారాయణ రావు ముందు పడేశాడు. "నీ సామర్థ్యం గురించి నా ఫ్రెండ్స్‌కికూడా తెలియజెప్పి, నీకింకా కేసులు తగిలేలా చూస్తాను సరా!"

"మీ సహాయానికి కృతజ్ఞుడ్ని. ఇక నాకు సెలవు ఇప్పిస్తారా?" నారాయణరావు కుర్చీలోంచి లేవబోయాడు.

"ఇక ఈ వ్యాసం తాలూకు ప్రతులు ఆ పత్రిక ఆఫీసులో గానీ, మరెక్కడన్నా గానీ లేవట్టేగదా?" అనుమానంగా చూస్తూ అడిగాడు, చంద్రశేఖరం.

"నా దగ్గర కార్బన్ కాపీ ఉంది. మేం చేపట్టిన మొదటి కేసు గనుక, దాని తాలూకు రికార్డు ఏదైనా మా దగ్గర ఉండటం సమంజసంగా తోచింది నాకు.

దాన్ని ఇతరు లెవరికీ చూపించనని ప్రమాణం చేస్తు న్నాను."

చంద్రశేఖరం ముఖం అంతలోనే వివర్ణమైంది. కోపంతో కళ్ళు ఎరుపెక్కాయి. "చాల్లే నిర్వాకం! నిన్ను నమ్మి నందుకు నన్నే మోసం చేస్తానంటావా? రేపు సాయంత్రం లోపల ఆ కాపీ గూడ నాకు తెచ్చి ఇవ్వు!" అని అరి చాడు.

"ఇవ్వకపోతేనో?"

"ఇచ్చి తీరాలి!"

"ఏం బెదిరిస్తున్నారా? డిటెక్టివ్‌లు అన్యాయమైన పనుల్ని చేయరని మీకు తెలియదేమో?"

"మిస్టర్! నీవు ఎలాగైనా అనుకో! మాలినికి సంబంధిం చిన కాగితా లన్నిటినీ నాకు చేర్చే ఒప్పందం మీదనే నిన్నీ పనికి నియమించాను. కనుక నీవు నా మాటకు కట్టు బడి ఉండటమే క్షేమం!"

నారాయణరావు ఒక్క క్షణం ఆలోచించాడు. "సరే! ఇక్కడ మీరే అధినేతలు. మీరు చెప్పిన మార్గాన పోవ టమే నా విధి! అలాగే తెచ్చిస్తాను" అంటూ అక్క డ్నుంచి విసురుగా బయటికి వచ్చాడు నారాయణరావు.

## 6

ఆఫీసుకి తిరిగి వస్తూ, దోవలో నారాయణరావు అదే పనిగా ఆలోచిస్తున్నాడు, అర్జునరావుని ఎవరు హత్యచేసి ఉంటారా అని. చంద్రశేఖరం ఆ పని చేయించి ఉండ డనే అనిపిస్తోంది అతడి అంతరాత్మకు. అతడే గనుక ఈ హత్యకు సిద్ధపడి ఉంటే, మాలిని ఉదంతం గురించిన కాగి తాలకోసం తన నెందుకు నియమిస్తాడు? హత్యానంతరం తీరిగ్గా అర్జునరావు ఆఫీసంతా సోదాచేసి అతడికి కావలసిన

కాగితాల్ని వెదికి తీసుకునే వాడే గదా!

మరయితే అర్జునరావుని హత్య చేయాల్సిన అవసరం మరెవరికి ఉంటుంది? 'తెరవెనుక న్యూస్' పక్ష పత్రికలో మాలిని ఉదంతం లాంటివే ఇంకా బోలెడన్ని వ్యాసాలు ఉన్నాయ్.ఆ వ్యాసాల ప్రచురణవలన అప్రతిష్టపాలవుతా మనే భయం గల అనేకమందిలో ఏ ఒకరికైనా అర్జున రావుని హతమార్చే అవసరం ఉండవచ్చు! అతడి ఆచూకి ఎలా చిక్కించుకోవాలి?

ఆలోచిస్తూనే మెల్లెక్కుతుండగా, టెలిఫోన్ రంయ్ మని మ్రోగింది. అది తనకోసమే అయి ఉండవచ్చని అతడి అంతరాత్మ అరిచింది. అలానే మెట్ల మీదనే ఆగి పోయాడు.

రిసీవరెత్తి, కాల్ని అందుకున్న సబ్ పోస్టుమాస్టర్ నవ్వుతూ అరిచాడు,"సార్ నారాయణరావుగారూ! మీకే నండీ కాల్!"

నారాయణరావు ఫోన్ దగ్గరకు నడిచాడు.

"నా మాట విని మీరూ ఫోన్ పెట్టించుకోండి సార్!" సబ్ పోస్టుమాస్టర్ ఛలోక్తిగా అన్నాడు.

"హలో! నారాయణరావు మాట్లాడుతూంట!"

"హలో నారాయణరావ్! నేను ఇన్స్పెక్టర్ రాజు మాట్లాడుతున్నాను. మీరు స్టేషన్కి ఎంతసేపట్లో రాగలరు?"

"కొంచెం బిజీగా ఉన్నాను. రేపుదయం కలుసు కుంటాను తీరిగ్గా!"

"అలా వీల్లేదు! తక్షణమే, ఉన్నపళాన రావాలి! లేదంటే రాజలాంఛనాలతో, మందీ మార్బలంతో నేనే రప్పించుకోవాల్సి ఉంటుంది."

అంటే నలుగురు పోలీసుల్ని పంపి, తనను పోలీస్ వ్యాన్‌లో ఎక్కించి తీసుకువెడతారన్నమాట అనుకున్నాడు నారాయణరావు.

"మీకంత శ్రమ అక్కర్లేదు. ఇదో ఇప్పుడే బయలుదేరి వస్తున్నాను గురూ!"

"అలా బుద్ధిమంతుడివనిపించుకో!" ఇన్‌స్పెక్టర్ ఫోన్ పెట్టేశాడు.

మరో పావు గంటలో నారాయణరావు ఇన్‌స్పెక్టర్ సమక్షంలో ఉన్నాడు.

"మిస్టర్ నారాయణరావ్! లోగడ ఎప్పుడైనా నీ జీవితంలో పోలీసువారి ఆతిథ్యం పొందావా?"

"లేదు! మిలిటరీలో అప్పుడప్పుడు, చేసిన పొరబాట్లకు చిన్న చిన్న శిక్షలు తప్పించి, ఏనాడూ 'డార్క్ సెల్' లోకి గాని, మిలిటరీ జైలుకిగానీ వెళ్ళి ఎరుగను!"

"మనం కూర్చున్న చోటునుంచి లాకప్ గది ఎంత దూరం ఉంటుందంటావ్?"

"సుమారు పది అడుగులు!" అన్నాడు నారాయణరావు తనకూ లాకప్ రూమ్‌కీ మధ్య దూరాన్ని అంచెనా వేస్తూ.

"నేనిప్పుడు కొన్ని ప్రశ్న లడగబోతున్నాను. వాటికి కరెక్టుగా సమాధానం చెబితే లాకప్ రూమ్ నుంచి ఒక్కో ప్రశ్నకూ ఒక అడుగు ఇవతల పడతావ్. తప్పు చెప్పిన ప్రతిసారికీ ఒక అడుగు లాకప్ గదికి చేరువ అవుతావు! ఆ విషయం బాగా గుర్తుంచుకో."

"మీ వాక్చాతుర్యానికి నా అభినందనలు. ఇక మీ ప్రశ్న లేమిటో వినాలన్న కుతూహలం ఎక్కువౌతోంది, అంతకంతకూ!"

మొదటి ప్రశ్న: "నీవు ఎవరి తరఫున పని చేస్తున్నావ్?"

"అర్జునరావ్! అతడే నాకు ఫోన్ చేశాడు. తన నెవరో చంపుతామని బెదిరిస్తున్నట్టు చెప్పాడు. తాత్కాలిక రక్షణ కోసమూ, ఆ బెదిరింపుదార్లను శోధించి పట్టుకునేందుకూ అర్జునరావే నా సాయం కోరాడు."

"అతడుగాక ఇంకెవరూ నీ క్లయింట్స్ లేరా?" సూటిగా కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు ఇన్‌స్పెక్టర్ రాజు.

తను మనసులో దాస్తున్న విషయాలన్నీ ఇన్‌స్పెక్టర్ ఎలా పసిగట్టి చెప్పగలిగాడా అని అబ్బురపడ్డాడు నారాయణరావు.

"సినీ దర్శక నిర్మాత చంద్రశేఖరం!" నిజాన్ని అయిష్టంగానే వెళ్ళగక్కాడు.

"ఒక అడుగు ఇవతల పడ్డావ్ జైలు గేటు నుంచీ! రెండో ప్రశ్న: చంద్రశేఖరానికి ఏవిధంగా సహాయపడాలనుకున్నావ్?"

"అతడికి సంబంధించిన అభ్యంతరకరమైన సమాచారాన్ని అర్జునరావు తన పత్రికలో ప్రచురించబోతున్నాడని తెలిసింది. ఆ వ్యాసం ప్రచురణ అవక ముందే, దాన్ని తెచ్చి ఇవ్వమని కోరాడు చంద్రశేఖరం నన్ను. అర్జునరావుకి నయానో, భయానో నచ్చజెప్పి, దాన్ని తేవాలనే నేనూ అతడి ఆఫీసుకు వెళ్ళాను."

"ఓహ్! నా సర్వీసులో నిజాన్ని ఇంత నిర్భయంగా వెళ్ళబెట్టిన అనుమానితుల్ని చూడలేదంటే నమ్ము. నీవే గనుక ఈ విషయం చెప్పకపోయివుంటే, అర్జునరావు

ఆఫీసులోకి దొంగతనంగా జొరబడి హత్య చేశావన్న నేరానికి నిన్ను అరెస్టు చేసేవాడ్ని."

"నేను దొంగతనంగా జొరబడలేదు. అప్పటికే ఎవరో లోపల గదిలోని డ్రాయర్లు శోధించారు. వాళ్ళే అర్జునరావుని హత్య చేసి ఉంటారని నా అనుమానం!"

"నీవు వెళ్ళింది ఎవర్ని గురించిన సమాచారం కోసం?"

"ప్రఖ్యాత వెండితెర హీరోయిన్ మాలిని గురించిన ఉదంతం విషయమై."

"ఏమిటా ఉదంతం?" ఇన్‌స్పెక్టర్ ఆసక్తిగా చూశాడు.

"నేనైతే దాన్ని ఆసాంతం చదవలేదు!" ధైర్యంగా చిన్న అబద్ధమాడేశాడు నారాయణరావు.

"ఇప్పుడా వ్రాతపతి ఎక్కడుంది?"

"చంద్రశేఖరం ఐరన్ సేఫ్‌లో!"

"అయితే హత్యకాబడ్డ అర్జునరావు, 'తెరవెనుక న్యూస్' పక్షపత్రికకు ఏకైక ఎడిటర్, పెద్ద బ్లాక్ మెయిలర్ అన్నమాట!"

"అలాగే తోస్తున్నది ఈ కేసుని చూస్తుంటే!"

"మా డిపార్టుమెంట్ వేలిముద్రల నిపుణులు, అర్జునరావు ఆఫీసు డ్రాయర్లమీదా, సొరుగులమీద నీ వేలిముద్రల్ని పసిగట్టారు. అందుకే నిన్ను క్షణాలమీద రప్పించాను. ఇక నీవు వెళ్ళొచ్చు! నిన్ను అనుమానితుడిగా అరెస్టు చెయ్యాల్సి వస్తుందనుకున్నాను. కానీ నిజాన్ని నిర్భయంగా చెప్పి, మాకా శ్రమను తప్పించావ్!"

నారాయణరావు ఇన్‌స్పెక్టర్‌కు కృతజ్ఞత చెప్పుకొని అక్కడ్నుంచి బయటపడ్డాడు.

అర్జునరావు హత్య కాబడ్డాడన్న ఆతృతలోనూ, మాలిని గురించిన కాగితాల్ని దొరకబుచ్చుకోవాలన్న ఆదుర్దాలోనూ, తన వ్రేలిముద్రలు గాడ్రెజ్ సొరుగులమీద పడతాయన్న ఆలోచనే రానందుకు ఒక్క క్షణం విచారించాడు.

# 7

హోటల్లో భోజనంచేసి రూమ్‌కి చేరుకున్నాడు. రాణి గది తాళం వేసి ఉంది. బహుశా ఏ స్టుడియోకో లేక ఆ రోజు గడుపుకునేందుకు ఏ విటుడితోనో వెళ్ళి ఉంటుందనుకున్నాడు నారాయణరావు.

తన జేబులోంచి తాళాల గుత్తి తీసి, రాణి గది తాళం తీయటానికి యత్నించాడు. ఒకటి రెండు బీగాలు మార్చి చూశాక, తాళం వచ్చింది.

లోపలకు జొరబడి, విడిచేసిన గుడ్డల పెట్టె అడుగున దాచిన కవర్లకోసం చూశాడు. ఆ పెట్టె మూత తీసివుంది. పైపైన ఉన్న గుడ్డలు చిందరవందర చేయబడినై.

ఒకవేళ రాణియే ఏదైనా అండర్‌వేర్‌కోసరం కలబెట్టిందేమో అనుకుంటూ, అందులో చేయిపెట్టి కవర్ల కట్టను బయటకు లాగాడు.

కవర్ల చుట్టూ ఎర్రని రిబ్బన్‌తో కట్టి ముడివేశాడు తను. ఇప్పుడా రిబ్బను వదులుగా వుంది. ఈ కవర్లను రాణిగానీ శోధించిందా?

తను అర్జునరావు ఆఫీసునుంచి ఏడు కవర్లను తెచ్చాడు. మాలిని కవరుని చంద్రశేఖరానికి అప్పజెప్పేశాడు. పోతే ఇంకా ఆరు కవర్లు ఉండాలి! కానీ ప్రస్తుతం అయిదే ఉన్నయ్! ఎవరికీ కనబడకుండా నిగూఢంగా దాచిన

వాటిని ఎవరు తీసిఉంటారబ్బా! రాణి ఈ పని చేసి ఉండదు.

అతడి మనసులో మరో దృశ్యం మెదిలింది. అర్జునరావు కోసం తను పత్రిక ఆఫీసుకు వెళ్ళాడు. హంతకుడు అర్జున రావుని అప్పుడే యమపురికి సాగనంపాడు. ఎవరో రావడం చూసి అతడు లోపలే ఎక్కడో నక్కాడు. తను ఇవేమీ గమనించే పరిస్థితిలో లేడు. రికార్డు రూమ్ లోకి వెళ్ళి తను కొన్ని డాక్యుమెంట్స్‌ని సంగ్రహించాడు. వాటిలోనే హంతకుడికి కావలసిన సమాచారం, అర్జున రావుని నిలువునా హత్య చేసేందుకు ప్రేరేపించిన నిగూఢ మైన, అత్యవసర సమాచారం ఉండి వుంటుంది.

మౌనంగా హంతకుడు తనను వెంటాడుతూనే వున్నాడు. తన గదిలో ఇలాంటి అతి ముఖ్యమైన కాగి తాల్ని దాస్తాడని ఎవరూ నమ్మలేరు. అందుకే తను రాణి గదిలోకి వెళ్ళి రావటాన్ని గమనించిన హంతకుడు తను చేసిన పనిని కరెక్టుగా ఊహించాడు.

అటు తనూ, ఇటు రాణి లేని సమయంలో వచ్చి, రాణి గదిలోకి జొరబడి, తనకు కావలసిన సమాచారాన్ని ఎత్తుకుపోయాడు. నారాయణరావుకి తల తిరిగిపోయినంత పనయింది. తన వెనుకనే ఇంత గ్రంథం నడుస్తుందని అతడు ఏమాత్రం ఊహించలేకపోయాడు. తన ముంగిట్లోకి వచ్చి, నిర్భయంగా సంచరించిన హంతకుడ్నే తను పట్టుకో లేకపోయాడు. ఇక తన పరిశోధన నిరర్థకం అనుకున్నాడు.

రాణి గది యథాతథంగా లాక్ చేసి తన గదిలోకి తిరిగి వచ్చాడు నారాయణరావు. ఇప్పటికయినా హంతకుడ్ని త్వరలో వెదికి పట్టుకోకపోతే, తనకు గానీ, లేదా రాణికి

గాని ప్రాణసంకటమే! అయితే హంతకుడి ఆచూకీ కను క్కోనే దెలాగ?

అరగంటసేపు ఆలోచించాక గానీ అతడికి మరొక ఊహ తట్టలేదు. వెండితెరపై సంచరించే సినీతారల చీకటి జీవితాల్ని బట్టబయలు చేసే పక్షపత్రిక 'తెరవెనుక న్యూస్' ఆఖరి సంచికను తిరగేస్తేనో! అందులో తప్ప కుండా, ముందుముందు వెలవరించబోయే వార్తల తాలూకు సంగ్రహ ప్రకటనలుంటయ్. ఆ ప్రకటనలవలన నష్టబోయే వారిలోనే తప్పకుండా హంతకుడు ఉండి తీరతాడు.

వెంటనే "తెరవెనుక న్యూస్" పత్రిక ఆఖరు సంచి కను బయటకు తీశాడు. తనూహించినట్లే, అందులో సమా చారం దొరికింది. వచ్చే సంచికలో ఏడుగురి తారల తెర మరుగు నికృష్ట జీవితాల్ని వెల్లడించబోతున్నట్టుగా వుంది. మాలిని ఉదంతం గూడ అందులో ఒకటి.

తనవద్ద ఉన్న అయిదు కవర్లూ తెరిచి, అందులోని ఉదంతాల్నంతా చదివాడు. వాటితాలూకు ప్రకటనలు ఆఖరు సంచికలో ఉదహరించబడి వుంది. ఆరోది మాలినికి సంబంధించింది.

వాటిల్లో ఏడవది: గ్లామర్ తగ్గిపోయి, వయసుడిగి పోయిన ఒకానొకప్పటి అందాల హీరోయిన్ రాజామణి అనే ఆమె తన భర్తకు విడాకులిచ్చి, భారత సంప్రదా యానికి విరుద్ధంగా, తనకన్న వయసులో చిన్నవాడైన ఎక్స్ట్రా నటుడ్ని రహస్యంగా పెళ్ళాడిన ఉదంతం ఉంది.

తనవద్ద ఉన్న కవర్లలో తత్సంబంధమయిన వ్యాసం లేదు. అంటే ఆ కవరే తనవద్దనుంచి సంగ్రహించబడిం

దన్నమాట! ఆ మెతాలూకు వ్యక్తే ఈ హత్యను చేసివుంటాడనేందుకు ఏమాత్రం సందేహం లేదు.

హంతకుడి ఆచూకీ దొరికిందన్న సంబరంలో నారాయణరావు కుర్చీలోంచి లేచాడు. హుటాహుటిన దగ్గరలో వున్న స్టుడియోకి చేరుకున్నాడు. రిసెప్షన్‌లో రాజామణి ఇంటి అడ్రసు అడిగి తెలుసుకున్నాడు.

దోవలో పెట్రోల్ బంక్‌లో మోపెడ్స్ బండికి పెట్రోల్ పట్టించి, రాజామణి ఇంటికి బయలుదేరాడు నారాయణరావు.

సిటీ పొలిమేరలో ఉంది రాజామణి బంగళా. చుట్టూ బోలెడంత విస్తీర్ణం, మధ్యలో లంకంత బంగళా ఆమెది.

ద్వారంవద్దకు వెళ్ళి బెల్ పుష్ నొక్కాడు నారాయణరావు. కొద్దిక్షణాల్లో తలుపులు తెరుచుకున్నాయ్. తెల్లటి యూనిఫారంలో అప్పుడే స్వర్గంనుంచి దిగిన దేవతలా ఉన్న యువతి వాకిట్లో నిల్చుని వుంది. ఆమె నర్స్ అని తెలుసుకున్నాక, తను రాజామణిని కలుసుకోవాలని వచ్చినట్టు వెల్లడించాడు.

"లాభంలేదు. ఆమె ఆరోగ్యం సరిలేదు. రెండురోజుల్నుంచి 'కోమా'లో ఉందామె!" అంది నర్స్.

"అదేం? పాపం! ఏం జబ్బు ఆమెకు?" నారాయణరావు సానుభూతిని వ్యక్తం చేశాడు.

అంతలో మరో వ్యక్తి రంగంలోకి వచ్చాడు. అతడు ఎర్రగా, పొడుగ్గా ఉన్నాడు. కండలు తిరిగిన దేహంతో ఆడవాళ్ళ మనసుకు హత్తుకుపోయేటంత అందంగానూ ఉన్నాడు.

"మేరీ! ఆ వచ్చినాయన సంగతి నేను చూసుకుంటాను.

నీవు అమ్మగారి దగ్గరకు వెళ్ళు!" అన్నాడా వ్యక్తి నర్స్‌ని ఉద్దేశించి.

నర్స్ లోపలకు వెళ్ళిపోయింది.

"మిస్టర్! ఎందుకొచ్చావ్ ఇక్కడకు?" కోపంగానూ, తన అధికారం ఉట్టిపడే కంఠంతోనూ అతడు అడిగాడు.

"రాజామణిగార్ని చూడాలని వచ్చాను."

"బయట బోర్డు చదవలేదూ? అనుమతి లేనిదే లోనికి రాకూడదు! అని? కనుక మర్యాదగా బయటకు నడు ముందర!"

"అలా అనకండి! మీ క్షేమాన్నాకాంక్షించే వచ్చాను నేను. నా మాట ఆలకిస్తే, మీకు పెద్ద బెడద తప్పు తుంది!"

"ఏమిటా బెడద?" అందాల యువకుడు చిరాగ్గా చూశాడు.

"పోలీసుల బెడద?" నిబ్బరంగా పలికాడు నారాయణ రావు.

ఆ వ్యక్తి బెదురుగా చూశాడు.

"అంటే మీరు పోలీసు ఆఫీసరా?"

"కాదు. ప్రయివేట్ డిటెక్టివ్‌ని!"

"అలాగా! నా పేరు నాగరాజు. రాజామణి నా భార్య!" అంతవరకూ కోపంగానూ, తీవ్రంగానూ కను పించిన వ్యక్తి హఠాత్తుగా మారిపోయాడు. అతడిలో కలిగిన వైఖరిని చూశాక అతడు నిజంగానే ఆరితేరిన నటుడని గ్రహించాడు నారాయణరావు.

"డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్ళి మాట్లాడుకుందాం రండి! మీ పేరేమిటో చెప్పనేలేదు!"

"మిస్టర్ నారాయణరావు!"

"నారాయణగారూ! ఇక మీరు వచ్చిన పనేమిటో చెప్పండి! నాకవతల ఇంకా బోలెడన్ని పనులున్నయ్" నాగరాజు తొందరచేశాడు.

"మీరీ మధ్య పేపర్లో వార్తలు చదువుతున్నారా?"

"నిజానికి నేను పేపరు చూసి నాలుగురోజు లవుతుంది! ఏం జరిగిందట?"

"తెరవెనుక న్యూస్ పక్షపత్రిక ఎడిటర్ అర్జునరావుని ఎవరో హత్యచేశారు."

"అర్జునరావో, కృష్ణమూర్తో నాకెవరూ తెలియదు. కానీ ఆ పత్రిక ఎడిటర్ చేసే వెధవ పనులకి, అతడ్నెవరో తప్పకుండా హత్యచేస్తారని నే నేనాడో ఊహించాను."

"తెరవెనుక న్యూస్ ఆఖరి సంచికలో ఏడుగురి సినీ వ్యక్తుల జీవితాల గురించిన ఉదంతాల్ని బయట పెట్టబోతున్నట్టుగా ప్రకటన వెలువడింది. ఆ ఏడుగురిలో నే ఎవరో ఒకరు ఈ హత్యను చేసివుండాలని నా అనుమానం!" నారాయణరావు అవతల వ్యక్తి ముఖభంగిమల్ని గమనిస్తున్నాడు.

"ఆ ఏడుగుర్నీ వరుసగా ఇంటర్వ్యూ చేస్తున్నాం. వాంతవడి ఆచూకీకోసం రాజామణిగార్ని కలుసుకోవాలి నేను!" మళ్ళీ అన్నాడు నారాయణరావు.

"అది వీలుపడదిప్పుడు. ఎందుకనంటే ప్రస్తుతం రాజామణి తీవ్రమైన జబ్బుతో వుంది. మనిషిగూడ స్పృహలో లేదు. డాక్టర్ గురవారావుగూడ ఆమెను కనిబెట్టుకునే వున్నారు. కావాలంటే ఆయనతో మాట్లాడి, నే చెప్పిన విషయం నిజమో, అబద్ధమో తేల్చుకోండి!" నాగరాజు గబగబ పాఠం చదివినట్టుగా చెప్పుకుపోతున్నాడు.

"సరే! మీరు చెప్పిన విషయమే ఒప్పుకుంటాను. రాజామణి రెండురోజుల్నించీ స్పృహలో లేదనే అనుకుందాం! అర్జునరావు హత్యచేయబడిన సాయంకాలం మీరెక్కడున్నారు?" నారాయణరావు అనుమానంగా చూశాడు.

"ఇది మరీ బాగుంది! ఉరుము ఉరిమి ఉరిమి మంగలం మీద బడిందట! అర్జునరావును చంపాల్సిన అవసరం నాకేముంది. అయినా, ఆరోజు నేనొక మిత్రుడితో సినిమాకు వెళ్ళాను!"

"ఎవరా మిత్రుడు?"

"అతడీ ఊళ్ళోలేడు ప్రస్తుతం! మీరు నన్ను అనవసరంగా అనుమానిస్తున్నారు!"

"లేదు. మిమ్మల్ని ప్రశ్నించటానికి నాకు సరైన కారణం వుంది. రాజామణికి సంబంధించిన కవరు అర్జునరావు ఆఫీసునుంచి మాయమయింది! ఆ పనిని రాజామణి చేసి వుండటానికి ఆమెకు అవకాశంలేదు, ఎందుకనంటే ఆమె గత కొద్దిరోజులుగా 'కోమా'లో ఉంది గనుక. ఇకపోతే అలాంటి అవకాశం, అవసరమూ మీకు తప్ప మరెవరికీ లేదు!"

"ఇదంతా మీ అభూతకల్పన! మీరు చెప్పేదే నిజమై వుంటే, నాకోసం పోలీసులు రాలేదేం?" తనే తెలివిగలవాడిలా ప్రశ్నించాడు నాగరాజు.

"వాళ్ళకింకా ఈ విషయం తెలియదు!"

"అర్జునరావే దాన్ని మరెక్కడైనా దాచాడేమో! ఏది ఏమైనా రాజామణికి సంబంధించిన ఉదంతం బయటకు రాదు ఇక! అంతవరకూ మేం అదృష్టవంతులం!" నాగరాజు కళ్ళు ఆనందంతో మెరిసినయ్.

"తన గురించిన ఉదంతం 'తెరవెనుక న్యూస్' పత్రికలో పడుతున్నదన్న విషయం రాజామణిలో యెలాంటి ఉద్రిక్తతనూ రేపలేదా?"

"ఆమెకు చాలా కోపం వచ్చింది. ఆ పత్రిక ఎడిటర్ పై పరువునష్టం దావా వేస్తానంది. కానీ ఈ లోపలే ఆమెకు అనారోగ్యం కలిగింది. అయినా ఆమె దావా నెగ్గదనుకుంటాను. ఎందుకంటే అలాంటి పత్రికల్లో ప్రచురింపబడే వార్తలకు తగిన సాక్ష్యాధారాలు లేకుండా వేయరు. లేకపోతే, ఈ నాటికి సినీఫీల్డులో వారంతా దావా వేసి, అర్జునరావుని జైలుకి పంపివుండేవారే కదా?" నాగరాజు నిదానంగా, ఎలాంటి ఉద్వేగమూ లేకుండా చెప్పాడు.

# 8

"హల్లో మిస్టర్ డిటెక్టివ్! నీకోసం రెండుసార్లు ఫోన్ చేశాను. దొరకలేదు, మీకో శుభవార్త చెబుదామంటే!" పోలీస్ ఇన్‌స్పెక్టర్ నవ్వాడు నారాయణరావు వంక చూసి.

"ఏమిటి సార్ ఆ వార్త?"

"మీ ప్రథమ క్లయింట్ చంద్రశేఖరాన్ని హత్యా నేరంపై అరెస్టు చేశాం. బెయిల్ గూడ నిరాకరించబడి, మా అతిథ్యంలో వున్నాడు. మీ కోసం పాపం తెగ కలవరిస్తున్నాడు."

ఇన్‌స్పెక్టర్ మాటలు విని నారాయణరావు విభ్రాంతుడయ్యాడు. తనిచ్చిన సమాచారాన్ని ఆధారం చేసుకుని పోలీసులు చంద్రశేఖరాన్ని అనుమానించారన్నమాట! తీసుకొచ్చి కటకటాల వెనుక పెట్టారన్నమాట! తన

మొదటి క్లయింట్ ఈ రకమైన దుస్థితికి దిగజారటం అతడికి నచ్చలేదు.

నారాయణరావు జైలు గదిని సమీపించాడు.

కటకటాల అవతల దీనంగా చూస్తూ నిలబడివున్నాడు చంద్రశేఖరం. నారాయణరావుని చూడంగానే అతడికి ప్రాణం లేచివచ్చింది.

"ఏం డిటెక్టివ్‌వయ్యా నువ్వు! నీకేదో పని పురమాయిస్తే నన్నే హంతకుడి క్రింద అరెస్టు చేయిస్తావా?" చంద్రశేఖరం ఆవేశంగా అన్నాడు.

"ఆవేశపడకండి! మీరీ హత్య చెయ్యలేదనే నేనూ నమ్ముతున్నాను. ఐనా మిమ్మల్ని ఎలా అనుమానించారో నా కర్థం కావటంలేదు."

ఈ హత్యను చంద్రశేఖరమే చేసి తనపై అనుమానం రాకుండా కాపాడుకునేందుకే డిటెక్టివ్‌ని నియమించటం జరిగింది, ఈ కారణాలవల్లనే చంద్రశేఖరం అనే సినీ దర్శక నిర్మాతను అనుమానంపై అరెస్టు చేయటమైనది— అది పోలీసుల అనుమానం.

చంద్రశేఖరం తనపై తేబడిన అభియోగాన్ని నారాయణరావుకి వినిపించాడు.

"నేనీ హత్య చేయలేదు. ఎలాగైనా నన్నిక్కడ్నుంచి బయటకు లాగండి నారాయణరావ్‌గారూ!"

"అదే ఆలోచిస్తున్నాను. అర్జునరావును హత్యచేసిన వ్యక్తికోసం గాలిస్తున్నాను. త్వరలో అతడ్ని దొరకబుచ్చుకోగలననే నమ్ముతున్నాను. మీరు నిశ్చింతగా ఉండండి" అని ధైర్యం చెప్పి అక్కడినుండి కదిలాడు నారాయణరావు.

# 9

తన రూమ్ కి త్రిప్పుతూ రాణి గదివేపు చూశాడు నారాయణరావు.

రాణి గది తలుపు వారగా వేసి ఉంది. అదే నారాయణ రావుకు ఆశ్చర్యాన్ని కలిగించింది. రాణి బయటకు వెడితే, తలుపుబయట తాళం వేస్తుంది. గదిలో ఎవరన్నా ప్రియుడితో సుఖిస్తుంటే, తలుపుమూసి లోపల గడియపెడు తుంది.

అందుకే ఆమె గది తలుపు వారగా వేసి ఉండటం నారాయణరావులో అనుమానాన్ని రేకెత్తించింది. తన గది తలుపు తెరవకుండానే, చప్పుడు చేయకుండా రాణి గదివద్దకు వెళ్ళాడు. తలుపుమీద చేయివేసి నెట్టాడు. తలుపు పూర్తిగా తెరుచుకుంది. నారాయణరావు శరీరం మీద రోమాలు నిక్కబొడుచుకున్నయ్.

“రాణి!” అని పిలుస్తూ లోపలకు ప్రవేశించాడు. గదిలో డిమ్ లైటు వెలుగుతోంది. ఆతృతగా ముందుకు నడిచాడు. గది అంతా చిందరవందరగా ఉంది. నేలమీద రాణి గుడ్డలూ, పుస్తకాలు ఇష్టమొచ్చినట్టుగా పడి ఉన్నయ్. కొద్ది క్షణాల క్రితమే ఎవరో ఆ గదిలోని ప్రతి అరా, ప్రతి షెల్ఫునీ, ప్రతి సూట్ కేస్ నూ దేనికోసమో వెదికి నట్లుగా స్పష్టంగా తెలుస్తోంది, ఆ చిందర వందర చూస్తుంటే!

స్విచ్ బోర్డ్ దగ్గరకు వెళ్ళి లైటు వెలిగించాడు నారాయణరావు. అడుగు ముందుకు వేయబోయిన వాడల్లా, బెదిరిన గుర్రంలా వెనక్కు గెంతాడు.

బెడ్ కి ప్రక్కనే నేలమీద నగ్నంగా పడిఉంది రాణి. ఆమె ఒంటిమీద ఎక్కడా గాయాల్లేవు. సిల్కులాగున్న

ఆమె నల్లని కురులు ముఖంమీద పరదాలాగ కప్పబడినై.

బెడ్ మీద దుప్పటిలాగి ఆమె వక్షంవరకూ కప్పాడు.

ఆమె మరణానికి ఒక రకంగా తనకూ బాధ్యత ఉందేమో! 'తెరవెనుక న్యూస్' పత్రిక ఆఫీసునుంచి తను తెచ్చిన కవర్లను రాణి గదిలో దాచటంవల్లనే, అర్జున రావుని హత్యచేసిన హంతకుడు, రాణిని వెతుక్కుంటూ వచ్చాడు. సాధారణ విటుడిలా ఆమెను బుక్ చేసుకుని, ఎవరికీ అనుమానం కలగకుండా ఆమెను హత్యచేశాడు, ఆమె నుంచి సుఖాన్ని జుర్రుకున్న తర్వాత.

ఇంతకీ అతడికి కావల్సింది దొరికిందో లేదో? రెండు హత్యలు చేయటానికి వెనుకాడని హంతకుడు తననుగూడా వెతుక్కుంటూ రాడని నమ్మకం ఏమిటి?

పోలీసులకు ఫోన్ చేయటానికి వెనక్కు తిరిగాడు నారాయణరావు.

వెనుకవైపునుంచి ఎవరో అతడి తలపై బాదారు. నారాయణరావుకి కళ్ళు బైర్లు కమ్మాయి. కళ్ళు తెరచి ఆ ఆగంతకుడ్ని చూడటానికి యత్నించాడు.

"మరోటివ్వరా! వాడికి తెలివివస్తోన్నట్టుంది!" ఎవరిదో కర్కశమైన కంఠం వినిపించింది.

అంతలోనే మరో దెబ్బ పడింది. నారాయణరావు నేలకు జారిగిల పడ్డాడు. అతడు పూర్తిగా పడిపోకుండా, ఒక వ్యక్తి, అతడి వెనుకగా చంకల క్రిందనుంచి చేతులు వేసి గట్టిగా పట్టుకున్నాడు.

నారాయణరావుకి ఎదురుగా ఒక వ్యక్తి వచ్చాడు. అతడి చేతిలో నల్లని పిస్తోలు మెరుస్తోంది. ఆ వ్యక్తి ముఖకవళికల్ని గుర్తుపెట్టుకోవటానికి యత్నించాడు. ఆ వ్యక్తి లావుగా ఉన్నాడు. బండ ముఖం, కోర మీసాలు, త్రాగి

నందువల్ల ఎర్రబారిన కళ్ళూ, అచ్చం రోడ్లమీద తిరిగే రాడీ లాగున్నాడు. హాతికా పరక్కి కూడా అవలీలగా హత్యచేసే వాడిలా ఉన్నాడు.

"ఏమయ్యోవ్! పెద్దమడిసే! మేం సెప్పేది జాగ్రత్తగా విను! సినిమా పత్రిక ఆఫీసులోంచి కవర్లు దొంగిలించుకొచ్చావంట నీవు! వాటికోసమని పాపం ఆ యమ్మాయి ప్రాణాల్ని తోడేశాం. పాపం ఠకీమని చచ్చూరుకుంది. కానీ ఆ కాయితాలే కనుపించలేదు. ఒకవేళ అవి నీదగ్గర గానీ ఉంటే, వాటిని శాశ్వతంగా పూడ్చెయ్. లేదా నిన్ను బ్రతికుండగానే సజీవ సమాధి చేస్తాం. తెలిసిందా?"

"చాల్లే ఇక! మనం చెప్పాల్సింది చెప్పాం! ఇకవాడ్ని కాసేపు జోకొడదాం!" ఇద్దరూ కలిసి నారాయణరావు మీద గుద్దులవర్షం కురిపించారు. నారాయణరావుకి స్పృహ తప్పిపోయింది. నేలమీది జారిగిలబడ్డాడు. కళ్ళముందు నల్లని తెరలు జారినయ్.

## 10

మరో గంటలో ఆ గది అంతా పోలీసులతో నిండి పోయింది.

నారాయణరావుని అపస్మారక స్థితిలో వదిలేసి వెళ్ళి పోయారు గుండాలు. తెలివిరాగానే, తూలుకుంటూ నడిచి టెలిఫోన్ బూత్‌లోకి వెళ్ళాడు నారాయణరావు. పోలీస్ స్టేషన్‌కి ఫోన్ చేశాడు.

ఇన్స్పెక్టర్ రాజువచ్చాడు క్షణాలమీద. ఆంబులెన్సూ, పోలీస్ ఫొటోగ్రాఫర్లూ, డాక్టరూ, కానిస్టేబుల్స్ రాకతో ఆ ఫ్లాట్ అంతా మేలుకుంది. రాణి దేహాన్ని మార్చురీకి తరలించారు.

నారాయణరావుని అనేక ప్రశ్నలడిగారు. చివరకు రాణి హత్యను, ఉద్రిక్తుడైన ఆమె ప్రియుడెవరన్నా, రాణి మరెవరితోనో గడపడం చూసి సహించలేక ఈ హత్య చేసి ఉండాలని నిర్ధారించారు పోలీసులు. అర్జునరావు హత్యకూ, రాణి హత్యకూ ఏమాత్రం సంబంధాన్ని వాళ్ళు అంగీకరించలేదు.

ఆ ఫ్లాట్ యజమాని వచ్చాడు. రాణి ప్రవర్తనగురించీ, ఆమెకోసం వచ్చే ప్రియుల గురించీ చెప్పాడు పోలీసులకు. ఎంతో నిగూఢంగా, చాటు మాటుగా, తమ కోర్కెలను తీర్చుకుంటూ పోతున్న పెద్దమనుషులందరూ, రాణి హత్యమూలంగా, బజారుకీడ్వబడ్డారు. అందరూ ప్రశ్నించబడ్డారు. కానీ అనుమానితులెవరూ లేనందున, ఎవరూ అరెస్టు చేయబడలేదు.

నారాయణరావు తనవద్దనున్న మిగతా కవర్లను విప్పదీసి చదవక తప్పలేదు. అవన్నీ గూడ 'తెరవెనుక న్యూస్' తరువాయి సంచికల్లో ప్రచురణకుద్దేశింపబడినవే! అయితే అర్జునరావు హఠాన్మరణంతో అవి ప్రెస్‌లోకి వెళ్ళలేకపోయినయ్.

మిగతా కవర్లలో సైడ్ హీరోయిన్ల పడకటింటి ముచ్చట్లూ, క్లబ్ డాన్స్ చేసే తారల విపరీత కోర్కెలూ ముచ్చటించబడినై.

వాళ్ళ అడ్రసు ఒక్కొక్కటే వెతుక్కుంటూ వెళ్లాడు నారాయణరావు.

"మీ గురించి విపరీత వ్యాఖ్యానాలు ప్రచురించబోతుంటే మీకు కోపం రాలేదా ఆ పత్రికమీద?" అనడిగాడు ఒక తారామణిని.

"ఆమె నవ్వింది. ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగా గానీ మాకు పబ్లిసిటీ ఉంటేనే మేం సినీఫీల్డ్‌లో నిలద్రొక్కుకోగలం. ప్రముఖ సినిమా పత్రికల్లో మాముఖాల్ని ఎక్కడో మారుమూల వేస్తారు. అందుకే తెరవెనుక న్యూస్‌లోకి ఎక్కితే, సెక్సీస్టార్‌గా మాకు మాంఛి పబ్లిసిటీ వస్తుంది కానీ ఖర్చులేకుండా! ఆ కారణంగానే ఆ పత్రిక ఎడిటర్ ఆ వ్యాసాన్ని ప్రచురించకుండా ఉండేందుకు డబ్బడిగితే, నేను నిరాకరించటమేగాక తిట్టిపంపించాను.ఆ కోపంతో అతడు నా గురించిన మేటర్‌ని తప్పకుండా ప్రచురిస్తాడు. మాకు కావలసిందీ అదేగా!" అని వాస్తవాన్ని, దాపరికం లేకుండా చెప్పింది ఆమె.

మిగతా తారల్ని గూడ ఇంటర్వ్యూ చేసి తిరుగుముఖం పట్టాడు నారాయణరావు. కాని అతడికి అనుమానించదగ్గ సమాచారం ఏదీ దొరకలేదు.

వెళ్ళే దోవలో రాజామణి బంగళా ముందు ఆగాడు అతడు. తను లోగడ వచ్చినప్పుడు రాజామణి అస్వస్థతగా ఉంది. ఇప్పుడామె కెలా ఉందో తెలుసుకుందామని లోపలకు నడిచాడు నారాయణరావు.

రాజామణి పోర్టికోలో పేము కుర్చీలో తలగడలమీద కూర్చొని ఉంది. నాగరాజు ఆమె కెదురుగా కూర్చుని ఏవో కబుర్లు చెబుతున్నాడు.

"నమస్కారం! ఇప్పుడు రాజామణిగారి ఆరోగ్యం ఎలా వుంది?" అని వాకబు చేశాడు నారాయణరావు.

"కులాసాగానే వుంది. కానీ మీ చొప్పదంటు ప్రశ్నలకు సమాధానమిచ్చే ఓపిక లేదు ఆమెకు. దయచేసి వెళ్ళిపొండి!" నాగరాజు మాటకు అడ్డువచ్చాడు.

"ఎందుకలా కంగారు పడతావ్! నేనే ప్రశ్నలు వేయడానికి రాలేదు. కేవలం రాజామణిగార్నే చూడటానికి వచ్చాను. అంతే!"

"కూర్చోండి!" అంది రాజామణి, అతడివంక చూస్తూ.

"ఎలా వుంది మీ ఆరోగ్యం?"

"ఇప్పుడు కొంచెం నిదానించింది. అన్నట్టు మీరెవరు?" అంది రాజామణి.

"నా పేరు నారాయణరావ్! ప్రైవేట్ డిటెక్టివ్‌ని! మిలట్రీనుండి రిటైర్ అయ్యాను. 'తెరవెనుక న్యూస్' పత్రిక ఎడిటర్ అర్జునరావు హత్యచేయబడ్డాడు. ఆ కేసులో హంతకుడి ఆచూకీకోసం యత్నిస్తున్నాను."

రాజామణి ఆశ్చర్యాన్ని వెలిబుచ్చింది. "ఏమిటీ? రావు హత్యచేయబడ్డాడా? ఎవరా పుణ్యం కట్టుకుంది?"

"అర్జునరావు గురించి మీ అభిప్రాయం ఏమిటి?"

"అతడు నా గురించి తన పత్రికలో ఏవో అవాకులు చవాకులు, వేస్తానని బెదిరించాడు. నేను లెక్కచేయలేదు. ఆ తర్వాతేమయిందో తెలీదునాకు, నా అనారోగ్యం మూలంగా. నా గురించి ఆ పత్రికలో ఏదీ ప్రచురింపబడలేదని చెప్పాడు నాగరాజు. కానీ అర్జునరావు మరణం గురించి చెప్పలేదు." అంటూ రాజామణి, నాగరాజు వంక చూసింది.

"నీవు బలహీనంగా ఉన్నావ్! అందుకే ఈ దుర్వార్త చెప్పలేదు." వెంటనే అన్నాడు నాగరాజు.

"అర్జునరావు మరణవార్త నాలో సగం బలాన్ని కలిగించింది. అసలతడు బ్రతికే వున్నా, అతడిమీద ఈ పాటికి పరువునష్టం దావా వేసేదాన్ని!"

నాగరాజుకి ఈ సంభాషణ రుచించినట్టు లేదు, లేచి ఇంట్లోకి వెళ్ళిపోయాడు. రాజామణితో ఏకాంతంగా మాట్లాడేందుకు నారాయణరావుకి వీలు చిక్కింది.

"మిమ్మల్ని మరొక్క ప్రశ్న అడగక తప్పటంలేదు. అవతల ఒక నిరపరాధిని జైల్లోకి తోసేశారు. అతడి తరఫున నేను హంతకుడికోసం యత్నిస్తున్నాను."

"దాందేముంది! అడగండి! నా సహకారం మీకు తప్పకుండా వుంటుంది!" రాజామణి అనుమతినిస్తూ అంది.

"మీ గురించి 'తెరవెనుక న్యూస్' ప్రచురిస్తానన్న ఉదంతం దేనికి సంబంధించిందో? ఆ వార్త వివరాలు క్లుప్తంగా ఇవ్వగలరా? మీ వ్యక్తిగత విషయాల్లో క్షోభ్యం కలిగించుకోవలసిరావటం నాకూ బాధగానే వుంది. కానీ ఒక నిరపరాధిని విడుదలచేయించే ప్రయత్నంలో ఆ ప్రశ్న అడగక తప్పలేదు" నారాయణరావు వేడికోలుగా అడిగాడు.

రాజామణి లోపలకు తొంగిచూసింది, దాపుల్లో నాగరాజు వున్నాడేమో అని. అతడక్కడ లేడని నిర్ధారణ చేసుకుని మెల్లగా అంది.

"నేను హీరోయిన్‌గా వున్నప్పుడు, కృష్ణ అనే దర్శకుడితో సాన్నిహిత్యం ఏర్పడింది. తర్వాత నేను వెండితెర మీది నుంచి విరమించుకున్నా, అతడు నా స్నేహాన్ని మరువలేదు. అప్పుడప్పుడు నాకోసం వచ్చేవాడు. ఇద్దరం "నవయుగ" హోటల్‌కి వెళ్ళి, ఒకటి రెండురోజులు గడిపి తర్వాత విడిపోయేవాళ్ళం! మా ఈ రహస్య కలయికను ఎలా పసిగట్టాడో పసిగట్టాడు అర్జునరావు. పెద్ద మొత్తంలో పత్రికకు డొనేషన్ ఇస్తావా, లేక మీ రహస్య ప్రయాణాన్ని బయటపెట్టనా అని బెదిరించాడు.

'చిల్లి గవ్వ ఇవ్వను, నీకు చేతనైంది చేసుకో' అని వాడ్ని తరిమేశాను. ఆ తర్వాత రెండురోజులకు నేను నాగ రాజుని వివాహమాడటం తటస్థించింది."

"మీ అమూల్య సమాచారానికి నా ధన్యవాదాలు. ఇప్పటికే మీకు చాలాశ్రమ ఇచ్చాననుకుంటాను.వస్తాను!" అంటూ నారాయణరావు కుర్చీలోంచి లేచాడు.

# 11

స్కూటర్ మీద స్పీడుగా పోతున్నాడు నారాయణ రావు.

దోవలో పోలీస్ స్టేషన్ తగిలినా, అక్కడ ఆగలేదు, అతడు!ఇన్ స్పెక్టర్ రాజు,నారాయణరావు అంత వేగంగా ఎక్కడికి వెడుతున్నాడా అని ఒక్క క్షణం ఆశ్చర్య పోయాడు.

స్కూటర్ మలుపు తిరిగింది.అప్పుడే రాజామణికారులో ఎక్కడికో వెళ్తూంది.

నాగరాజుతో తను ఏకాంతంగా మాట్లాడేందుకు ఇది మరీ అనువైన సమయం అనుకుంటూ లోపలకు నడిచాడు నారాయణరావు.

బెల్ పుష్ నొక్కాడు.తలుపు తెరుచుకుంది. ద్వారంలో నాగరాజు నిలబడి వున్నాడు.నారాయణరావుని చూస్తూనే అతడి కోపం మిన్నుముట్టింది. మరో మాటా పలుకూ లేకుండా తలుపు వేయబోయాడు.

నారాయణరావు తలుపుల్ని బలంగా నెట్టాడు. ఆ ఊపుకి నాగరాజు వెనక్కు తూలి పడబోయాడు. ఎలాగో నిలదొక్కుకున్నాడు.

"ఏమిటీ దౌర్జన్యం నా ఇంట్లోనే నామీద! మర్యాదగా బయటకు పోతావా? లేక పోలీసుల్ని పిలవమంటావా?"

"పోలీసుల్ని పిలుస్తావేం? పిలు! నా పని ఇంకా తేలికే అవుతుందిగూడా!" అన్నాడు నారాయణరావు లోపలికి అడుగేస్తూ.

"ఎందుకు నన్నిలా వెంటాడి వేధిస్తావ్! ఈ హత్య విషయంలో చంద్రశేఖరం ఇస్తానన్న దానికి రెట్టింపు నే నిస్తాను. నా జోలికి రాకుండా వెళ్ళిపో! నీకు దణ్ణం పెడతాను." నాగరాజు రాజీబేరానికి దిగాడు.

"ఓహో! అంతదాకా వచ్చిందా? అయితే రెండు వేలు ఇయ్యి! పోతాను." నారాయణరావు మెత్తబడ్డట్టుగా నటించాడు.

నాగరాజు ఒక్క అంగలో లోపలికి వెళ్ళాడు. చెక్ బుక్ తెచ్చి రెండువేలకు చెక్కురాసి నారాయణరావు చేతిలో పెట్టాడు.

"మంచివాడ్ని వెయ్యిరూపాలిచ్చి కొనుక్కోమన్నారు చెడ్డవాడ్ని రెట్టింపయినా ఇచ్చి వదిలించుకోమన్నారు పెద్దలు!"

ఇద్దరూ ఒకరి ముఖంలోకి మరొకరు చూస్తూండి పోయారు, గోదాలో కుస్తీపట్టబోయే ప్రత్యర్థుల్లాగ.

"ఇక వెళ్ళు!" అసహనంగా అన్నాడు నాగరాజు.

"ఒక్కమాట! ఈ హత్యను ఎందుకు చేశావో చెప్తేగానీ వెళ్ళను. దీన్ని మరెవరికీ చెప్పను. హత్య జరిగిన తీరుని కనుక్కోగలిగానన్న ఆత్మసంతృప్తికోసం మాత్రమే అడుగుతున్నాను."

నాగరాజు కళ్ళలో ద్వేషం కనుపించింది. అతడిచేయి జేబులోకి వెళ్ళింది. రివాల్వర్‌ని బయటకు తీసి, నారాయణ రావుకి గురిపెట్టాడు.

"నాకు తెలుసు! నీవు మంచిగా వెళ్ళవని!"

"పోనీ నీ నోటిగుండా వెల్లడించటానికి ఇష్టంలేకపోతే నేనే చెబుతాను. అవునో, కాదో నీవు సరిచెయ్యి." అన్నాడు నారాయణరావు చలించకుండా.

"నీకు రాణి అనే స్నేహితురాలుండేది. నీవూ ఆమె కలిసి పేరులోవున్న హీరోయిన్లను విచిత్ర శృంగారం లోకి దించేవాళ్ళు. ఆ సమాచారాన్ని 'తెరవెనుక న్యూస్' పత్రికకు అమ్మి డబ్బుచేసుకునేవాళ్ళు. రాజామణిగూడ తన పాతప్రియుడైన దర్శకుడు కృష్ణని కలుసుకోవడం కోసం నవయుగ హోటల్ కి వస్తూండేది. ఆ సమాచారాన్ని నీవు సేకరించి 'తెరవెనుక న్యూస్'కి లిఖిత పూర్వకంగా అఫిడవిట్ పై నీవు సంతకం చేసియిచ్చావు. అందుకు ముట్టిన ప్రతిఫలంతో నీ రోజులు గడుపుతున్నావ్.

అంతలో నూతన పరిణామాలు సంభవించాయి. కారు ఏక్సిడెంట్ లో కృష్ణ మరణించాడు. రాజామణి గర్భవతి అయింది. అందుకే ఆమె నిన్ను చేరదీసి వివాహమాడింది. తెరవెనుక న్యూస్ లో ఆమె గురించిన ప్రణయగాథ ప్రచురించబోతున్నాడని తెలిసేసరికి నీ గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్టయింది. ఈ విషయం రాజామణి తెలుసుకోకుండా వుండాలని ఆమెకు మత్తుమందిచ్చి అస్వస్థురాల్నిగా చేశావ్!

"ఆ ప్రచురణను చూస్తే రాజామణి తప్పకుండా ఆ ఎడిటర్ పై పరువునష్టం దావా తెస్తుంది. అర్జునరావు సమాధానం క్రింద నీవు లిఖితపూర్వకంగా, నీ సంతకంతో ఇచ్చిన అఫిడవిట్ ని కోర్టులో దాఖలుచేసి తీరతాడు. తన పరువుని రచ్చకీడ్చింది నీవే అని తెలిస్తే రాజామణి నిన్నేం చేస్తుందో నీకు తెలుసు. ఆమె డబ్బుతో విలాసాల్లో మునిగి తేలుతున్న నీవు, తిరిగి

బజార్లలో ముష్టెత్తుకోవాల్సి వస్తుందో, లేక జైల్లో యావజ్జీవితం సాంబారు కూడే తినాల్సి వస్తుందోనని భయపడ్డావు.

"అందుకే నీవు బాగా ఆలోచించి, అర్జునరావుని హత్యచేశావ్! నీ భార్య పాత ప్రణయాలు ప్రెస్‌లోకి రాకుండా జాగ్రత్తపడ్డావ్! కానీ రాణిని ఎందుకు హత్య చేశావో అర్థం కాలేదు నాకు!" నారాయణరావు నిదానంగా తనకు తెలిసిన, ఊహించిన కథనంతా వెల్లడించాడు.

## 12

నాగరాజు భయంగా నోరెళ్ళబెట్టి వింటున్నాడు. అతడి పెదవులు వణకుతున్నయ్. రివాల్వర్ పట్టుకున్న చేయిగూడ వణకుతోంది.

"ఎక్కడ అల్లుకొచ్చావ్ ఈ కథనంతా!" చివరకు నోరు పెగల్చుకుని అడిగాడు నాగరాజు. "కానీ ఇదంతా నీవు ఛస్తే ఋజువు చేయలేవు!"

"ఇదే రివాల్వర్‌తో గదూ అర్జునరావుని కాల్చింది?"

"అదే రివాల్వర్‌తో నిన్నూ ఈ పాటికి కాల్చినందుకు సంతోషించు."

"రాణిని ఎందుకు చంపిందీ ఆ ఒక్కటీ చెప్పు?"

"అదీ నేనే చేశాననే నీ అనుమానమా?"

"అనుమానమేం లేదు. నిస్సందేహంగా నీవే చేశావని నా అభిప్రాయం!" ఈ మాటతో నాగరాజు చేతిలోని రివాల్వర్ పేలుతుందనే భయపడ్డాడు నారాయణరావు. కానీ అందుకు భిన్నంగా జరిగింది.

తన ప్రతాపాన్ని పొగుడ్తూన్నట్టుగా తోచింది నాగరాజుకు. అతడి కళ్ళు గర్వంగా మెరిసినయ్.

"ఆమెను చంపటం నా ఉద్దేశ్యం కానే కాదు! ఆమె దగ్గర రాజామణికి సంబంధించిన కాగితాలుగానీ, నేను వ్రాసిచ్చిన అఫిడవిట్ గానీ, ఉంటే తెమ్మని పంపాను. కానీ ఆ గూండాలు అనవసరంగా ఆమె ప్రాణాల్ని తోడేశారు."

"ఆ కాగితాలు ఆమె గదిలో ఉన్నట్టు నీకెలా తెలుసు?"

"అర్జునరావ్ ని చంపాక, నీవు రావటం చూసి, నేను లోపలే దాక్కున్నాను. నీవు అల్మరాల్లోంచి కవర్లు తీసుకు పోవటం చూశాను. వాటిలో రాజామణి సమాచారం కూడ ఉండచ్చని భ్రమపడ్డాను. దాన్నెలాగైనా సంగ్రహించాలని నీకు తెలియకుండా వెంబడించాను.

నీవు చేతిలో సంచీతో రాణిగదిలో కెళ్ళటం చూశాను. తిరిగి ఒట్టిచేతులతో బయటకు తిరిగివచ్చావ్! కనుక వాటిని రాణి గదిలో దాచావని గ్రహించాను."

"ఆ ఇద్దరు గూండాలు రాణిని చంపారు! నన్ను చితక బాదారు. వాళ్ళను నీవే పంపావన్నమాట!"

"అవును! నా గురించిగానీ, నా భార్య రాజామణి గురించిగానీ 'తెరవెనుక న్యూస్' ఆఫీసులోగానీ, నీ దగ్గర గానీ మరే సమాచారం లేదు. ఇక నన్ను బ్రహ్మదేవుడు కూడ పట్టలేడు." నాగరాజు సంతోషంతో నవ్వాడు. అతడి కళ్ళవెంట నీళ్ళు వచ్చేదాకా నవ్వాడు.

"నీ సమాచారానికి చాలా కృతజ్ఞుడ్ని నాగరాజూ! మనిద్దరి సంభాషణా శుభ్రంగా టేప్ రికార్డ్ చేయబడింది, నా జేబులోని మినీ టేప్ రికార్డర్ ద్వారా!" నారాయణ రావు చిరునవ్వుతో అతడి ముఖంలోకి చూశాడు.

ప్రక్కలో బాంబు పడ్డట్టుగా అదిరిపడ్డాడు నాగరాజు.

"అయితే నీవు ప్రాణాలతో ఇక్కడ్నుంచి బయటకు పోలేవు!" నాగరాజు పిచ్చిగా అరిచాడు, చేతిలోని రివాల్వర్‌ని లెవెల్ చేస్తూ.

నారాయణరావు ఊహించనంత వేగంగా యెగిరి తన్నాడు నాగరాజును. ఆ మిలట్రీ దెబ్బకు నేలకు కరుచుకున్నాడు నాగరాజు. రివాల్వర్ ఎగిరి దూరంగా పడింది.

బిలబిలమంటూ పోలీసులు లోపలకు జొరబడ్డారు.

"సమయానికి వచ్చారు ఇన్‌స్పెక్టర్! ఐనా నేనిక్కడున్నట్టుగా ఎలా కనుక్కోగలిగారు?" నారాయణరావు ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు.

"మా స్టేషన్ ముందునుంచే నీవు స్పీడ్‌గా పోతున్నావ్! నిన్ను అంత వేగంగా రప్పించే న్యూస్ ఏమిటో తెలుసుకోవాలన్న కుతూహలంకొద్దీ నిన్ను వెంబడించాం. కిటికీదగ్గర పొంచివుండి మీ సంభాషణ అంతా విన్నాం! మొత్తానికి హంతకుడ్ని వెదికి పట్టుకుని, నీ మొదటి కేసుని విజయవంతం చేసుకున్నావ్ మిస్టర్ నారాయణరావ్!"

"థాంక్స్ ఇన్స్పెక్టర్!" అంటూ జేబులోని టేప్ రికార్డర్ తీసి ఇన్‌స్పెక్టర్‌కు అందించాడు.

ముందుకు జాపిన నాగరాజు చేతులకు బేడీలు పడినయ్.

"నీ నాటకం చరమాంకానికి వచ్చింది మిస్టర్ నాగరాజూ! ఇక తెరదింపటమే మా వంతు!" అంటూ నాగరాజుని వ్యాన్‌లో ఎక్కించాడు ఇన్‌స్పెక్టర్ రాజు.

—:ఐపోయింది:—

# తిరిగిరాని ఖైదీలు

## సంపత్

దూరంగా ఏదో ట్రక్ వస్తున్న చప్పుడు విన్పించి, చిన్నగా ఉలిక్కిపడ్డాను.

ఇక్కణ్నుంచి సుమారు ఫర్లాంగుదూరంలో ఉంటుంది కొండ. నిట్ట నిలువుగా, ఎక్కటానికి వీలులేకుండా స్టీప్ గా ఉంటుంది. దాని పక్కనే పడమరగా ఉంది చిన్న తారు రోడ్. రోడ్డుకి అవతల ఆయిదారు గజాల తరువాత లోయ.

ఆ లోయ అంతా దట్టమైన చెట్లు చేమలతో నిండి, భయంకరంగా ఉంటుంది. ప్రస్తుతం నేను ఆ లోయలోనే ఉన్నాను.

లోయ అంతా నిశ్శబ్దంగా వుండి, భయం గొలుపు

తూంది. పక్షుల కేకలు, శబ్దాలు తప్ప మరో శబ్దం లేదు. ఆ లోయలో భయంకరమైన క్రూర జంతువులు మాత్రం లేవని తెలుసు.

లేచి దట్టమైన చెట్లగుండా నడక ప్రారంభించాను. ఎండుటాకులు నా బూటుకాలు క్రిందపడి పెళపెళ విరిగిపోతూ శబ్దం చేస్తున్నాయి. నా చేతికి ఉన్న వాచీ మధ్యాహ్నం రెండు గంటలు చూపుతోంది.

లోయ అంచు వద్దకు వచ్చాను. మా ఉనికి తెలియకుండా, మా రాకపోకలకు అనుగుణంగా లోయ అంచువద్ద మేము ఎనుకున్న మార్గం ఒకటి ఉంది. అది అంత సులభంగా ఇతరుల కళ్ళబడదు.

ట్రక్ శబ్దం మరింత దగ్గరయింది.

ఈ సమయంలో ఎక్కణ్నుంచి వస్తోంది? ఎవరెవరున్నారు? ఎక్కడికి వెళ్ళుతున్నారు? ఈ ఆలోచనలతోనే ట్రక్ శబ్దం వస్తున్నవైపుకి నడిచాను.

అప్పుడే కొండదగ్గర అంచుదగ్గర మలుపు తిరిగింది ట్రక్. లోపల కేరింతలు, కోలాహలం విన్పిస్తోంది. ట్రక్ను చూడగానే చటుక్కున ప్రక్కనే ఉన్న చెట్టుచాటుకి నక్కాను.

చాలా పాతకాలంనాటి ట్రక్ అది. ట్రక్ అంతా లూజు లూజుగా ఉండి ఏ క్షణంలో కూలబడిపోతుందో నన్నంతగా ఉంది చూపులకి. కాని దాని రన్నింగ్ మాస్తూంటే యింజన్ మాత్రం క్రొత్తదిలా ఉంది.

ట్రక్ ఫ్రంట్ సీట్లో ముగ్గురు వ్యక్తులున్నారు. ఒకడు డ్రైవ్ చేస్తున్నాడు. మిగిలిన యిద్దరూ అటూ ఇటూ

చూస్తు పరిసరాలను పరిశీలిస్తున్నారు. వారి వాలకం గమనించి మరింతగా నక్కాను నేను. ట్రక్ లోపల చాలా మంది ఉండి ఉండాలి. కోలాహలంగా ఉంది.

"క్రైనా" దేశానికి సంబంధించిన ట్రక్ అది. అందులోని సైనికులు కూడా 'క్రైనా' దేశస్థులే. చిన్నగా నవ్వుకున్నాను నేను. ఈ క్షణంలో ఎంతో ఆనందంగా ఉన్నారు. మరుక్షణంలో ఏమవుతుంతో వారికి తెలియదు.

ట్రక్ నన్ను దాటింది. నన్ను చూడలేదు ఎవరూ.

కొండనుదాటి ముందుకు పోయింది. నేను జాగ్రత్తగా గమనిస్తున్నాను. మరికొంత దూరం పోయింది.

అంతే!...

భయంకరమైన పెద్ద విస్ఫోటం. ట్రక్ తుత్తినియలయి పోయింది. ట్రక్ పార్టులతోబాటు, సైనికుల శవాల ఖండాలుకూడా మండుతూ గాలిలోకి ఎగిరాయి. భయంకరమయిన మంటల్లో మండుతూ నిలబడిపోయింది ట్రక్.

గాలి బాగా వీస్తూండటంవల్ల మంటల శబ్దాలు విన్పిస్తున్నాయి బాగా. తృప్తిగా నవ్వుకొని, దిగి లోయవేపు నడక సాగించాను.

# 2

బాంగ్లాదేశ్ యుద్ధం జరుగుతున్న సమయం. ఒకవైపు బంగ్లాదేశ్ శరణార్థుల రక్షణ, మరోవైపు పాకిస్తాన్‌తో యుద్ధం. భారతదేశం అత్యంత జాగరూకతతో ఉంది. శత్రువులు, దేశంలోని అరాచకశక్తులు కల్సిపోయి, దేశనాశనానికి దారితీసే సమయం యిదే. అందుకనే భారతదేశం దేశంలోని ఆంతరంగిక శత్రువుల్ని ఏరివేస్తూనే,మరోవైపు సరిహద్దువద్ద సైనికుల్ని 'అలెర్ట్' చేసింది.

అస్సాం సరిహద్దుల్లో ఉన్న మేము, 'కైనా' సైనికులు కవ్వింపుల్ని చాలారోజులు సహించి, చివరకు సహించలేక ముందుకు దూసుకుపోయాము. మా విజృంభణచూసి 'కైనా' సైనికులు వెనుకంజవేశారు.

నేను, మరో వ్యక్తి హరిపాల్ ఆ లోయలో ఉన్న సామానులకు రక్షణగా నియమించబడ్డాము. మా వాళ్లతో వెళ్ళి శత్రువుల్ని చీల్చి, చెండాడాలని ఉన్నా, మేజర్ ఆజ్ఞమీద అక్కడే ఉండిపోయాము.

సైనికులమీద దాడి జరిపి విజయ పరంపరతో తిరిగి వస్తూన్న మా వాళ్ళమీద; హఠాత్తుగా 'కైనా' సైనికులు గెరిల్లా యుద్ధం జరిపి చంపేశారు.అందరూ చనిపోయారు. నేను, హరిపాల్ మాత్రం ఇక్కడ మిగిలిపోయాము.

మొదట విచారించినా, తరువాత తెల్సిన విషయం విని మామీద మెరుపుదాడి జరిపిన కైనా సైనికులమీద ప్రతీకారం తీర్చుకోవటానికి భలే అవకాశం దొరికినందుకు సంతోషించాము.

సరిహద్దుల్లో ఉన్న 'కైనా' సైనికులకు కష్టాలు ప్రారంభమయ్యాయి. ఆహార పదార్థాలు తెస్తున్న వాళ్లు, అకస్మాత్తుగా మాయమవటం, ఉన్నట్లుండి భగ్గున మండి పోవటం, లోయల్లోకి దొర్లిపోవటం సాగించాయి.'కైనా' సైనికులు క్షుణ్ణంగా, ప్రతి అంగుళాన్ని గాలించినా, మేము దొరకలేదు.

హరిపాల్ చాలా తెలివయినవాడు. మా క్వార్టర్స్‌కి తిరిగి వెళ్ళకుండా ఇక్కడే శత్రువులతో "సరసాలు" ప్రారంభించటం అతని అయిడియానే.

దానికీ కారణం లేకపోలేదు. ఇద్దరం బ్రహ్మచారులం.

నా అన్నవాళ్ళు నాకూ, అతనికీ లేరు. కావల్సినంత ఆహార పదార్థాలు, అమ్యూనిషన్ సమృద్ధిగా వున్నాయి. శత్రు వుల్ని ముప్పుతిప్పల్ని పెట్టటానికి నిర్ణయించుకున్నాము.

మేము ఆడుతున్న "జూదం" చాలా ప్రమాదకరమైన దని తెల్సు. మా నీడ దొరికినా మమ్మల్ని కాల్చివేస్తారు శత్రువులు. అందుకే కొంతకాలంపాటు మా చర్యల్ని నిలిపేశాము. వారం రోజులపాటు కైనా సైనికులు ఊపిరి పీల్చుకున్నారు.

తిరిగి మా చర్యల్ని ప్రారంభించటానికి నాందిగా ఈ రోజు రోడ్ మీద గుంటలుతీసి బాంబులు పూడ్చాము జాగ్రత్తగా. వాటికేమాత్రం వత్తిడి తగిలినా పేలుతాయి.

అడవిలోనికి ఏదో పనిమీద వెళ్ళాడు హరిపాల్. ఆ సమయంలోనే నేను ట్రక్ శబ్దం వినటం, దాన్ని స్మాష్ చేయడం జరిగింది.

# 3

నేను లోయలోనికి తిరిగి వచ్చేసరికి హరిపాల్ ఆదుర్దాగా ఎదురుచూస్తూ కన్పించాడు.

అయిదున్నర అడుగుల మనిషతను. లావుగా, దృఢంగా వుంటాడు. బుర్రమీసాలు. కొద్దిగా పొట్ట వుంది. నిద్ర లేకపోవటంచేత కళ్ళు ఎర్రగా వున్నాయి.

నన్ను చూడగానే చిన్నగా నిట్టూర్పు వదిలి ఏం జరిగిందని ప్రశ్నించాడు. జరిగిన విషయం చెప్పాను. అంతా విని అన్నాడు హరిపాల్.

"ఇంతకాలం మనం దాగుడుమూతలు ఆపేశాము. తిరిగి ప్రారంభించటంతో మన స్థావరం యిదేనని ఖచ్చితంగా భావిస్తారు. అంచేత ఇక్కణ్నుంచి తక్షణం ఖాళీ చేయాలి."

వెంటనే ఆ పనిమీద నిమగ్నులయ్యాము.

ఆ లోయలో అసలు ఎవరయినా వున్నట్లు ఆనమాలు కూడా లేకుండా ఖాళీఅయిన ఫుడ్ టిన్స్ మొదలయిన వాటిని లోయలోనే ప్రవహిస్తున్న నీటి వాగులోకి విసి రేశాము.

హరిపాల్ అక్కణ్ణుంచి ఎక్కడికి మకాం మార్చాలో ఆలోచిస్తున్నాడు. అవసరమైన సామాన్లుంచి, మిగిలినవి అన్నీ వాగులోకి విసిరేశాము.

మరో పావుగంట తర్వాత నీటిప్రవాహం వెంబడే నడక సాగించాము. సామానులున్న కిట్స్ మా భుజాల నుంచి వేలాడుతున్నాయి.

హరిపాల్ పరిసరాలు జాగ్రత్తగా గమనిస్తూ నడుస్తున్నాడు.

కొంతదూరం నడిచి నెమ్మదిగా వాగులోకి దిగాము. అక్కడ వాగు లోతు తక్కువ. అక్కడ దాటి అవతలి వైపుకు చేరుకున్నాము.

వాగు దాటి అవతలికి చేరుకొని, చెట్లచాటున కూల బడ్డాం.

"ఇలా ఎంతకాలం?" అన్నాను నేను.

"ఏం? భయంగా వుందా?" నవ్వుతూ అడిగాడు హరిపాల్.

"భయం కాదు. మనం చనిపోయామని మనవాళ్ళు భావిస్తుంటారు. నిజానికి మనంకూడా చచ్చినవాళ్ళ లాగానే బ్రతుకుతున్నాము. కాని నాకిది యిష్టంలేదు. కొడితే ఏనుగు కుంభస్థలాన్నే కొట్టాలి. ఇలా వీళ్ళని మనం దొంగచాటుగా దెబ్బతీసి అంతమొందించే

కంటే, ఒక్కసారే వాళ్ళ స్థావరాన్ని ధ్వంసంచేసి పారేస్తే మనకు హాయిగా వుంటుంది."

నా మాటలు హరిపాల్‌లో ఆలోచనలు రేకెత్తించాయని అతని ముఖం చూస్తుంటేనే తెలుస్తోంది. అయిదు నిమిషా లనంతరం నావైపు తిరిగి ఏదో చెప్పబోయాడు.

అదే సమయంలో హెలికాప్టర్ శబ్దం విన్పించటంతో ఉలిక్కిపడ్డాము.

# 4

చీకట్లు కమ్ముకుంటున్నాయి. హోరున గాలి వీస్తూంది. మాకు చాలా దగ్గరలో ఎగురుతూంది హెలికాప్టర్. మే మిద్దరం దట్టమైన చెట్లచాటున, పొదలమాటున వుండటం వల్ల హెలికాప్టర్‌లో నున్నవారికి కన్పించే అవకాశం లేదు. దానికితోడు చీకటి కమ్ముకుంటూంది. మేము ధరించి వున్న బూడిదరంగు, లేతాకు పచ్చరంగు దుస్తులుకూడా మేము దాగటానికి తోడ్పడుతున్నాయి.

ఊపిరి బిగించి హెలికాప్టర్ వంక చూస్తూ కూర్చు న్నాము. లోయ అంతా నాలుగైదు మార్లు చుట్టింది. చుట్టుప్రక్కల ప్రదేశాలను కూడా చుట్టి మరో గంట తరవాత వెళ్ళిపోయింది, కాలుతున్న ట్రక్‌ను పరిశీలించి.

"ఇంకా ఈ లోయలో వుంటే పట్టుబడటమో, మర ణించటమో ఖాయం" అన్నాడు హరిపాల్, హెలికాప్టర్ వెళ్ళిన దిశవైపు చూస్తూ.

"ఎందువల్ల?"

"మనం దాగటానికి ఈ లోయకంటే మంచి ప్రదేశం మరొకటి లేదని ఊహిస్తారు. అదీగాక మన చర్యలన్నీ ఈ ప్రాంతాల్లోనే నిర్వర్తించాము. అందువల్ల మనం

యిక్కడే వున్నామని సులభంగా గ్రహిస్తారు. ప్రస్తుతం వెంటనే ఈ లోయని విడిచి వెళ్ళిపోవాలి.''

''అయితే ఎక్కడికి వెళదాం?'' అన్నాను నేను.

హరిపాల్ మాట్లాడలేదు. పూర్తిగా చీకట్లు కమ్ముకున్నాయి. మా చేతుల్లో ఉన్న టార్చిలైట్లలో బ్యాటరీలు అయిపోవచ్చాయి కాబోలు, డిమ్‌గా వెలుగుతున్నాయి.

ఈ అడవిలో క్రూరమృగాలు లేకపోయినా, అంతకంటె క్రూరమైన చైనా సైనికులు వున్నారు. మేము జాగ్రత్తగా సంచరించాలి. అడుగడుగునా వలలుపన్ని వున్నారు చైనా సైనికులు. ఏ క్షణంలో ఏమి జరుగుతుందో, ఏ క్షణంలో ప్రాణాలు పోతాయో తెలియదు.

మరోగంట ప్రయాణానంతరం లోయనుదాటి ఈవలకు వచ్చాము. లోయని అధిరోహించి పైకివచ్చాము.

పైభాగం అంతా కొండరాయి. గడ్డి మొలిచి నున్నగా వుంది. కొంతదూరంలో ఎత్తయిన గుట్ట ఒకటి కన్పిస్తూంది. ఇక్కడ నిలబడి చూస్తుంటే, లోయ ఆవలివైపున మండుతూన్న ట్రక్ కన్పిస్తూంది. మంటలు ఆరిపోవచ్చాయి.

ఆకాశంలో చంద్రుడు ఉదయించాడు. కొద్దిగా వెన్నెల పడుతోంది. పైనున్న మాకు రివ్వున కొండగాలి కొట్టసాగింది. మా చేతుల్లోని బ్యాటరీలైట్లు ఆర్పేశాము. కిట్‌లోనుంచి ఓవర్ కోట్స్ తీసి తొడుక్కున్నాము.

హరిపాల్ గుట్టవంక చూస్తున్నాడు.

ఈ ప్రాంతాలన్నీ హరిపాల్ తిరిగాడు. అన్నీ కొట్టిన పిండి.

''ఈ దాపుల్లో ఊరేమి లేదు. కనీసం అయిదారు మైళ్ళన్నా నడవాలి!'' అన్నాడు హరిపాల్.

"ఉంటే మాత్రమేం? మనకేమి లాభం?"

"ఉంది. మనం ఈ లోయల్లోనే ఎక్కడో ఉన్నామని కైనా సైనికుల విశ్వాసం. మనం ఏదో ఒక గ్రామంలో ప్రవేశించి అక్కడ మకాం పెట్టగలిగితే చాలు. మనం వారి గ్రామంలోనే వుంటున్నామని ఎవరూ భావించరు. ఈ లోపున మన పని పూర్తవుతుంది."

కాని నాకు అతని ఉద్దేశం నచ్చలేదు. "గ్రామాల్లోని ప్రజలు కొత్తవారిని యిట్టే పసికడతారు" అన్నాను.

చిన్నగా నవ్వాడు హరిపాల్. "మనం గ్రామంలో ప్రవేశిస్తామే గాని, ప్రజల కంట పడం!" అన్నాడు.

"అదెలా?" ఆశ్చర్యపోతూ అడిగాను.

"అదంతా తర్వాత. ముందు యిక్కణ్ణుంచి పద!"

ఇద్దరం బయలుదేరి, నాలుగయిదు అడుగులు వేశామో, లేదో విమానాల ధ్వని విన్పించి, ఆగిపోయాము. గుట్ట దగ్గరకు పరుగెత్తి బోర్లాగా పడుకుని తలలు తిప్పి చూశాము.

నాలుగయిదు బాంబర్స్ వచ్చి లోయలో బాంబులు వేయటం ప్రారంభించాయి. ధగద్ధగాయమాన వెలుగుతో మండుతూంది లోయ. మేము అక్కడ అనవసరం అని ఉంచిన మందుగుండు సామగ్రి అంటుకొని, లోయ అంతా చప్పుళ్ళతో ప్రతిధ్వనించింది. లోయలోని చెట్లు అంటుకున్నాయి. మంటలలో మాడి మసయిపోతున్నాయి.

మందుగుండు పేలటం గమనించిన విమానం పైలెట్లు ఇంకా ఉత్సాహంతో ఆ ప్రదేశంలోనే బాంబులు విసర సాగారు.

"వెంటనే వెళ్ళాలి! క్విక్!" అరిచాడు హరిపాల్.

ఇద్దరం గుట్టవెనకగా కాలి శక్తికొద్దీ పరుగెత్త సాగాము.

ఆ గుడ్డి వెన్నెల్లో, గుడ్డిగా హారిపాల్ వెనక పరుగెత్తు తున్నాను.

మా వెనకే విమానం చప్పుడు రావటంతో, చప్పున బోర్లా పడిపోయాము. కొండచరియవరకు వచ్చి తిరిగి వెళ్ళిపోయింది విమానం. తిరిగి బయలుదేరి, పరుగెత్త సాగాము.

దాదాపు పావుగంట అనంతరం కొండచరియ అంతమై మరో లోయ ప్రత్యక్షమయింది. లోయ లోపలికి చూసి, నాతోపాటు, హారిపాల్ కూడా నిర్విణ్ణుడయాడు.

లోయ లోపల కాగడాల కాంతి కన్పిస్తోంది. లీలగా గుడారాలు కన్పిస్తున్నాయి. "వీళ్లెవరు? ఇంతకుముందు లేరే?" తనలో తాను అనుకుంటున్నట్లు అన్నాడు హారిపాల్. నాకేమీ అర్థం కాలేదు.

దాదాపు అయిదాగొందల అడుగుల లోతుగల లోయ అది. మేమున్న చోటినుంచి ఏటవాలుగా ఉంది కొండ. మా వెనక బాంబులు పడి, భూమి బద్దలవుతూన్నా యీ గుడారాలలో కదలిక లేదంటే ఏమనుకోవాలి?

నిస్సందేహంగా వీరూ కైనా సైనికులే! మమ్మల్ని మట్టుపెట్టటాని కిదో మార్గం. నాలుగువైపులా కమ్ము కొచ్చి, లోయులో ధ్వంసం కాకపోతే నాశనం చేయటాని కిదొక ఎత్తు అయివుండవచ్చు.

ముందు నుయ్యి, వెనక గొయ్యి అన్నట్లయింది మా పరిస్థితి. లోయ అంచులోకి జారి, పొదలమాటున వేలాడ సాగాము. అయిదునిమిషా లనంతరం ఫ్లడ్ లైట్లున్న విమానం ఒకటి ఆ ప్రదేశం అంతా సర్వే చేసి వెళ్ళి

పోయింది. ఇక్కడ బాంబులు వేయరన్న నమ్మకం దృఢ మయింది నాకు.

ఎందుకంటే ఈ లోయలోనివాళ్ళు, వాళ్ళ దేశ సైనికులే కనక!

అదృష్టవశాత్తు ఫ్లడ్ లైటు మామీద పడకుండా తప్పించుకో గలిగాము.

దాదాపు అరగంట తర్వాత అంతా సద్దు మణిగింది. వెనక లోయలో చెట్లు కాలుతున్న చిటపటలు, ఇంకా విన్పిస్తూనే వున్నాయి మాకు.

అలానే లోయలోకి వేలాడుతూ, నిశ్శబ్దంగా ఉండి పోయాము.

# 5

మరో పావుగంట అనంతరం యిద్దరం అతి కష్టంమీద పైకి చేరుకున్నాము తిరిగి. మేమిద్దరమే అయితే యింత బాధ ఉండదు. మాతోపాటు మా సామానులున్న కిట్స్ కూడా ఉండి, మా వీపున వేలాడుతూంటే, ఏ క్షణాన పట్టు తప్పి లోయలోనికి జారిపోతామేమో అన్పించిన మాట వాస్తవమే!

క్రింద గుడారాలలో సంచలనం ప్రారంభం అయింది. నాలుగయిదు బ్యాటరీలైట్లు వెలిగాయి. తరువాత కొంత సేపటికి దాదాపు పదిమంది వ్యక్తులు బయటకు వచ్చినట్లు కన్పించింది.

"బహుశా ఇదంతా పరిశోధించిగాని వదలరు. మనం వెంటనే వెళ్ళిపోవాలి" నెమ్మదిగా అన్నాడు హారిపాల్.

"బాంబులు వేసి, అంతా నాశనంచేసినా, యింకా అనుమానం పోలేదా వీళ్ళకు?"

"ముందు అనుమానం, తర్వాత వీళ్ళు పుట్టినట్లున్నారు. లేదా, అతి జాగ్రత్త తీసుకుంటున్నారేమో?" నవ్వాడు హరిపాల్.

"అయితే యిప్పుడేమి చేద్దామంటావ్?"

"ప్రస్తుతం మన ప్లాన్ ప్రకారం దగ్గర్లో వున్న గ్రామం చేరుకోవాలంటే, ఈ లోయ దిగి అవతలివైపుకి వెళ్ళాలి. మరో దారి వుంది కాని, మనం విడిచివచ్చిన లోయలోనికి తిరిగి వెళ్ళాలి."

"అంటే ఈ లోయలోనుంచే వెళ్దామంటావా?" అడిగాను, హరిపాల్ ని.

"అవును. మనం ఈ లోయనే దాటి వెళ్ళాలి!" నిశ్చయంగా అన్నాడు హరిపాల్.

ఆ మాటల్లోని అర్థం నాకు తెలుసు. ఆ గుడారాల లోని వ్యక్తులు మరికొద్దిసేపటిలో ప్రాణాలు వదల బోతున్నారన్నమాట. కిట్ తడిమాను. బాంబులు తగి లాయి. హేండ్ గ్రనేడ్స్.

గుడారాలలోంచి బయటకువచ్చిన సైనికులు నలుగు రయిదుగురు ఒక జట్టుగా చీలిపోయి, జట్లు జట్లుగా బయలుదేరారు.

అందరి చేతుల్లోను మెషిన్ గన్స్, బ్యాటరీ లైట్లు ఉన్నాయి.

హరిపాల్ ఏం చేయాలో చకచక చెప్పాడు. ఇద్దరం శబ్దం కాకుండా లోయలోనికి దొర్లాము.

లోయలోనికి పోయే కొండరాయి ఏటవాలుగా వుంది. అక్కడక్కడ ముళ్ళపొదలు, తుప్పలు పెరిగి వున్నాయి. చాలావరకు గడ్డి మొలిచి ఎండిపోయి వుంది. ఇద్దరం శబ్దం కాకుండా జారుతున్నాము నెమ్మదిగా.

బోర్లా పడుకొని ఏదన్నా ఆధారం పట్టుకొని క్రిందకి జారటం, కాలికి ఏదన్నా ఆధారం తగలగానే ఆగిపోవటం చేస్తున్నాము. మొత్తంమీద శరీరం, మోకాళ్ళు, మోచేతులు గీరుకుపోతున్నాయి.

క్రిందనుంచి బయలుదేరిన సైనికుల జట్లు పైకి వస్తున్నాయి చుట్టూ లైట్లు వేసి చూసుకుంటూ. దాదాపు సగం లోయలోకి జారాము.

"రాజా!" చిన్నగా అరిచాడు హరిపాల్.

చటుక్కున ప్రక్కకి తప్పుకున్నాను. నేను ఉన్న చోట బ్యాటరీలైటు కాంతి వచ్చి పడింది. నా చేయి పట్టు తప్పింది. జర్రున జారాను.

మెషిన్‌గన్స్ ధన్‌ధన్‌ధన్ మంటున్నాయి.

కొండరాతి పెచ్చులు ఎగిరి పడుతున్నాయి. రివ్వున క్రిందకు దొర్లుతున్నాను. కళ్లు గట్టిగా మూసుకున్నాను. ముళ్ళపొదలు, తుప్పలు గీచుకొని రక్తం వస్తూంది. మంట పుడుతూంది.

ఏదన్నా ఆధారం పట్టుకొని ఆగితే, మెషిన్‌గన్ గుళ్ళకి శరీరంతూట్లు పడటం ఖాయం. ఆగకపోతే రివ్వున జారుతూ, లోయలోనికి దొర్లి 'కైనా' సైనికులముందు పడతాను. మొత్తంమీద నా చావు ఖాయం.

క్రిందనుంచి కాలుస్తున్న గన్ చప్పుడు ఆగిపోయింది. నేను క్రిందకు రావటం ఖాయం అని కైనా సైనికుల భావన. ఇప్పుడే ఏదన్నా 'మిరకిల్' జరగాలి. దాదాపు క్రిందకు వచ్చేశాను.

క్రింద ఏదో బాంబు పేలిన శబ్దమయింది.

నా చేతికి ఏదో ఆధారం దొరికింది. చటుక్కున పట్టుకొని ఆగిపోయాను.

మరో బాంబు పేలింది. అంతవరకు 'కైనా' సైనికు లున్నచోట చీకటిగా ఉంది. సైనికుల బూట్ల చప్పుడు. మెషిన్‌గన్‌ల ధ్వని.

చేతిని కిట్‌లోనికి పోనిచ్చి, గ్రెనెడ్ తీసి, ఫ్యూజ్ లాగి, శబ్దం వస్తున్న దిక్కుగా విసిరాను బలంకొద్ది.

పెద్ద శబ్దంతో పేలింది అది. హాహాకారాలు! ఆర్త నాదాలు!!

మరో బాంబు గూడారాలమీద పడి, పేలింది. గూడారాలు అంటుకున్నాయి. భగభగ మంటల్లో మండుతున్నాయి. మరో బాంబు పడి, మరికొంతమంది సైనికుల్ని మట్టుపెట్టింది.

నామీద దృష్టిని కేంద్రీకరించిన కైనా సైనికులు హరిపాల్‌ని గమనించి ఉండరు.

అరగంట పాటు రణరంగంగా మారిపోయింది ఆ లోయ అంతా.

మరో అరగంట తర్వాత ఆ లోయ దాటి, అవతలివైపు చేరాము నేను, హరిపాల్. దగ్గర్లోనున్న గ్రామం వైపుకు బయలుదేరాము. ఈ వార్త ఇంకా అందివుండదు 'కైనా' సైన్యాధికారులకు.

అయిదారు మైళ్ళు ఆ మసక వెన్నెల్లోనే నడిచాము. ఆ రోజు ఫలాలుగానీ, తిండిగాని తినకపోవటంవల్ల చాలా ఆకలిగా ఉంది.

దాదాపు పన్నెండున్నర గంటల ప్రాంతంలో గ్రామం పొలిమేరలు సమీపించాము. గ్రామంనిండా సైనికులే కన్పిస్తున్నారు పహరా తిరుగుతూ.

"మనం యిక్కడికి వస్తామని ఊహించి ఉంటారా?" అన్నాను నేను, పరీక్షగా సైనికుల్ని చూస్తూ.

"అయి ఉండదు. ప్రతిరోజు మాదిరే కాపలా కాస్తూ ఉంటారు" అన్నాడు హరిపాల్.

"మనం అక్కడికి వెళ్ళటం చాలా ప్రమాదం. చుట్టు ప్రక్కల మరో గ్రామం లేదా?"

"లేదు. నిజంగానే మనం యిక్కడికి రావటం అనవసరమేమో అనిపిస్తూంది. హెడ్ క్వార్టర్స్‌కి ఒక్కసారే చేరుకుంటే మంచిదేమోనన్పిస్తూంది."

"హెడ్ క్వార్టర్స్ ఎక్కడో నీకు తెలుసా?" ప్రశ్నించాను, మధ్యలో కల్పించుకుని.

"నాకూ సరిగ్గా తెలియదు. అయినా యిక్కడికి దగ్గరే అనుకుంటాను. మూడు నాలుగు మైళ్ళుంటుందేమో?"

"ఈ గ్రామం పేరేమిటి?"

"లీబాండ్ కాబోలు" అన్నాడు హరిపాల్.

"అయితే యిప్పుడేం చేద్దాం?" అగి, ప్రశ్నించాను.

హరిపాల్ మాట్లాడలేదు. గ్రామం వంకే చూస్తున్నాడు.

'లీబాండ్' గ్రామంలో మొత్తం వెయ్యి గడపలుంటాయేమో! గ్రామం మధ్యలోంచి విశాలమయిన రోడ్ వుంది. దానికి అటు యిటూనే వున్నాయి చాలావరకు యిళ్లు. గ్రామానికి ఎడమప్రక్కగా మురికి కాలవ ప్రవహిస్తోంది.

టైం చూసుకున్నాను. ఒకటింబావు అయ్యింది. చంద్రుడికి అడ్డంగా మేఘాలు రావటంవల్ల చీకటిగా ఉంది.

కొంచం సేపుండి హరిపాల్ ఏం చేయాలో చెప్పాడు. తల ఊపి గ్రామంవయిపు బయలుదేరాను.

మురికి కాలవ ఒడ్డమ్మటె నడుస్తున్నాం ఇద్దరం. ఇద్దరం అతి జాగ్రత్తగా అటూ, యిటూ చూస్తూ గ్రామంని సమీపించాము. అదృష్టవశాత్తు చీకటిగానే ఉంది ఇంకా. మమ్మల్ని ఎవరూ గమనించలేదు. ఇద్దరం గ్రామం చివర ఉన్న యింటిని చేరుకున్నాము. ఆ యింటి వెనక పెరడు ఉంది. పెరటి చుట్టూ తక్కువ ఎత్తులో ప్రహరీగోడ ఉంది.

ఇద్దరం చప్పుడు కాకుండా ఎక్కి దూకాము లోనికి. ఎవరూ కన్పించలేదు. చెవులు రిక్కించి విన్నాము. ఎటు వంటి శబ్దమూ లేదు. పెరడు అంతా మురికిగా ఉంది. శుభ్రంచేసి ఎన్నిరోజులయ్యిందో? మొక్కలన్నీ ఎండి పోయి ఉన్నాయి.

ఇద్దరం యింటిలోనికి నడిచాము. తలుపులు దగ్గరగా వేసి ఉన్నాయి కాబోలు, నెట్టగానే తెరుచుకున్నాయి. నెమ్మదిగా లోనికి ప్రవేశించాము.

ఇంట్లో ఎవరూ ఉన్నట్లు లేరు. వీధివైపు ద్వారం తలుపులు మూసి ఉన్నాయి. గడియపెట్టి రమ్మనట్లు సైగ చేశాడు హరిపాల్. నేను నెమ్మదిగా ముందుకు నడుస్తున్నాను.

ప్రక్కగది తలుపులు తెరుచుకొని ఎవరో రావటం, నలిగి, మట్టికొట్టుకుపోయిన మా అవతారాలు చూసి, భయపడి గుండెలవిసేలా కేక లెయ్యటం, మరుక్షణమే వీధి ద్వారంగుండా సైనికులు లోనికి ప్రవేశించటం కన్నుమూసి, తెరిచేంతలో జరిగిపోయాయి చకచక.

ఇంతకాలం తప్పించుకు తిరుగుతున్న మేము, కైనా సైనికులకు చిక్కిపోయాం. మా కళ్ళముందు మృత్యువు జయించినట్లు నవ్వుతోంది.

## 6

తరవాత చర్యలన్నీ మా ప్రమేయం లేకుండానే చక చక జరిగిపోయాయి.

మా వంక చూస్తున్న 'క్రైనా' సైనికుల కళ్ళకే గనక శక్తి ఉంటే మేము అక్కడే మాడిపోయి ఉండేవాళ్ళం. తమవారిని ఎంతోమందిని నాశనం చేసిన మామీద వారికి అంతులేని కసిగా ఉందని గ్రహించటం మాకు కష్టం గాదు. అసలు ఎంతో ప్రయత్నంమీద మామీద గుళ్ళు కురిపించకుండా నివారించుకోగల్గారని భావించినా తప్పు లేదు.

మమ్మల్ని పట్టుకున్న తర్వాత వారు చేసిన మొదటి పని 'లీబాండ్' గ్రామం అవతల చివరగా ఉన్న ఒక పెద్ద యింటిలోనికి తీసుకువెళ్ళటం. కొండరాతితో, విశాలంగా, చుట్టూ ప్రహారీతో పాతకాలపు కట్టడంలా ఉంది. లోపల సైనికులు గుమ్మం ముందు అటూ ఇటూ తిరుగుతున్నారు.

మాకు ఇంతవరకు ప్రాణాలు నిలవటమే ఆశ్చర్యంగా ఉంది. చిత్రహింసలు తప్పవని తెలుసు. అయినా ఈ పాటికి హారిపాల్ ఏదో ఉపాయం ఆలోచించే వుంటాడు.

తలతిప్పి హారిపాల్ వంక చూశాను. ముఖంలో ఏ భావం లేక నిర్వికారంగా, నిశ్చలంగా ఉన్నాడు హారిపాల్.

మా యిద్దరిని వెంటనే ఎందుకు చంపలేదో తరవాత తెల్సినది.

అదీ ఒక రకంగా అదృష్టమే!

మా దగ్గరున్న వస్తువులన్ని లాక్కున్నారు. మమ్మల్ని నగ్నంగా చేసి ఆయుధాలెటువంటివీ లేవని నిర్ణయించు

కున్నాకగాని వారికి తృప్తికలగలేదు. వారుచేసే ఏ పనికీ ఆటంకపరచలేదు మేము. వారు చెయ్యమన్నట్లల్లా చేశాము.

తరువాత రెండు గంటలు మా జీవితాలలో భయంకర మైన గంటలు. జీవించిగనగ ఉంటే వాటిని మర్చిపోలేము. రకరకాల చిత్రహింసలకు గురిచేశారు మమ్మల్ని. మా నోటి మాటకూడా బయటకి రాలేదు. ఒచ్చిందంటే మా పని ఆఖరు అని తెలుసు.

వారికి కావల్సిందల్లా ఒకటే?

"మాతోపాటు ఇంకా ఎందరున్నారు? ఎక్కడున్నారు?"

ఇద్దరం మౌనం వహించాము. మా మౌనం వారిలో కోపాన్ని మరింత రెచ్చగొడుతుందని తెలుసు. అయినా మేము నోరు విప్పలేదు. మా వెనక ఇంకా చాలామంది 'భారత సైనికులు' ఉన్నారని అనుకుంటున్నారు. వాళ్ళ ఉనికి మాద్వారా తెల్సుకోవాలని వాళ్ళ ప్రయత్నం.

రకరకాల చిత్రహింసలు భరించలేక ఇద్దరం స్పృహ కోల్పోయాము.

అలా ఎన్నిగంటలు స్పృహతప్పి ఉన్నామో తెలియదు గాని, స్పృహవచ్చిన వెంటనే మాకు ఆహారం ఇవ్వటంతో మా అవసరం వారికెంత ఉందో అవగతమయింది మాకు.

ఆవురావురుమంటూ తినేశాము. ప్రస్తుతం మా ప్రాణాలకు ఢోకాలేదన్న భరోసా వచ్చింది. కాని మా శరీరాలు పచ్చి పుళ్ళులా తయారయ్యాయి. కదిలితేచాలు ప్రాణం పోతుందేమో నన్నంత బాధగా ఉంది.

మమ్మల్నిద్దర్నీ విడివిడిగా చెరొక సెల్ లో బంధించారు. అందులోకి గాలి, వెలుతురులాంటివేమీ సరిగ్గారావు.

దోమలుకూడా కాపురముంటున్నాయో, లేక వాటినికూడా బంధించారో తెలియదుగాని మహా యిబ్బంది పెట్టేశాయి.

# 7

మరుసటిరోజు ఉదయం మమ్మల్నిద్దరిని ఒక ట్రక్ ఎక్కించారు. దానిచుట్టూ టార్పాలిన్ కట్టబడి ఉండటం వల్ల లోపల కటిక చీకటిగా వుంది. మా ఇద్దరి కాళ్ళు, చేతులు కట్టి పారేసి, ట్రక్ లో పడేశారు.

ట్రక్ బయలుదేరింది. ట్రక్ ముందువయిపు ఫ్రంట్ సీట్ లో నలుగురు సైనికులు కూర్చున్నారు. వారిలో ఒకడు డ్రైవ్ చేస్తున్నాడు. ట్రక్ లోపల మేము, కుదుపులకు అల్లల్లాడుతూ వున్నాము.

నాకు చైనాభాష సరిగ్గా రాదు. హరిపాల్ కు వచ్చు గాని, అతను స్పృహలో లేడు. బహుశా నాకంటే తెలివయిన వాడుగా కన్పిస్తుండటంవల్ల కాస్త 'డోస్' ఎక్కువయి ఉండవచ్చు.

అస్పష్టంగా విన్పిస్తున్న సైనికులమాటలనుబట్టి మమ్మల్ని హెడ్ క్వార్టర్స్ కు తీసుకుపోతున్నారని అర్థం అయింది.

సరిహద్దులో యుద్ధపరిస్థితి ఎలా వుందో తెలియదు. చైనా సైనికులుకూడా తెలియనివ్వటంలేదు.

ట్రక్ కుదుపులకు ఒళ్ళంతా చుట్టుకుపోతూంది. మా ఇద్దరి శరీరాలు రాచుకొంటున్నాయి. మెరుపులాంటి అయిడియా వచ్చింది. వెనక్కు తిరిగి హరిపాల్ కట్లను విప్పదీయటానికి ప్రయత్నించసాగాను.

పావుగంట అనంతరం అతని కట్లు కొద్దిగా లూజు అయ్యాయి. చటుక్కున హరిపాల్ లేచి తన కట్లను ఝాడించి, వదుల్చుకుని, నా కట్లనుకూడా విప్పదీశాడు.

మా శరీరంమీద దుస్తులు కొరడా దెబ్బలకు చిరిగిపోయి వున్నాయి. ఒళ్ళంతా రక్తం, ఎండిపోయి అదోరకమైన వాసనవేస్తూంది.

కొంతసేపటికి ట్రక్ కుదుపులు ఆగిపోయాయి. ఏదో సాఫీ అయిన రోడ్ మీద వెళ్తున్నట్లనిపించింది.

హరిపాల్ నా చెవి దగ్గర నోరుపెట్టి అన్నాడు. "ప్రస్తుతం మనం ఇక్కడే తప్పించుకోవాలి. అందుకే నేను స్పృహలో వున్నా లేనట్లు ప్రవర్తించాను. నన్ను ఒదిలి నువ్వు వెళ్ళవనే వారి నమ్మకం" అన్నాడు.

"ప్రస్తుతం వీళ్ళని ఎలా ఒదుల్చుకోవటం?" అన్నాను నేను.

రెండు నిమిషాలు ఆలోచించి హరిపాల్ నా చెవుల్లో ప్లాన్ చెప్పాడు. అర్థం అయిందన్నట్లు తలాడించి నెమ్మదిగా ట్రక్ వెనక్కు నడిచాను. టార్పాలిన్ తొలిగించి చూశాను. బయట ఎండ కాస్తూంది బాగా. టైం సుమారు పదిన్నర, పదకొండు గంటలవవచ్చు ఉదయం.

బయట ఏదో కొండప్రదేశం. నున్నటి తారురోడ్ మీద పోతూంది ట్రక్. నాకు తెల్సినంతవరకు ఈ దాపుల్లో తారు రోడ్ ఎక్కడా లేదు ఒక్క హెడ్ క్వార్టర్స్‌కి తప్ప. అంటే హెడ్ క్వార్టర్స్‌ని సమీపించబోతున్నాము. ఈ మాట తల్చుకోగానే ఒళ్ళు జలదరించింది. ఇంతవరకు జరిగింది ఒక ఎత్తు, ఇకముందు జరగబోయేది మరొక ఎత్తు.

ట్రక్ అడుగు అంచు పట్టుకొని, బయటకు జారాను. లోపలనుంచి హరిపాల్ పెద్దగా కేక వేయటం విన్పించింది. మరుక్షణమే ట్రక్ ఆగటం, నేను చటుక్కున దిగి ట్రక్ క్రిందకు దూరటం జరిగింది. ట్రక్‌కు అటూ, ఇటూ సైనికులు దిగటం కన్పించింది.

ఊపిరి బిగపట్టి సైనికుల కాళ్ళవంకే చూస్తున్నాను. ఆ ఇద్దరు ట్రక్ వెనక్కు నడిచి టార్పాలిన్ ఎత్తి లోనికి పోయారు. నేను అడుగునుండే ముందువైపుకు ద్రోరి డ్రైవింగ్ సీట్ వద్ద లేచాను. ట్రక్ వెనుకభాగానికి, ముందు భాగానికి మధ్య వున్న తలుపుద్వారా చూస్తున్నారు మిగిలిన ఇద్దరు.

స్టడీగా నిలబడి, అతని భుజం తట్టి పిలిచాను. నా వంక తిరిగి చూసి అదిరిపోయాడు. ఫట్ మంది అతనిముఖం. పచ్చబడిపోయి వుంటుంది. రెండోవాడు తేరుకోకముందే అతని ముఖంమీదకూడా మరో గుద్దుగుద్దాను. ముక్కువెంట రక్తం వచ్చింది. బెర్లుకమ్మి కూలిపోయాడు. డ్రైవింగ్ సీట్ లో వున్నవాణ్ణి క్రిందకులాగి డొక్కలో తన్నాను. అప్పుడే రెండోవాడు తేరుకున్నాడు. క్రిందపడ్డవాడి దగ్గరి మెషిన్ గన్ లాక్కుని ట్రిగ్గర్ నొక్కాను.

విరుచుకు పడిపోయాడు వాడు. రక్తం జివ్వునచిమ్మింది. లోనున్న ఇద్దరు హడావుడిగా బయటకు వచ్చారు. అంతే! వాళ్ళూ, నా మెషిన్ గన్ గుళ్ళకు బలయిపోయారు. క్రింద పడ్డవాడు లేవబోతున్నాడు. వాణ్ని మట్టుపెట్టేశాను.

హరిపాల్ మూలుగుతూ దిగివచ్చాడు. సైనికుల గన్స్ చెరొకటి తీసుకొని, మిగిలిన రెండూ ప్రక్కనే ఉన్న తుప్పల్లో పారేశాము, సైనికులతో సహా.

ఇద్దరం ఫ్రంట్ సీట్ లో కూర్చున్నాము. ట్రక్ ని ముందుకు పోనిచ్చాను. హరిపాల్ పరిసరాలను గుర్తుకు తెచ్చుకుంటున్నాడు. హఠాత్తుగా అపమన్నాడు.

"మనం హెడ్ క్వార్టర్స్ కి దగ్గర్లోనే వున్నాము. ఈ ట్రక్ అవసరం ఇక వుండకపోవచ్చు!" అన్నాడు.

ఇద్దరం దిగి ట్రక్ ని ప్రక్కనే వున్న లోయలోనికి నెట్టే శాము. కొంత దూరంలో కొండలు కన్పిస్తున్నాయి. కొండలు అనేకంటే పెద్ద పెద్ద గుట్టలు అనటం సమంజసం.

"ఆ గుట్టలుఎక్కిచూస్తే హెడ్ క్వార్టర్స్ కన్పిస్తాయి" అన్నాడు హరిపాల్.

రెండు గంటల ప్రాంతంలో ఇద్దరం కొండ ఎక్కటం ప్రారంభించాము. సరియైన దారిలేదు. పైగా ఎండ. ఎలా గయితేనేం శ్రమపడి కొండ ఎక్కగలిగాము. గుట్టలాగా వున్న ఆ కొండ రెండో చివర నున్నగా, నిట్టనిలువుగా వుంది. ఆ అంచుద్వారా ఎక్కటంగాని, దిగటంకాని వీలు కాదు. ఈ గుట్టేకాదు. అక్కడ వున్న గుట్టల్లాంటి కొండ లన్నీ లోపలవైపుకు అలానే వున్నాయి. అది విచిత్రం అన్పించింది గాని, అసలు విషయం తెలిసిన తర్వాత ఇదంతా కైనా సైనికుల పనేనన్పించింది.

ఇద్దరం బోర్లాగ పడుకొని ముందుకు చూశాం.

"అకన్పించే భవనాలే హెడ్ క్వార్టర్స్" అన్నాడు హరిపాల్.

# 8

చుట్టూ కొండలు. కొండల మధ్యలో విశాలమయిన మైదానం. ఆ మైదానం మధ్యలో వున్నాయి సైనికుల భవనాలు. మొత్తం మూడు. మాకు ఎడమవేపునుంచి రోడ్ వుంది. ఆ రోడ్ కొండల మధ్యలోనుంచి వేశారు లోనికి.

రోడ్ కి ఎదురుగా ఒక భవనం. దానికి అటూ యిటూ కొద్ది దూరంలో అడ్డంగా మరో రెండు భవనాలు ఎదురుబొదురుగా వున్నాయి.

ఆ భవనాలు చాలక కాబోలు భవనాల వెనక సైనికుల గుడారాలు కన్పిస్తున్నాయి. సరిహద్దుల్లో పోరాడుతున్న

'కైనా' సైనికులకు యిక్కణ్నుంచీ సప్లయిలు జరుగుతుంటాయి. ఇక్కణ్నుంచి సరిహద్దు ఏడెనిమిది మైళ్ళుంటుంది. కైనా సైనికులు క్రమంగా ముందుకు చొచ్చుకుపోవటంతో వారికి హెడ్ క్వార్టర్స్ దూరం అయ్యాయి.

దీనిని నాశనం చేయడంవల్ల పెద్ద లాభమేమి కన్పించ లేదు నాకు. ఇది కాకపోతే, మరొకటి వెలుస్తూంది. ఏం చేద్దామని ప్రశ్నించాను హరిపాల్ ని.

"మనం ఇంత కష్టపడి ఇక్కడకు చేరుకుంది దీనిని నాశనం చేయటంకోసమే. కనుక దాన్లో సందేహం లేదు. కాని ఎలా?" అన్నాడు హరిపాల్.

"అది నిజమే! కాని దీనిని నాశనం చేయటంవల్ల మనకు పెద్ద లాభం లేదుకదా?" అంటూ, నా మనసులో వున్న సందేహాన్ని బయటపెట్టాను.

"లాభం ఎందుకు లేదూ? కైనా కమాండర్-ఇన్-ఛీఫ్ నుంచి వచ్చే వార్తలు ఈ ఏరియాకి ఇక్కణ్నుంచే ప్రసార మవుతాయి. అంతేకాదు ఇక్కణ్నుంచే సైనికులకు ఆహార పదార్థాలు, మందుగుండు సామాగ్రి మొదలైనవి సప్లయి అవుతాయి. ఒక రకంగా ఇది ఆ ఏరియాలోని కైనా సైనికులకు, రాజధానిలోని సైనికాధికారులకు అనుసంధానకారి వంటిది. మన మిప్పుడు దీన్ని కూల్చెయ్యటంద్వారా సమయానికి సప్లయిలు అందక సరిహద్దుల్లోని కైనా సైనికులు ఇబ్బంది పడతారు. తద్వార మనవాళ్ళకి కొంత వెసులు బాటు లభిస్తుంది." ముగించాడు హరిపాల్.

ఇంతలో మాకు ఎడమప్రక్క వున్న తారురోడ్ పైన ట్రక్ శబ్దాలు విన్పించటంతో మాటలు ఆపేసి తలలుతిప్పి చూశాము.

కొండలవద్ద ఏర్పాటు చేసిన చెక్ పోస్టును దాటి అయి దార మిలటరీ ట్రక్కులు మైదానంలోనికి ప్రవేశించాయి. మాకు, సైనికభవనాలకు మధ్య చాలా దూరం ఉంది. అంతేకాదు, మేము కొండపైనుండి, పడుకొని వుండటం వల్ల మమ్మల్ని ట్రక్ లోవున్న వాళ్ళు గమనించే అవకాశం లేదు.

మైదానంలోకి ప్రవేశించిన ట్రక్కులు లోపలికి వేసిన తారురోడ్ ద్వారా భవనాలవైపు సాగాయి. వాటినిండా, చుట్టూ టార్పాలిన్లు కప్పబడి వున్నాయి. వాటి నడక చూస్తుంటే ఫుల్ లోడ్ లో వున్నట్లున్నాయి.

మరో అయిదు నిమిషాల తర్వాత ట్రక్ లు భవనం ముందాగాయి. ఫ్రంట్ సీట్లలోనుండి నలుగురయిదుగురు సైనికులు దిగారు. ప్రతి ఒక్కరి చేతిలోను తుపాకులున్నాయి. వారుతప్ప ట్రక్స్ నుంచి ఇంకెవరూ దిగలేదు.

"ఇక్కణ్నుంచి చూస్తే లాభంలేదు. అక్కడికి వెళ్ళి చూడాలి." అన్నాడు హరిపాల్.

"ఇప్పుడా?" ఆశ్చర్యపోయి, అడిగాను. "ఇంత పట్ట పగలా?"

హరిపాల్ నవ్వాడు. "మనం ఇప్పుడు బయలుదేరితే గాని, రాత్రికి అక్కడికి చేరుకోలేము. ఇక్కడ కాపలా బాగా వుంటుంది. ఇక్కడకువచ్చే ఏ ట్రక్ అయినా వస్తున్నట్లు ముందే తెలుస్తుంది. అందుకే మన ట్రక్ ని లోయ లోనికి తోయించేశాను. ప్రస్తుతం నడకే మనకు గతి" అని అన్నాడు హరిపాల్.

"ఆ దారితప్ప మరో దారి ఏమీ లేదా?"

"తారు రోడ్డు తప్ప మరోదారికూడా లేదు. అదే మనకు శరణ్యం."

ఇద్దరం నెమ్మదిగా కొండ దిగసాగాము, ఎండకు శరీరం నిండా చెమటలు కారుతున్నాయి, మెషిన్ గన్స్‌ని చేతులు మార్చుకుంటూ మోస్తున్నాము.

"ప్రస్తుతం బోర్డర్స్‌లో ఎలా వుందో?" అన్నాను దిగాలుగా.

"నా ఊహే నిజమయితే యిప్పుడు వార్ జరక్క పోవచ్చు" అన్నాడు హరిపాల్.

"ఎందుకనుకుంటున్నావలా?" అన్నాను.

"నిన్నటిరోజున చిత్రహింసలు పెట్టినపుడు నాకు నిజంగా స్పృహపోలేదు, అయినా తప్పిపోయినట్లు నటించాను. అప్పుడు చైనా సైనికులు మాట్లాడుకుంటున్న మాటలు నా చెవినబడ్డాయి. ప్రస్తుతం సరిహద్దుల్లో ప్రశాంతంగావుందని, చైనా రాజకీయ నాయకులుఏదో కొత్తప్లాను వేస్తున్నారని తెలిసింది. కాని ఆ ప్లాన్ ఏమిటో మాత్రం తెలియలేదు. మన ఉనికి వాళ్ళని విపరీతంగా భయపెడుతోంది. వాళ్ళ ప్లానుని భగ్నంచేస్తామేమోనని విపరీతంగా భయపడుతున్నారు. అందుకే ఆ ప్లాన్ అమలుజరుపబోయే ముందు మనల్ని పూర్తగా నాశనం చేసిగాని వదలదల్చుకోలేదు వాళ్ళు. కాని మనం అక్కడ నోరు విప్పకపోవటంతో మనల్ని హెడ్ క్వార్టర్స్‌కి పంపదల్చుకున్నారు."

"అంటె మనం వస్తున్నట్లు హెడ్ క్వార్టర్స్‌కి తెలుసా?"

"తెలుసు. ఎప్పటికప్పుడు వైర్‌లెస్ ద్వారా మెస్సేజ్ అందుతుంది వాళ్ళకి."

ఇద్దరం కొండదిగాము. తారురోడ్ ప్రక్కన చెట్ల చాటున నడవసాగాము. మా బూట్లక్రింద ఎండుటాకులు పడి శబ్దంకాకుండా జాగ్రత్తపడుతున్నాం.

"ఇక్కణ్నుంచి సుమారు మైలుదూరం పోవాలి. అక్కడ ఈ రోడ్ వంపు తిరిగి కొండల్లోనుండి మైదానం లోకి దారితీస్తుంది."

ఇద్దరం మౌనంగా నడక సాగించాము. దార్లో కన్పించిన చెట్ల ఫలాలను తిని ఆకలి తీర్చుకున్నాం. మరోగంటా, గంటన్నర తర్వాత రోడ్ వంపులోనికి ప్రవేశించి ఆగి పోయాం. ఫర్లాంగు దూరంలో చెక్ పోస్టు వుంది.

"చీకటి పడితేగాని లోనికి చేరుకునే మార్గం ఆలోచించలేము." అంటూ రోడ్ ప్రక్కనేవున్న చెట్ల తోపు ల్లోకి దారితీశాడు హారిపాల్. నేనూ అనుసరించాను.

ఇద్దరం చీకటిగానున్న చోటు చూసుకొని కూలబడ్డాం. తర్వాత కొంచెంసేపటికి లోపలినుంచి ట్రక్ లు వస్తున్న శబ్దం అయింది. ఇద్దరం లేచి చూశాం. ఖాళీ అయిన ట్రక్కులు వరసగా వెళ్ళిపోతున్నాయి.

"ఇందాకటివి ఖాళీ అయినట్లున్నాయి" అన్నాడు హారిపాల్. ఇద్దరం వెనక్కి తిరిగివచ్చాం.

# 9

రాత్రి పదిగంటలు అయివుండవచ్చు. పుచ్చపువ్వులా వెన్నెల కాస్తోంది. ఆ వెన్నెలలో పరిసరాలన్నీ వెండితో కడిగినట్లు మిలమిలా మెరిసిపోతున్నాయి. గాలి స్తంభించి వుంది. కీచురాళ్ళ రొదలు తప్ప ఇతర శబ్దమేమీ లేదు.

తలెత్తి ఆకాశం వంక చూశాను. పీసమెత్తు మేఘం కూడా లేదు. ఈ వెన్నెల్లో గనక మేము బయటికి వస్తే, సెంట్రీలకు కన్పించడం ఖాయం. స్పష్టంగా కన్పించక పోయినా, మా ఉనికి తెల్సిపోతుంది. పైగా, మా గురించి యిప్పటికే హెడ్ క్వార్టర్స్ కి వార్త చేరి వుంటుంది. మేము యింకా చేరకపోవటంవల్ల కంగారుపడి వుంటారు.

నిముషాలు గడిచిపోతున్నాయి. ఓపిగ్గా కూర్చున్నాము యిద్దరం. దాదాపు పదిన్నర గంటల ప్రాంతాల్లో తిరిగి వచ్చాయి ట్రక్కులు. లోడ్ మీద వున్నాయి. చెక్ పోస్టు వద్ద వరసగా ఆగిపోయాయి. గేటుదగ్గర వున్న సెంట్రీ ఒక్కొక్క ట్రక్కునే చెక్ చేసి లోనికి వదులుతున్నాడు.

మాకు అయిదారొందల గజాల దూరంలో వుంది చివరి ట్రక్కు. లోపలనుంచి గార్డ్సుగాని, డ్రైవర్ గాని దిగ లేదు. చెక్ పోస్టువద్ద సెంట్రీలు అక్కడ వున్న ట్రక్కుని పరీక్షించడంలో మునిగిపోయి వున్నారు. మమ్మల్ని గమ నించే అవకాశం లేదు. నెమ్మదిగా బయటకువచ్చి, చివరి ట్రక్ వెనక భాగానికి చేరుకున్నాను. నా వెనకే హరిపాల్ వచ్చాడు.

నేను ముందుకి పోయాను. చివరి ట్రక్ కి, దాని ముందు ట్రక్కుకి మధ్య ఎక్కువ దూరం లేదు. చటుక్కున ఆ దూరం పాకి, రెండో ట్రక్కు అడుగుభాగం చేరుకున్నాను. హరిపాల్ చివరిట్రక్కు అడుగున వేలాడుతున్నాడు.

పావుగంట తరువాత ట్రక్కులు బయలుదేరాయి.

నిరాటంకంగా శత్రు శిబిరంలోకి జొరబడ్డాము నేను, హరిపాల్. మైదానంలోనికి ప్రవేశించిన ట్రక్కులు రివ్వున రోడ్ మీదుగా దూసుకుపోయాయి. ట్రక్ అడుగునుండి జారి క్రింద పడిపోకుండా, బలంగా పట్టుకొని జాగ్రత్త పడ్డాను.

అయిదునిమిషాలనంతరం భవనాలదగ్గర ఆగిపోయాయి ట్రక్కులు. ఎదురుగానున్న భవనానికి ఒకప్రక్కనుంచి, సైనికులందరూ దిగి వెళ్ళిపోయారు భవనంలోకి.

మరో అయిదు నిమిషాలు గడిచిపోయాయి. ఎవరూ

వస్తున్న జాడలేదు. నెమ్మదిగా క్రిందకు జారి, నేలమీద వెల్లకిలా పడుకున్నాను. అరచేతుల నిండా చెమట పట్టి, నొప్పిగా వున్నాయి. మరోనిముషం అలానే ఉండి పోయాను. వెన్నెల్లో ఎడమ, కుడివైపు వున్న భవనాలు స్పష్టంగా కన్పిస్తున్నాయి.

దూరానికి చూస్తే బాగానే వున్నా, అవి చాలా పాతకాలం నాటివని దగ్గరనుంచే చూస్తే తెలిసిపోతూంది. బాగా శిథిలమయిపోయాయి. వాటిని బాగుచేయించి ఈ విధంగా ఉపయోగించుకుంటున్నారు. లోపల కొన్ని గదుల్లో పెట్రోమాక్స్ లైట్లు వెలుగుతున్నాయి. కొన్ని గదుల్లో అసలు దీపాలే లేవు.

ఏదో అలికిడి కావటంతో ఆలోచనలనుండి బయటపడి, చటుక్కున తల తిప్పాను.

హారిపాల్!

నేనున్న ట్రక్ క్రిందకు పాకుకుంటూ వస్తున్నాడు. మరో పదినిముషాలు ఇద్దరం మౌనంగా వేచివున్నాము. డ్రైవర్ల జాడ లేదు. ఇక ఈ ట్రక్కులు ఇప్పుడప్పుడే కదిలేలా లేవు. వీటిద్వారానే మేము యిక్కణ్నుంచి బయటపడాలి.

అక్కడ వున్న మూడు భవనాల ముందు తుపాకులు ధరించివున్న సెంట్రీలు అటూ, ఇటూ తిరుగుతూ కాపలా కాస్తున్నారు. భవనాల లోపల ఏ అలికిడీ లేదు. అందరూ నిద్రపోతున్నట్లున్నారు.

ఏమిచేయాలో యిద్దరం అంతకుముందే నిర్ణయించుకున్నాం గాబట్టి, అక్కడ పరిస్థితులు చూసి తికమక పడలేదు. హారిపాల్ అంచనాలన్నీ కరెక్టుగానే వేశాడు.

కానీ ఈ వెన్నెలొకటి! మేము బయటపడితే మమ్మల్ని గమనించే అవకాశం సెంట్రీలకు ఉంది. అందుచేత తొందర పడకుండా సావధానంగా ముగించాలి పనిని.

చటుక్కున నాకొక అయిడియా వచ్చింది.

నాకు తోచిన ఉపాయం హారిపాల్‌తో చెప్పాను. అతనూ కొంచెం ఆలోచించి, అంగీకరించాడు.

# 10

నెమ్మదిగా నేను ట్రక్ క్రిందనుండి బయటికి దొర్లాను. సెంట్రీలు నన్ను గమనించటం లేదని నిర్ధారించుకొని, చటుక్కున లేచి నిలబడ్డాను. వారివైపు నడవసాగాను.

నా అడుగుల చప్పుడు విని తిరుగుతున్న యిద్దరు సెంట్రీలు చటుక్కున ఆగిపోయారు. తుపాకులు నా వైపుకు గురిచేశారు.

"ఎవరది?" చైనా భాషలో అరిచాడొకడు.

సమాధానం యివ్వకుండా అలాగే ముందుకి నడిచాను. సేఫ్టీకాచ్ క్లిక్‌మన్న శబ్దం అయి, ఆగిపోయాను.

నాకూ, వారికి మధ్య నాలుగయిదడుగుల దూరం కంటే ఎక్కువ వుండదు. నా నుంచి సమాధానం రాక పోవటంతో వారిలో అనుమానం పెరిగినట్లుంది, నా ముఖం మీద బ్యాటరీలైటు కాంతి పడింది.

తర్వాత జరగబోయేది నాకు తెలుసు. నా దగ్గరవున్న మెషిన్‌గన్‌ని క్రిందకి వదలటం, ఊపిరి బిగించి వారిద్దరి మీదకు లంఘించటం ఏకకాలంలో జరిగిపోయాయి.

ఒకణ్ని కాలితో గొంతుమీద తన్ని, రెండోవాడి పీక పట్టుకున్నాను. అదే క్షణంలో హారిపాల్ కూడా పరుగెత్తు కుంటూ వచ్చాడు. క్రింద అంతా దుమ్ముతో నిండివుండటం వల్ల బూట్లశబ్దం కాలేదు.

మరో రెండు నిమిషాలలో స్పృహతప్పిన ఆ సెంట్రీల నిద్దరినీ ట్రక్కుల క్రింద పడేశాము. అక్కడే ఆగి పరిశీలించాము. దూరంగా వున్న భవనాలముందు తిరుగుతున్న సెంట్రీలు మమ్మల్ని గమనించలేదు.

ఇద్దరం భవనం సింహద్వారంవైపు నడిచాము. ఆ భవనాలన్నీ ఒకే మోడల్‌లో కట్టబడ్డాయి. రెండంతస్థులున్నాయి ప్రతిదానికి. సింహద్వారంవద్ద ఎత్తుగా మెట్లు వున్నాయి. వాటిద్వారా లోనికి ప్రవేశించాము. తలుపులు దగ్గరగా వేసివున్నాయి. తలుపు సందుల్లోంచి లోనుండి పెట్రోమాక్సు లైట్ల కాంతి బయటకు వస్తోంది.

తలుపు సందుల్లోంచి చూశాను. లోపల విశాలమైన హాలు. హాలుకి మూడువైపులా గదులున్నాయి. హాలులో క్రింద వరసగా సైనికులు నిద్రపోతూ కన్పించారు. హాలుకి అవతల చివర పైకి పోయేందుకు మెట్లు కన్పించాయి.

ఇద్దరం తిరిగి సింహద్వారం దగ్గరికి నడిచాము. అక్కడ వున్న స్తంభం ప్రక్కనే నక్కాము.

"మధ్యాహ్నం వచ్చిన ట్రక్కులు ఏవో లోడ్స్ దించి వెళ్ళాయి. అవి ఏమయినట్లు? అసలవి ఏమిటి?" అని అడిగాడు హరిపాల్.

"మిగిలిన రెండు భవనాలలో దాచారేమో! అది సరే! ఇక్కడేమిటి యింతమంది సైనికులు?" ఆతృతగా అడిగాను.

"బహుశా సరిహద్దులకి వీరిని తరలిస్తున్నారేమో. వీళ్ళకి కావల్సిన సప్లయిలు అయివుంటాయి ఆ లోడ్స్!"

"మనం మిగతా భవనాలని కూడా పరీక్షిస్తే బాగుంటుందేమో!"

నా అభిప్రాయం బయటపెట్టాను. హరిపాల్ కూడా అంగీకరించాడు. ఇద్దరం నెమ్మదిగా బయటపడ్డాము. ఎడమ వైపు భవనాన్ని సోదా చేశాముగాని, అనుమానించదగ్గదేది దొరకలేదు. దాని నిండా కూడా సైనికు లున్నారు.

"పైకి వెళ్ళటానికి వీలులేదు. ముందు కుడివైపు దాన్ని కూడా చూసి వద్దాం రా!" అన్నాడు హరిపాల్.

మొదటి మాదిరిగానే బయట నున్న సెంట్రీలను తప్పించామని వేరే చెప్పనక్కరలేదు.

మూడో భవనం తలుపు తెరిచి, లోనికి అడుగెట్టి నిర్ఘాంతపోయాము. అదే సమయంలో బయట కలకలం అయింది. సైనికుల కేకలు, చప్పాళ్ళు.

అప్పుడు గుర్తొచ్చింది మేము చేసిన పొరపాటు. చంపకుండా, వదిలిన సెంట్రీలకు ఎవరికో స్పృహ వచ్చి ఉంటుంది.

చటుక్కున తలుపులు మూశాడు హరిపాల్. లోపల ఉన్న ఇద్దరు సెంట్రీలు నిద్ర మేలుకున్నారు. కాని కాపలా కాయాల్సినవాళ్ళు నిద్రపోవటం ఫలితంగా ఇద్దరూ కూలిపోయారు.

ఇద్దరం లోపల కనిపిస్తున్న డైనమైట్స్, మొదలయిన ఎక్స్‌ప్లోజివ్స్ మీదకు దూకాము.

విశాలమయిన ఆ హాలులో రెండో చివర పెద్ద పెద్ద చెక్కపెట్టె లున్నాయి. వాటిల్లో ఏముంటాయో తెలుసు. ఎక్స్‌ప్లోజివ్స్!

హేండ్ గ్రెనేడ్స్ మొదలుకొని టైంబాంబు వరకు ఉండి ఉంటాయి. రకరకాలయిన బాంబులు. నాటువి, మోటువి, అధునాతనమయినవి, ఎన్నో రకాలు. చెక్కపెట్టెలు క్రిందికి దించి సీలు విప్పదీస్తున్నాడు హరిపాల్.

బయటనుంచి కేకలు, చప్పుళ్ళు, గోల ఎక్కువయి పోయింది. తలుపులు బాదుతున్నారు. ఏ క్షణంలో అయినా విరిగి పడవచ్చు. అదృష్టవశాత్తు మేడ పై భాగంలో ఎవరూ ఉన్నట్లు లేరు.

వరసగా నాలుగయిదు చెక్కపెట్టెలు విప్పదీశాడు హరిపాల్. మెషిన్ గన్ మాగజైన్ లోడ్ చేశాను.

ఇద్దరం బోర్లాగా పడిపోయాము. బయటనుంచి కాల్పులు ఆరంభమయ్యాయి. తలుపులమీదకు పేలుస్తున్నారు.

హరిపాల్ చేతిలోనికి బాంబ్ తీసుకుని, నా వంక చూశాడు. ప్రోత్సహిస్తున్నట్లు తల ఊపాను. చాలా ప్రమాదకరమయిన చర్య అది. ఆ బాంబు తాకిడికి ఆ గదిలోని ఇతర ఎక్స్‌ప్లోజివ్స్ అంటుకున్నాయంటే మా పని గోవింద.

పంటితో ఫ్యూజ్ లాగి తలుపుమీదకు విసిరేశాడు. వెంటనే బోర్లాపడిపోయి, తల నేలమీదకు ఉంచి, చెవులు గట్టిగా మూసుకున్నాము.

భయంకరమయిన శబ్దంతో పేలింది బాంబు. తలుపులు ఎగిరిపడ్డాయి. రాళ్ళు, రప్పలు మామీద పడ్డాయి, చటుక్కున లేచాము. ద్వారంవద్ద పొగ, కళ్ళు కన్పించనంత పొగ.

బయట ఉన్న సైనికులలో కొందరు చనిపోయి ఉంటారు. మిగిలినవాళ్ళు దూరంగా పోయి ఉంటారు.

ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలి.

మరో బాంబు విసిరేశాను. ఆర్తనాదాలు, కేకలు!

ఆ కన్పించని పొగలోనే పోయి మెషిన్ గన్ ట్రిగ్గర్ నొక్కాను, చుట్టు తిప్పుతూ. ఢన్ ఢన్ ఢన్ మంటూ పేలుతూంది మెషిన్ గన్.

దూరంగా వున్న కొంతమంది కైనా సైనికుల ఆర్త నాదాలు.

బహుశా వారి అమ్యూనిషన్ అంతా ఇక్కడే వున్నట్లుంది. అందుకే మమ్మల్ని ఏమీ చేయలేకపోతున్నారు.

హరిపాల్ అయిదారు బాంబుల్ని ఫ్యూజ్ లాగి, చుట్టూ మైదానంలోకి, బిల్డింగులమీదికి బలంకొద్దీ విసిరేశాడు.

చెవులు చిల్లులుపడుతున్నాయి. సైనికుల కేకలు.

మాలో పైశాచికత్వం ప్రబలింది. ఏదో తెలియని కసి! ఆనందం!!

నేనూ చేతికందినన్ని బాంబుల్ని విసిరేస్తున్నాను.

వెనక కిటికీవైపు అలికిడయింది. గన్ అటు తిప్పి ట్రిగ్గర్ నొక్కాను. కీచుగా అరిచా రెవరో. మరుక్షణం కిటికీ దగ్గరకు పరుగెత్తి బాంబు విసిరాడు హరిపాల్. భవనం వెనుక పొంచి వస్తున్న సైనికులు తుత్తినియలయి ఎగిరిపడ్డారు. మరో బాంబుకి గుడారాలు అంటుకున్నాయి.

హరిపాల్ ఆ కేకలు, చప్పుళ్ళమధ్య బాంబులు విసురుతూనే పెద్దగా అరిచి చెబుతున్నాడు. నేను మెషిన్ గన్‌కు పని చెబుతూనే వింటున్నాను.

గుమ్మం చాటున నిలబడి కాలుస్తున్నాను. మా ధోరణి గ్రహించారు కైనా సైనికులు. వాళ్ళూ తెగించారు. ఆ బాంబుల మధ్యలో చచ్చినవాళ్ళు చావగా, మిగిలినవాళ్ళు ముందుకి చొచ్చుకువస్తూ కాల్పులు సాగిస్తున్నారు.

గుమ్మం చాటునుండి హఠాత్తుగా వచ్చి, గన్ కాల్చి, ప్రక్కకు తప్పుకోవడం నేను చేస్తున్న పని.

బాంబుల శబ్దంతో మైదానం అంతా ప్రతిధ్వనిస్తోంది.

ఏ క్షణంలో అయినా మేమున్న ఆ శిధిలభవనం కూలిపోయే టట్లుంది.

మెషిన్‌గన్ కాల్చాను. భుజం చురుక్కుమంది. వెంటనే తొడల్లో మంట. పిక్కలు పేలిపోతున్నాయి. చటుక్కున పక్కకు తప్పుకున్నాను,

హరిపాల్ బాంబు విసిరాడు. నా వంక చూశాడు. బలహీనంగా నవ్వాను. భుజంనుంచి, తొడల్లోంచి రక్తం విపరీతంగా కారుతోంది.

హరిపాల్ చెక్కపెట్టెల దగ్గరికి నడిచి, చేతికి పట్టి నన్ని బాంబులు తీసుకున్నాడు. జేబుల్లోను, షర్టు లోపల పట్టినన్ని వేసుకున్నాడు. నేను గుమ్మం దగ్గరే వున్నాను. చేయి ఊపాను.

గన్ బయటకు గురిచూసి కాల్చాను. రెండు బాంబులు విసిరాడు హరిపాల్. మరుక్షణం ఆ పొగలో అదృశ్య మయ్యాడు.

నాకు క్రమంగా నిస్సత్తువ ఆవహిస్తోంది. కళ్ళు మూతలు పడుతున్నాయి.

బయట భవనాలమీద బాంబులు విసురుతూంటాడు హరిపాల్. పేలుళ్ళు భయంకరంగా వినిపిస్తున్నాయి. నా దగ్గరున్న అమ్యూనిషన్ అయిపోయింది. లేచే ఓపిక లేదు.

అయినా ఓపిక చేసుకొని లేచాను. అలానే పాకుంటూ హాలు చివర వున్న అమ్యూనిషన్ లోడ్ దగ్గరకు నడిచాను.

అయిదు నిమిషాలపాటు కష్టపడి నే ననుకున్నది చేశాను. మరలా పాక్కుంటూ గుమ్మం దగ్గరికి వెళ్ళాను.

మెషిన్ గన్ ని కాళ్ళదగ్గరగా వుంచుకున్నాను. గోడకి చేరగిలబడి కూర్చున్నాను. నేను చనిపోతానని తెలుసు. అయినా యెందుకో చావంటే భయం కలగటంలేదు. నిశ్చయంగా చస్తామని తెల్సినపుడు కలిగే వైరాగ్యం కాబోలు యిది!

బయట ఇంకా చప్పుళ్ళు విన్పిస్తూనే వున్నాయి. గన్ లాక్కుని కాళ్ళమీద వేసుకున్నాను.

మరో అయిదునిమిషాల తర్వాత బయట కాల్పులు ఆగిపోయాయి. అంటే హారిపాల్ ...!

గుండెల్లో కలుక్కుమంది. నిస్త్రాణతో కళ్ళు మూసుకున్నాను. అలా ఎంతసేపు వున్నానో తెలియదు. కలకలం వినిపించింది. నెమ్మదిగా, అతి కష్టంమీద కళ్ళు తెరిచి చూశాను. మసకమసగ్గా వుంది. లీలగా మనుష్యుల ఆకారాలు గోచరిస్తున్నాయి.

నా మీదకు వంగి చూస్తున్నారెవరో. కాని నా కళ్ళకు వాళ్ళు కన్పించడం లేదు. ఎదురుగా అమర్చిన డైనమైట్లు, బాంబులు కన్పిస్తున్నాయి. నా చేతిలోని మెషిన్ గన్ వాటికి సరిగ్గా గురి పెట్టబడివుంది.

ట్రిగ్గర్ నొక్కితే ఏమవుతుందో తెలుసు. ఆ సావరం క్షణాల్లో స్మశానంగా మారుతుంది. ఆ హాలులో చాలా మంది ఉన్నట్లున్నారు. తృప్తిగా ఊపిరి పీల్చి, ట్రిగ్గర్ నొక్కాను.

తర్వాతేమయిందో ఇహ నాకు తెలియదు.

—: ఐ పో యిం ది :—

# నా పేరే భగవాన్

కురుమద్దాలి విజయలక్ష్మి

"అమ్మడూ! జాగ్రత్త. రేపు ఉదయం సర్కార్‌లో వస్తాము."

"నాన్నగారూ! నేనేం చిన్నపిల్లను కాను. ఈ ఉదయంనుంచీ ఇప్పటికి 'జాగ్రత్త...జాగ్రత్త' అంటూ కనీసం వందసార్లయినా చెప్పి వుంటారు" అంది అమల నవ్వుతూ.

అమల తెలివికి మురిసిపోతూ "చూచావుటే రాజేశ్వరి! అమ్మడంటే అల్లాటప్పాకాదు" అని ఫక్కున నవ్వారు పరంధామయ్యగారు.

పరంధామయ్య, రాజేశ్వరమ్మలకి, అమల ఏకైక సంతానం. అతిత గారాబంగా పెంచినా అమల బుద్ధి

మంతురాలు. తెలివి కలదీ.

"అమలకి అప్పుడే ఇరవై ఏళ్ళు నిండాయి. దిక్కుమాలిన చదువు ఎవరిని ఉద్ధరించను? పెళ్ళి చేస్తే ఈ పాటికి పిల్లల తల్లయి కళకళలాడుతూ వుండేది," అంటుంది రాజేశ్వరమ్మ. ఆడపిల్లలకు పెళ్ళి, పిల్లలు, అనుకూల దాంపత్యం చాలని ఆమె అభిప్రాయం.

"అమ్మడు ఇష్టపడ్డప్పుడే పెళ్ళి పేరంటం. పెళ్ళిమాట నా ముందెత్తకు. దానిష్టమొచ్చినంతకాలం చదువుకోని," అంటారు పరంధామయ్య.

పెద్ద చదువులు చదవటం, గొప్ప పనులు చేయటం అమలకు ఇష్టం. ప్రస్తుతం బి. ఏ. చదువుతున్నది.

పక్క ఊళ్లోనే చుట్టాలింట్లో పెళ్ళి. వాళ్ళయినా చాలాదూరం చుట్టాలు. బీదవాళ్ళు. పెళ్ళి రాత్రి ఒంటి గంటకి. అందుకే సర్కార్‌లో ఏడు గంటలకు బైలుదేరి తిరిగి ఉదయం సర్కార్‌లో రావాలని అనుకున్నారు.

తెల్లవారితే పరీక్షలు. అందుకే పెళ్ళికి రానంది అమల.

పరంధామయ్య, రాజేశ్వరమ్మ ఎక్కిన రిక్షా బైలు దేరింది.

రిక్షా వీధి మలుపు తిరిగేందాకా చూచి ఇంట్లోకి వచ్చి తలుపు గడియ బిగించింది అమల.

పరంధామయ్య ఇల్లు పెద్దది అంటే, పన్నెండు పెద్ద గదు లున్నది. మూడు గదులు చిన్న కాపురానికి అద్దె కిచ్చారు. ఆ వాటాలో వాళ్ళు యాత్రల నిమిత్తం పది రోజుల క్రితం తమ వాటాకి తాళంవేసి వెళ్ళిపోయారు.

అమల సహజంగా ధైర్యం కలది కాబట్టే ధైర్యంగా తల్లి తండ్రులను పంపించి, ధైర్యంగా వుంది.

అమల భోజనం ఎనిమిది గంటలకే చేసింది. కాసేపు విశ్రాంతిగా మంచంమీద మేను వాల్చింది. తెల్లవారి బి. ఎ. పబ్లిక్ పరీక్షలు మొదలు. పుస్తకాలు ముందేసు కొని చదవసాగింది.

## 2

"ఇటొక్కసారి చూడు..."

కీచుగా వినిపించింది కిటికీలోనుంచి. అమల క్షణం కొయ్యబారిపోయింది.

"నీకే చెప్పేది? ఇటొక్కసారి చూడు!"

మళ్ళీ అదే కీచు కంఠం. అమల చదువుతున్న పుస్తకం తెలియకుండానే చేతిలోంచి జారిపోయింది. గుండె దడ దడలాడింది.

అమల భయం కప్పి పుచ్చుకుని, చటుక్కున తల ఎత్తింది కిటికీ వైపు.

కిటికీకి ఆనుకుని ఓ వికృతాకారుడు నుంచునివున్నాడు. అతని రెండు చేతులు కిటికీ ఊచలను పట్టుకుని వున్నాయి. అమల వణికిపోతూనే విసురుగా లేచి వేగంగా కిటికీ తలుపులు వేయబోయింది.

సగం తలుపులు వేస్తూ వుండగానే వికృతాకారుడి చెయ్యి పని చేసింది. చేతిలో ఇంక్ పిల్లర్ లాంటి దానితో మత్తు మందు నొక్కాడు. జల్లులా అమల మొహాన కొట్టింది. అమల అలానే మంచంపై వాలిపోయింది.

వికృతాకారుడి చేతిలో లావుపాటి చిన్న కొంకి కర్ర వుంది. ఆ కర్ర పిడివైపు తిప్పి లాగితే అది చాలా పొడు గాటి కర్ర అయింది. ట్రాన్సిస్టర్ ఏరియల్ రాడ్‌లా నిర్మించబడింది ఆ కర్ర.

కొంకి కర్రను కిటికీలోంచి పోనిచ్చి అమల లోపల

వేసిన తలుపు గడియపైకి ఎత్తాడు. ఆ తర్వాత వాకిలి తలుపు గడియకూడా కొద్ది శ్రమతో తీయగలిగాడు.

పరంధామయ్య దంపతులు ఊరి కెళ్ళినట్లు...ఆ ఇంట్లో మరో ప్రాణి లేనట్లు ముందే తెలుసేమో? తాపీగా ఇంట్లో ప్రవేశించాడు వికృతాకారుడు. ముందుగా అమల పుస్తకాలు తిరగేశాడు. దస్తూరీ పరీక్షించాడు. తల పంకించి నోట్ బుక్ లో కాగితం చించి, అమల పెన్ అందుకున్నాడు. జాగ్రత్తగా రాయటం మొదలుపెట్టాడు.

"అమ్మ, నాన్నగార్లకు,

మీ దృష్టిలో పాడు పని, నా దృష్టిలో మంచి పని చేశాననుకుంటున్నాను. నన్ను క్షమించండి. నేను జహాంగీర్ ఖాన్ ని ప్రేమించాను. కులమతాలకు అత్యంత ప్రాధాన్యం ఇచ్చే మీరు మా పెళ్ళికి ఒప్పుకోరు. ఖాన్ మనలో కలవడు, నేను ఖాన్ కోసం వాళ్ళ మతం స్వీకరించి పెళ్ళి చేసుకోదలచుకున్నాను. అందుకే నేను ఈ రాత్రి ఖాన్ తో వారి ఇంటికి వెళ్ళిపోతున్నాను. మళ్ళీ ఎప్పటికో వస్తాను. నా గురించి దిగులుచెంది ప్రయోజనం లేదు కాబట్టి, ధైర్యం తెచ్చుకుని మనస్ఫూర్తిగా క్షమించండి. నాకోసం ఆరాలు తీయవద్దు. మధ్య మధ్య నా క్షేమ సమాచారాలు లెటర్స్ ద్వారా తెలుపుతుంటాను. ఏదయినా నా కొరకై చర్య తీసుకుంటే నా శవం మాత్రమే మీకు దక్కుతుంది. ఇలా వ్రాస్తున్నందుకు నాకూ బాధగానే ఉంది. అందుకే ఏమీ తీసుకెళ్ళటం లేదు. మీ బాధ, కోపం తగ్గిన తరువాత వస్తాను. మీ అమ్మడుని క్షమించండి. అంతే నేను కోరేది.

మీ

అమల (అమ్మడు)"

వికృతాకారంగా వున్నతను, తను రాసింది ఒకటికి రెండుసార్లు చదువుకున్నాడు. అమల రైటింగ్, తను రాసింది ఒకేలా వుండటంతో, రాసిన కాగితాన్ని టేబుల్ మీద పెట్టి, అది ఎగిరిపోకుండా పేపర్ వెయిట్ పెట్టాడు. కిటికీ తలుపులు మూసేశాడు. టేబుల్ లైట్ ఆర్పేశాడు.

అమలను చేతులమీద ఎత్తుకుని బైటకు వచ్చాడు. యథావిధిగా అన్ని తలుపులు మూసేసి వాకిలి తలుపుకి చిన్న తాళం వేశాడు.

ఆ ఇంటికి కొద్ది దూరంలో ఆపిన తన కారు వద్దకు అమలను ఎత్తుకు వచ్చాడు. కారు డోర్ తెరిచి వెనుక సీటులో పడుకోబెట్టాడు అమలను. తనెళ్ళి డ్రైవింగ్ సీట్ లో కూర్చున్నాడు.

శరవేగంతో కారు ముందుకు దూసుకుపోయింది.

# 3

"ఎవరు నీవు? నన్నెందుకు తీసుకొచ్చావు?" అమల కోపంగా అడిగింది వికృతాకారుడిని.

"నేనెందుకు తీసుకొచ్చిందీ చెపుతాను. నా పేరు భగవాన్. నే చెప్పింది జాగ్రత్తగా విని ఆచరిస్తే నీకు మేలు జరుగుతుంది. కాదంటే నీ తల్లి తండ్రులను కట్టి దీసుకువచ్చి వారిముందు, నిన్ను పదిమంది రేప్ చేసేటట్లు చేస్తాను. అది చూచి నీకన్నా ముందే వాళ్ళు గుండె ఆగి చస్తారు. ఆ తర్వాత నీ కళ్ళముందే మీ అమ్మా నాన్నని చిన్న చిన్న ముక్కలుగా నరికి..."

"ఆపండి... నేనేం అపకారం చేశాను?"

"నువ్వుగాని మీ వాళ్ళుగాని నాకే అపకారం చేయ లేదు. నాకో పని నీవల్ల కావలసి వుంది. మంచిగా చెపితే

నీవు వినవు. నా ప్లాన్ సక్సెస్ కావాలంటే తప్పదు నీ ఎడల కఠిన చర్య తీసుకోవటం,'' భగవాన్ అంటూనే చప్పట్లు చరిచాడు.

పక్క గదిలోంచి పదిమంది వస్తాదుల్లాంటి యువకులు వచ్చారు.

''వీళ్ళనోసారి పరీక్షగా చూడు'' అన్నాడు భగవాన్.

అమల, భగవాన్ చెప్పకముందే వాళ్ళందరినీ చూచింది.

''ఊఁ, మీరెళ్ళవచ్చు'' భగవాన్ అనంగానే వస్తాదులు వెళ్ళిపోయారు గది విడిచి.

''వీళ్ళు రేప్ చేయటంలో ప్రవీణులు,'' భగవాన్ అన్నాడు అదేదో సాధారణ విషయం చెపుతున్నట్లు.

అమల ముఖం చిట్లించి మౌనం వహించింది.

''నే చెప్పిన పని చేస్తావా అమలా?''

అమల ఉలిక్కిపడింది.

''నా పేరెలా తెలుసు?''

''బాగుంది. అవసరార్థం నిన్ను తీసుకొచ్చినప్పుడు, అన్ని వివరాలు తెలుసుకోకుండా ఉంటానా? మీ అమ్మా నాన్నకు నీవు ఏకైక సంతానం. అందమొకటే కాదు, తెలివి తేటల్లోకూడా నీవే ఫస్ట్. బి. ఏ. చదువుతున్నావు. ముఖ్యమైన వివరాలు ఇవి. చాలుగా? మరి నా మాట వింటే నీకే అపకారం జరగదు. మా పని అయిపోయింతరువాత నీ వెళ్ళిపోవచ్చు.''

''ఏం పని, ఎన్నాళ్ళు పడుతుంది?''

''ఏంపనో చెపుతాను. ఎన్నాళ్ళు పడుతుందీ అన్నది ఖచ్చితంగా చెప్పలేను. నాలుగైదు నెలలు పట్టవచ్చు.''

"మా అమ్మ, నాన్నగారు నే ఇంట్లో లేకపోవటంచూచి దిగులుతో మంచం పట్టొచ్చు. నే కనపడలేదని పోలీసు రిపోర్టు ఇవ్వొచ్చు," అంది అమల ఓ రాయి విసురుతూ.

భగవాన్ గదంతా ప్రతిధ్వనించేటట్లు నవ్వాడు.

"నా సంగతి తెలియక తప్పుగా అంచనా వేశావ్ అమలా! ఈ భగవాన్ ఏ విషయంలోను పొరపాటుపడడు. నీకే ప్రమాదము జరగదని, కొన్ని కారణాలవల్ల మీ అమ్మాయిని తీసుకెళుతున్నామని, పోలీసు రిపోర్ట్ ఇవ్వకుండా వుంటే మీ అమ్మాయి మీకు దక్కుతుంది, అని మీ ఇంట్లో లెటర్ పెట్టి నిన్ను తీసుకువచ్చాను. నా మాట నీ వింటే నీ క్షేమ సమాచారాలు మీవాళ్ళకు...మీవాళ్ళ క్షేమ సమాచారాలు నీకు లెటర్స్ ద్వారా తెలుసుకునే ఏర్పాట్లు చేస్తాను. గోటితో పోయేదాన్ని గొడ్డలిదాకా లేకని నీ విషయంలో నాకెంతో నమ్మకం వుంది. చాటుగా నిన్నెంతో కనిపెట్టి స్టడీచేశాను."

అమల ఆలోచించింది.

ఈ భగవాన్‌గా డెవడో, మారుపేరు, మారు రూపం వేషధారి. తనవసరం చాలా వుంది వీడికి. కాదని మొండికేస్తే తన మాన ప్రాణాలే కాదు, తన తల్లిదండ్రులను కూడా నానాహింసలు పెట్టొచ్చు. వీళ్ళమాట వింటూనే వీళ్ళ ఎత్తుకు పైఎత్తు వేసి, ఈ కుంభకోణంనుంచి బయటపడాలి!

అమల ఓ నిర్ధారణకొచ్చింది.

"నేనేం చెయ్యాలో చెప్పండి," అడిగింది నెమ్మదిగా.

"గుడ్. వెంటనే ఓ నిర్ణయానికొచ్చావ్. చెప్పేది జాగ్రత్తగా విను...భుజంగరావ్ ఓ శ్రీమంతుడు. అతనికి

భార్యలేదు. ఒక్కతే కూతురు. పేరు సరోజ. ముమ్మూర్తులా నీలాగానే వుంటుంది. రోజా అంటారు అందరు. రోజా అంటే పంచప్రాణాలు భుజంగరావ్‌కి. రోజా, ప్రభాకర్ అనే అతన్ని ప్రేమించింది. భుజంగరావ్ ఆ ప్రేమకు ఒప్పుకుని పెళ్ళి ముహూర్తం పెట్టాడు. తెల్లారితే పెళ్ళి. తప్ప తాగున్న డ్రైవర్ కారుతోలటం, ఆ కారు యాక్సిడెంట్‌కి గురికావటంతో, కారులోవున్న ప్రభాకర్ అక్కడికక్కడే మరణించాడు.

రోజా పిచ్చిదయిపోయింది ఆ షాక్‌తో. ఓ మాట పలుకు లేదు. ఇరవై నాలుగు గంటలు గొణుగుతూ గోళ్ళు గిల్లుకుంటూ కూర్చునేది. భోజనఫలహారాలు తినిపించటం, స్నానం వగైరాలు దాసిది చూచేది. ఎందరో పెద్ద డాక్టర్లకి రోజాని చూపించాడు భుజంగరావు. షాక్‌తో మతి పోయింది కాబట్టి, ఏదయినా షాక్‌వల్ల - అదీ అదృష్టం ఉంటే మళ్ళీ మతి రావచ్చు. ట్రీట్‌మెంట్‌వల్ల బాగు కాదని తేల్చారు.

భుజంగరావు వృద్ధుడయిపోయాడు. రోజా పిచ్చిదయి పోయిందనే దిగులుతో కృంగిపొయ్యాడు. ఇలా వుండగా ఉన్నట్లుండి ఓ రోజు రోజా ఇంట్లోంచి మాయం అయింది. ఇది జరిగి ఆరు నెలలయింది. డబ్బు వెదజల్లి ఊరు వాడలు రోజాకోసం వెతికించాడు. రోజాను తీసుకొచ్చి అప్పగించిన వారికి లక్ష రూపాయలు ఇస్తానని ఫోటోతో సహా పేపర్లో ప్రకటించాడు. కాని ఇంతవరకు రోజాజాడ లేదు,'' ఓ నిమిషం ఆగాడు భగవాన్.

''ఇప్పుడు ఆరోజాని నేనే అని తీసుకెళ్ళి భుజంగరావ్ గారికి చూపి లక్షరూపాయలు తీసుకోవటమేనా మీ ప్లాన్?'' అమల అడిగింది.

"నో. నో. లక్ష నాకో లెక్క కాదు. భుజంగరావ్ కోటీశ్వరుడు. లంకంత ఇల్లు. నౌకర్లు చాకర్లు, చుట్టాలు, ఫ్రెండ్స్ కళకళలాడుతుంటుంది ఇల్లు. నాకు కావలసింది భుజంగరావ్ మొత్తం ఆస్తి!!

"ఎలా వస్తుంది ఆ ఆస్తి?"

"జరిగిన కథ చెప్పాను. జరగబోయేది విను. భుజంగ రావ్ ఇంట్లో ఎందరో చుట్టాలు, నౌకర్లు ఉన్నారు. వీళ్ళలో ఎవరైనా రోజాని మాయం చేశారేమో అని భుజంగరావ్ అనుమానం. అందరు నమ్మకమైవాళ్ళు ఆప్తులు. ఎవరిమీద తన అనుమానం వెళ్ళబుచ్చగలడు? ఈ మధ్య స్మాల్ గా హార్టెటాక్ వచ్చింది భుజంగరావుకి. చని పోతానని అనుమానం పట్టుకుంది. రోజా బ్రతికుండి ఏనాటి కయినా తిరిగివస్తే, ఆస్తి మొత్తం రోజాది. రోజా కనప డక పోతే యావద్దాస్తీ అనాధాశ్రమాలకు పోతుంది. అలా వీలునామా రాశాడు. కాబట్టి..."

"ఊ...కాబట్టి...? ఏం చేయాలి?"

"నీవు రోజా అవతారం ఎత్తి భుజంగరావ్ ఇంట్లో చేరాలి."

"భుజంగరావ్ గారు అనుమానిస్తే నా గతేంకావాలి?"

"కొద్దిగా నీ రూపం మార్చితే నీవు రోజావి అవి పోతావు. రోజా అలవాట్లు నీకు నేర్పుతాము. నీవా ఇంట్లో పిచ్చిదానివిగానే ప్రవేశిస్తావు కాబట్టి, ఎవరూ అనుమానిం చరు. నీకే అపకారం జరగకుండా నీ నీడలా నేను వుంటాను."

"రోజాగా ఆ ఇంట్లో నేను ప్రవేశించినంత మాత్రాన మీకెలా భుజంగరావ్ ఆస్తి వస్తుంది?"

"అవన్నీ మేము చూసుకుంటాము. నే చెప్పింది చేస్తావో, లేదో చెప్పు?" భగవాన్ కఠినంగా అన్నాడు.

అమల ఓ క్షణం ఆలోచించింది.

"ఏం చేయాలో చెప్పండి. చేస్తాను. కాని నా క్షేమం నావాళ్ళకు, నా తల్లితండ్రుల క్షేమం నాకు ఎప్పటికప్పుడు తెలియాలి."

"గుడ్ గరల్, తెలివిగల వాళ్ళెప్పుడూ ప్రాణానికి ముప్పు తెచ్చుకోరు. నీ క్షేమమే మా క్షేమం. నీ ప్రాణమే నా ప్రాణం. సరేనా? ఇక చేయాల్సింది, రోజా గడ్డం కింద అరంగుళం గాటు ఉంది. మెడమీద పుట్టుమచ్చ ఉంది. అలాంటి మార్పులు నీకు చేస్తాను. రోజా ప్రవర్తన అలవాట్లు నీకు నేర్పుతాము. సమయంచూచి ఆ ఇంట్లో నిన్ను ప్రవేశపెడతాము. నేను ఆ ఇంట్లోన్నే అనుక్షణం వెయ్యి కళ్ళతో నిన్ను కనిపెడుతూ వుంటాను. కాని నన్ను నీవు గుర్తించలేవు. ఇప్పుడు నేను మారు వేషంలో వున్నాను. ఆ ఇంట్లో సగంమంది నావాళ్ళు. పిచ్చి పిచ్చి వేషాలు వేయవద్దు. వెంటనే నాకు తెలిసిపోతుంది. జాగ్రత్త."

"అలాగే మీరు చెప్పినట్లే వింటాను. మరి మీ రెవరయి నదీ తెలియంది మావాళ్ళకి నాకు మధ్య లెటర్స్ ఎలా చేరవేస్తారు?" అమల అనుమానం వెళ్ళబుచ్చింది.

"అన్ని ఏర్పాట్లు సవ్యంగా చేసి, అన్ని విషయాలు విశదీకరించి మరీ నిన్ను ఆ ఇంట్లో ప్రవేశపెడతాము. పిచ్చి దానివిగా-నటించటం నీవంతు. మిగిలిన పని పూర్తిచేయటం మా వంతు. నీ ఆమోదం పూర్తిగా ఉందిగా?"

"అలాగే. చెప్పండి" లోలోపల మండిపోతున్నా నవ్వుతూ అంది అమల.

భగవాన్ ఒక్కొక్కటీ వివరంగా చెపుతుంటే అమల "ఊ" కొడుతూ మధ్య మధ్య తనకొచ్చిన అనుమానం తీర్చుకుంటూ కూర్చుంది.

## 4

భుజంగరావ్ గారింటికి అమల వచ్చి సరీగా వారం అయింది.

అమల ధైర్యస్తురాలే అయినా, తల్లితండ్రులకు దూరంగా, పరాయి ఇంట్లో పిచ్చిదానిలా...తనే పోయి దొరికిన కూతురనుకుంటూ వెర్రి భ్రమతో ఆనందం పొందుతున్న భుజంగరావ్ గారిని మోసంచేస్తూ...ప్రతినిమిషం తనని పలకరించే ఇంట్లో బంధువులు నౌకర్లు, ఓ నాటి రోజా ఫ్రెండ్స్...అందరి మధ్య సతమతమవుతూ రోజులు గడుపుతూంది. తను భగవాన్ చెప్పిన రేఖలు బాగా గుర్తుంచుకుంది. వీరిలో భగవాన్ ఉన్నాడు. కాని ఎవరు భగవాన్ అయినదీ తెలియటంలేదు.

అమ్మా, నాన్న, ఫ్రెండ్స్, కాలేజీ, సినిమాలు, షికార్లు బి.ఏ. పరీక్షలు—అన్నీ గుర్తొస్తున్నాయి అమలకి. అందుకే ఒంటరిగా గదిలో కూర్చుని వెక్కి వెక్కి ఏడుస్తున్నది.

భుజంగరావ్ నిశ్శబ్దంగా గదిలోకి వచ్చాడు. అమల పక్కనే కూర్చుని అమల భుజంమీద చెయ్యివేశాడు.

"ఎందుకు తల్లీ ఏడుస్తున్నావ్? నిన్నెవరయినా ఏమన్నా అన్నారా? చెప్పు తల్లీ, వాళ్ళను ముక్కలు చేయిస్తాను."

చివ్వున తల ఎత్తింది అమల. కన్నీళ్ళు తుడుచుకునే ప్రయత్నం చేయలేదు. తెల్లని తెలుపు వెండిరంగు తల కట్టు. పండుటాకులా ఉన్న భుజంగరావ్ ప్రపంచంలో

ప్రేమనంతా కళ్ళల్లో నింపుకుని తనవైపు చూస్తుంటే అమల నోరు తెరవలేకపోయింది.

"చెప్పు తల్లీ! ఎందుకు కన్నీరు కారుస్తున్నావ్?" భుజంగరావు, అమల కళ్ళు తుడుస్తూ అడిగాడు.

'మిమ్మల్ని మోసం చేస్తున్నందుకు, నా తల్లితండ్రులను చూడ నోచుకోగలనో లేదో అని...' అమల అనుకుంది.

"నేను... నేను ... చచ్చిపోతాను ... అందుకేడుస్తున్నాను. ఇంకా బాగా ఏడవనా?" అమల పిచ్చిధోరణిలో చేతులు తిప్పుతూ అంది.

"అలా అనొద్దు తల్లీ, నే చూడలేను. నువ్వు నా కళ్ళె దుంటు ఉన్నావని, అదే వెయ్యివరహాలని ఆనందిస్తున్నాను. క్షణం నీవు దూరమయితే ఇహపై నేను బ్రతకను తల్లీ!" కళ్ళనీళ్ళతో అన్నాడు భుజంగరావు.

"ప్రభా! ప్రభ, దేముడూ రేగే ప్రభ" పిచ్చిగా అన సాగింది అమల.

పక్కగదుల్లోంచి మేనేజరు రామచంద్ర, దూరం. చుట్టం అయిన శంకరం వచ్చారు.

రామచంద్ర, శంకరం ఈ ఇంట్లో వున్న మరి ఇద్దరు భగవాన్ ఎత్తు, లావుతో వుంటారు. వీళ్ళల్లో యెవరో ఒకరు భగవాన్. అంతవరకూ ఖాయం. ఎవరు తనని తీసుకొచ్చిన భగవాన్?

"బాబుగారూ! అమ్మాయిగారికి పిచ్చి ఇదివరకటి కన్నా ముదిరింది. మళ్ళీ ఇంట్లోంచి వెళ్ళిపోతారేమో? గొలుసుతో ఓ కాలు కట్టేసి ఉంచితే మంచిది," మేనేజరు రామచంద్ర అన్నాడు భుజంగరావుతో.

అమల ఉలిక్కిపడింది.

"మనమంతా లేమా? ప్రతి నిమిషం చూస్తూ రోజాని కాపాడటమే, కాళ్ళూ చేతులు కట్టమని యేం సలహా ఆండి?" శంకరం అన్నాడు.

"నా కెవరూ, ఏ సలహాలు ఇవ్వకండి. నా తల్లి ఎన్ని పిచ్చిపనులు చేసినా జాగ్రత్తగా చూడటమే మీ పని. అంతే," కఠినంగా అన్నాడు భుజంగరావ్.

'అమ్మయ్యా' అనుకుంది అమల. ఈ గదుల్లో తిరగ టానికి లేకుండా కాళ్ళూ, చేతులు కట్టి పడేస్తే అంత కన్నా వేరే నరకంలేదు.

"మీరంతా వెళ్ళిపొండి. లేకపోతే నే నేడుస్తాను. ఆ...అంతే," అంది అమల పిచ్చిగా చూస్తూ.

"వద్దు తల్లీ! నీవు కళకళలాడుతూ వుండటమే నాకు కావలసింది. నీ కంట నీరు చూడలేను. పద శంకరం, పద రామచంద్రం" భుజంగరావ్ లేస్తూ అన్నాడు.

"నా ప్రభ...నీ ప్రభ ... అంతులేని ప్రభ ... ఆకాశ మంత ప్రభ..." అమల చేతివేళ్ళు లెక్కపెడుతూ తనలో తను అనుకోసాగింది.

జాలిగా అమలను చూస్తూ ముగ్గురూ గదిలోంచి వెళ్ళి పోయ్యారు.

అమల ఆలోచిస్తూ కూర్చుంది.

ఆ భగవాన్ గాడు చెప్పినట్లు నటిస్తే తన తల్లితండ్రు లకు తనకి ఏ అపాయం ఉండదు. ఇలా ఎంతకాలమో? దీని వెనుక కథాసూత్రధారి ఆపై పరమాత్ముడికే ఎరుక. తను క్షేమంగా ఉన్నట్లు రాత్రిపూట లెటర్ రాసి కిటికీ సందులో ఉంచింది. తన తండ్రి తనకు రాసిన లెటర్ ఆ మర్నాడు కిటికీ సందులో ఉంది. ఎవరు, ఎట్లా యీ ఇంద్ర

జాలం చేస్తున్నారు? నాన్నగారు లెటర్‌లో 'తల్లీ అమలా! నీ క్షేమమే మాకు కావలసింది. నీవు రాసిన ఉత్తరం అందినది. మళ్ళీ ఇంకో ఉత్తరం రాస్తాను. ఇరుగు పొరుగుతో నీవు ఊరికి వెళ్ళినట్లు చెప్పాము. అమ్మ ఖులాసా.'

ఇదీ నాన్నగారి లెటర్‌లో సారాంశం. నాన్నగారి హాండ్ రైటింగ్ తనకి బాగా తెలుసు. ఈ భగవాన్ గాడు ఈ విషయంలో తన్ని మోసం చేయటంలేదు.

భగవాన్ చెప్పిన ప్రకారం ఆ రోజు తను చినిగి పీలిక లైన చీర కట్టుకుని రోడ్డుపక్కగా కూర్చుంది. కూరలు తెస్తున్న నౌకరు తన్ని చూచి భుజంగరావ్ కూతురు సరోజగా గుర్తించాడు. తను పిచ్చిదానిలా రానురాను అంటున్నా బలవంతాన రిక్షా ఎక్కించి, ఈ ఇంటికి తీసుకొచ్చాడు. నౌకరు కంట తను పడేటట్లు ప్లాన్ పన్ని భగవాన్ చేశాడా? లేక నౌకరుకూడా ఈ విషవలయంలో వాడా?

"సరోజమ్మగారూ! తల దువ్వుతాను," అంటూ దాసీ నర్సమ్మ నూనెసీసా, దువ్వెన,అద్దంతో గదిలోకి వచ్చింది.

"ఎవరి తల?" అంది అమల.

"మీ తలే నమ్మగారూ!"

"సరే దువ్వు. జాగ్రత్త, సరీగా పదిజడలెయ్యాలి."

"మీారెట్టా చెపితే అట్టాగే ఏస్తానమ్మగారూ?"

"మంచి పిల్లవు, నీవు నాకు నచ్చావ్," అంది అమల యాభయ్యో పడిలోవున్న నర్సమ్మతో.

తన్ని పిల్ల అంటుంటే నర్సమ్మకి ఏడ్వాలో, నవ్వాలో అర్థం కాలేదు. జాలిగా అమలని చూసి అమల జడ విప్పుతూ కూర్చుంది.

అమల అద్దం తీసుకుని తన ముఖం చూచుకుంది అద్దంలో. ఆశ్చర్యపోయింది.

గడ్డం దగ్గర గంటు. మెడమీద పైసా అంత పుట్టు మచ్చ. కనుబొమలు తనకి వత్తుగా వుంటాయి. కాని ఇప్పుడు సన్నగా వున్నాయి. తను అమలే కాని పోలికల్లో కొంత తేడా ఉంది.

"అమ్మగారూ! అద్దంలో చూచుకుంటున్నారా?" అంది నర్సమ్మ.

"ఊ చూస్తున్నాను... చూస్తున్నాను... ఈ అద్దంలో పిల్ల నేనూ కాదు, నీవూ కాదు. ఎవతి? కోతిముఖంది..." అంది అమల.

"పూర్వజన్మలో ఏ పాపమో గాని, బంగారంలాటి తల్లి బ్రతుకు ఇలా అయింది," అంది నర్సమ్మ.

అమల మాట్లాడలేదు. అద్దంలో తన రూపం చూసుకుంటూ కూర్చుంది.

# 5

"తల్లీ అమలా,

నీవు రాసిన ఉత్తరం అందింది. అమ్మ కులాసా! నిన్ను ఒక్కసారి చూడ్దామని వుంది. కాని...నీ గురించి దిగులు పడవద్దని రాశావు. ఆ ధైర్యంతో ఉన్నాము. భగవాన్ అనే అతను నాకు పదివేలు వద్దంటున్నా ఇచ్చాడు. మా పని త్వరలో పూర్తి అవుతుంది, మీ అమ్మాయిని జాగ్రత్తగా మీ కప్పగిస్తామని అర్ధరాత్రి వచ్చి చెప్పాడు. నీ ఫ్రెండ్ మోతీ కులాసాగానే వుంది. మోతీతో కూడా నీవు ఊరికెళ్ళినట్లు చెప్పాము. ఉత్తరాలు రాస్తూ ఉండు. నువ్వసలే దుడుకుపిల్లవి. తెలివిగా ఏదో చేయబోయి అప

దలో ఇరుక్కోకు. నీకు అపకారం జరిగితే నేనూ అమ్మా భరించలేము. ఉంటా. అమ్మ నిన్ను అడగమంది.

మీ నాన్న,
పరంధామయ్య."

లెటర్ చదివిన అమల కసిగా 'ఎంత మోసం!' అనుకుంటూ పళ్ళు కొరుక్కుంది.

"మోతీ అనే స్నేహితురాలు తనకి లేదు. ఈ భగవాన్ గాడు తను రాసే లెటర్స్ నాన్నగారికి, నాన్నగారు రాసే లెటర్స్ తనకి నిజంగా అందిస్తున్నాడా? లేక వాడు ఆడే నాటకంలో ఇదీ ఓ భాగమా?" అని ఆలోచించి చిన్న ప్లాన్ పన్నింది. నిజంగా తాను రాసే లెటర్ నాన్నగారికి అందితే, "మోతీ గురించి రాశావు? ఆ నీ స్నేహితురాలెవరో మాకు తెలియదు. ఎందుకిలా రాశావు?" అంటూ తప్పక రాసేవారు నాన్నగారు.

"మోతీ అనే స్నేహితురాలు నీకు లేదు. ఎందుకిలా మీ నాన్నగారికి రాయవలసి వచ్చింద్," అంటూ గద్దించుతూ మరో లెటర్ కిటికీలో ఉంచేవాడే భగవాన్.

మధ్యమధ్య ఇలా చెయ్యి, అలా చెయ్యి. ఈ విషయంలో నిన్న పొరపాటు చేశావు. జాగ్రత్తగా ప్రవర్తించు అంటూ భగవాన్ లెటర్స్ కిటికీలో ఉంచుతూనే వున్నాడు. కాబట్టి భగవాన్ ఆడుతున్న లెటర్స్ నాటకం ఇది. ఏం చేయాలి?

అమ్మ, నాన్నగారికి నా విషయం అసలు తెలియదు. నేనేమైపోయానో అని దిగులుపడుతూ ఉండివుంటారు. పోలీసు రిపోర్ట్ ఇచ్చారేమో అని ఆశ పడదామా అన్నా భగవాన్ గాడు అంతదూరం రానీయడు. బెదిరించి నన్ను లొంగదీసుకుని పిచ్చిదాన్ని చేశాడు. అక్కడ నాన్న

గారిని మరోవిధంగా బెదిరించి నా గురించి పోలీసులదాకా పోకుండా చేసివుంటాడు.

'భగవాన్! తాటిని తన్నేవాడుంటే తల తన్నేవాడు ఆపై వుంటాడు. భుజంగరావ్ గారు ఉత్తములు. వారికి ద్రోహం తలపెట్టావు. వారి ఆస్తి చేజిక్కించుకోటానికి బెదిరించి పావులా నన్ను వాడుకుంటున్నావు. అంతేగాక, నీ మాట గత్యంతరం లేక వింటున్నందుకు నాటకంపై నాటకం ఆడుతున్నావు. జరిగింది భుజంగరావ్ గారితో ఒక్కమాట చెపితే మంచు విడిపోయినట్లు కథ విడిపోతుంది. భుజంగరావ్ గారితో నే చెపుతూవుండగా విని నన్నో, భుజంగరావ్ గారినో పై లోకానికి తరలిస్తావు. నీవాడుతున్న నాటకానికి పైనాటకం ఆడి నీ అంతు తేల్చకపోతే నా పేరు అమల కాదు.'

చాణుక్య శపథంలా తనలో తాను శపథం చేసింది అమల.

'ఏం చేయాలి? ఏం చేస్తే ఈ ఇంట్లోంచి బైట పడతాను. ఏ విధంగా ఈ ఇంట్లోనే దాగున్న మోసగాడైన భగవాన్ గుట్టు బైటపడుతుంది?' తీవ్రంగా ఆలోచిస్తూ కూర్చుంది అమల.

లెటర్‌ని భద్రంగా భగవాన్ అంతకు క్రితం చెప్పిన విధంగా ఫ్లవర్ వాజ్ లోపల వుంచి ఫ్లవర్ వాజ్ లో పూల గుత్తి సర్దింది.

"తిరుగులేని పథకం ... భగవంతుడు బైటకొచ్చే ప్లాను," ఆలోచిస్తూ కూర్చుంది అమల.

## 6

"తల్లీ రోజా! మన కృష్ణ వస్తున్నాడమ్మా," ఓ లెటర్ చేతిలో పట్టుకుని భుజంగరావ్, అమలవద్దకు వచ్చి

సంతోషంగా చెప్పాడు.

"కృష్ణా! ఎవరు?" గబుక్కున అమల అడిగి తన పొరపాటు తెలుసుకుంది. వెంటనే పిచ్చిగా చూస్తూ వుండిపోయింది.

"అదేనమ్మా నీ బావ కృష్ణ. అమెరికాలో చదువు ముగించుకుని వస్తున్నాడు. నా చెల్లెలి కొడుకు. 'బావ... బావ' అంటూ ఎంతల్లరి చేసేదానివి? ప్రభాకర్ మధ్యలో రాకపోతే కృష్ణ, నీవు పచ్చని దాంపత్యంతో నా కన్నుల పండుగగా ఉండేవారు. ప్చ్."

"ఎవడీ కృష్ణ, ఏమా కథ? ప్రభాకర్, వింటున్నావా? కృష్ణట కృష్ణ. హరేరామ హరేరామ, హరేకృష్ణ అరే కిట్టా, హరేప్రభ అరెరె ప్రభ," అమల చప్పట్లు చరుస్తూ అంది.

భుజంగరావ్ గారికి దూరపు చుట్టం, అల్లుడు వరస అయిన సుందరమూర్తి అమల గదిలోకి వచ్చాడు. సుందరమూర్తి ఎత్తు, లావు భగవాన్‌లాగానే వుంటాడు. భగవాన్ అవునో, కాదో ఆ పరమాత్ముడికి తెలియాలి.

"మామయ్యా!" సుందరమూర్తి అమలవైపు చూస్తూ పిలిచాడు.

"ఏంటి సుందరం?"

"కృష్ణ మామూలు డాక్టర్ కాదు. బ్రెయిన్ స్పెషలిస్ట్. అమల పిచ్చి కుదర్చవచ్చు."

"అదేరా సుందరం నా ఆశ. పెద్దపెద్ద డాక్టర్లు రోజా తల్లి పిచ్చిని కుదర్చలేమన్నారు. మన కృష్ణ ఫారెన్‌లో చదివి వస్తున్నాడు. నా తల్లి బాగయి మామూలు మనిషవుతుంది."

"కృష్ణ నాకు బావ అవుతాడు. అతను బ్రెయిన్‌కి సంబంధించిన పెద్ద డాక్టరు. నా పిచ్చికి ఏమి ట్రీట్‌మెంట్ ఇస్తాడో! భగవంతుడా ఈ ఇంట్లోంచి బైటపడే మార్గం లేదా? మాయదారి భగవాన్‌గాడు బైటపడడా? ఏమిటీ దారి?"

"ఏంటమ్మా ఆలోచిస్తున్నావ్?"

'కృష్ణప్రభా, రామప్రభా ... ఇంకేం ప్రభుంటుం దబ్బా?' భుజంగరావ్ మాట వినిపించుకోకుండా బుగ్గన వేలేసుకుని అంది అమల.

భుజంగరావ్ బాధగా సుందరమూర్తి వైపు చూచాడు,

"రంగారావ్‌సాబ్, ఫోన్‌లో అర్జంటుగా పిలుస్తున్నారు. మీతోనే మాట్లాడాలిట" శంకరం వచ్చి చెప్పాడు.

భుజంగరావ్, సుందరమూర్తి గదిలోంచి వెళ్ళిపోయ్యారు.

శంకరం గదిలోంచి వెళ్ళలేదు. అటూ ఇటూ చూచి అమలవద్దకు వచ్చాడు. అమల ఎదురుగా నిలిచి భుజంమీద చెయ్యి వేశాడు.

'వీడే భగవాన్‌గాడు' అనుకుంది అమల.

శంకరం చటుక్కున అమలమీదకు వంగి గాఢంగా బుగ్గమీద ముద్దు పెట్టుకున్నాడు. శంకరం చెయ్యి అమల భుజంమీదనుంచి కిందకు పాకింది. అమల చెయ్యి చాచి ఫెడేల్‌మని శంకరం ముఖంమీద కొట్టింది. సరీగా ఆ దెబ్బ ముక్కుమీద తగిలింది.

"అబ్బా" అంటూ శంకరం చేత్తో ముక్కు తడుముకుంటూ కోపంగా అమలవైపు చూచాడు.

అమలకు ఇల్లంతా తిరగటానికి స్వేచ్ఛ వుంది. కాపోతే భగవాన్ ముందే చెప్పాడు. సరోజ యొక్క వకాలం తన గదిలోనే గడిపేది. రోజు మొత్తంమీద మూడు నాలుగు సార్లకన్నా బైటకు తానంతట తాను వచ్చేది కాదని.

"వీడు చూడు ప్రభా! నన్ను ముట్టుకున్నాడు. వెధవ గాడిద. పందికొక్కు" పెద్దగా అంటూ, అమల గది లోంచి బైటకు వచ్చింది.

"పిచ్చిముండ. దీనికేం తెలుస్తుంది. ఇంటినిండా మనుషులు ఉండబట్టి నా చేతికింద ఇంకా నలగలేదు. అందంగా ఉంటుందని ఓ ఛాన్స్ ఈ పిచ్చిలో చూద్దామనుకుంటే ముఖం పగలకొట్టింది. పిచ్చిబలం అంటారు ఇదే కావచ్చు. ముఖం అదిరిపోయింది."

గదిలోంచి బైటకొస్తూ అనుకున్నాడు శంకరం.

# 7

"...గారికి,

నా పేరు అమల. భుజంగరావ్ గారి ఆస్తి కాజేయటానికి ఇంట్లోంచి మాయమయిన సరోజ స్థానంలో సరోజ పోలికలు గల నన్ను, భగవాన్ అనే అతను తీసుకొచ్చి బెదిరించి నియమించాడు. అందరూ నన్ను సరోజ అనే అనుకుంటున్నారు. మా నాన్న అమ్మగారి పేర్లు...మా అడ్రస్...ఇది.

నేను మోసం చేయటానికి ఈ ఇంట్లో ప్రవేసించలేదు. భగవాన్ బెదిరింపుకి లొంగిపొయ్యాను. దైవంలాటి భుజంగరావ్ గారిని మోసగించలేక నా వాళ్ళకు దూరంగా వుండలేక, ఈ నాటకం ఎన్నాళ్ళో తెలియక తెగించి ఈ లెటర్ రాస్తున్నాను. భుజంగరావ్ గారితోనే సమయం

చూచి చెప్పొచ్చు. భుజంగరావ్ గారి పక్కన ఎప్పుడూ ఎవరో ఒకరు వుంటున్నారు. ఈ ఇంట్లో నలుగురు వ్యక్తులు భగవాన్‌లాగానే వున్నారు. ఆ నలుగురిలో ఒకరు భగవాన్.

నాకు నమ్మకం కలిగినవారికి ఈ లెటర్ ఇస్తున్నాను. ఈ లెటర్ భుజంగరావ్ గారికి అందిస్తే, వారు మీకు బహుమతి ఇవ్వొచ్చు. వారు చాలా దయా స్వభావులని తెలిసిపోతూనే వుంది. తర్వాత మోసగాడు ఎవరైనదీ భుజంగరావ్ గారే చూసుకుని నన్ను రక్షిస్తారు.

ఈ నా ఆలోచనే ఈ లెటర్ రాయటానికి కారణం.

భుజంగరావ్ గారు నాటకానికి పై నాటకం ఆడితే గాని భగవాన్ గాడు బైట పడడు.

ఇట్లు
సరోజగా చలామణీ అవుతున్న అమల."

అమల లెటర్ చదివి "బాగుంది. సరీగానే రాశాను. ఇహ ఈ లెటర్ చేర్చే విధం చూడాలి. ఈ ఇంట్లో ఎవరికి అందించాలి?" అనుకుంది.

అమల గదిలో అలమరలో అందమైన బొమ్మలతో అలంకరించి ఓ అర వుంది. బొమ్మల వెనుక పెన్ను కాగితాలు వుంచాడు భగవాన్ అమల లెటర్స్ రాయటానికి. అవి వుపయోగించి తాననుకొన్న ప్లాన్ ప్రకారం అమల లెటర్ తయారుచేసింది. లెటర్ చిన్న మడత పెట్టి జాకెట్లో దోపుకుని గదిలోంచి బైటకు వచ్చింది.

అమల పిచ్చిగా చేతులు తిప్పుతూ గొణుక్కుంటూ వరండాలోకి వచ్చింది.

వరండాలో ఏవో ఫైల్స్ చూస్తున్న శంకరం, అమలను చూచి చటుక్కున లేచి నుంచున్నాడు.

'శంకరం, భగవాన్ అయివుండడు. ఎందుకంటే తనని తీసుకొచ్చిన భగవాన్ పదిమందిచేత రేప్ చేయిస్తానని బెదిరించాడుగాని, తన శరీరంమీద చెయ్యి వెయ్యలేదు. అయినా శంకరంకి లెటర్ ఇవ్వకూడదు. తను సరోజ అయినా, అమల అయినా తన రూపంమీద అమిత మోజు. ఎప్పుడు చూచినా శంకరం కళ్ళు తనని కాంక్షతో కామంతో చూస్తాయి.

నాకు లొంగక పోయావా? భగవాన్‌తో చేతులు కలుపుతా నంటే మొదటికే మోసం వస్తుంది. ఊహూ. ఈ శంకరం తన పనికి ఏ విధంగా పనికి రాడు.'

అమల కళ్ళార్పకుండ శంకరంని చూస్తూ అనుకుంది.

"బాబాయ్, ఈ పిచ్చిదానికి మొన్న జరిగింది ఇంకా గుర్తున్నదల్లే వుంది. కళ్ళార్పకుండా తీక్షణంగా ఎలా నావైపు చూస్తున్నదో? మీద పడి రక్కినా రక్కుతుంది. పిచ్చిది. ఏమంటానికి వీలులేదు."

భయంతో అమలను చూసి, గబగబా ఫైల్ మూసేసి, వరండాలోంచి వెళ్ళిపోయాడు శంకరం, ఎవరో తరిమినట్లే.

అమల నవ్వుకుంటూ వంటగదిలోకి వచ్చింది.

దాసీ నర్సమ్మ, వంట నాయర్ తగ్గు స్వరంతో మాట్లాడుకుంటున్నారు. అమల రావటం చూసి, చటుక్కున మాటలాపేశారు. నాయర్ కనుసైగ గమనించి నర్సమ్మ వంట గదిలోంచి ఏదో పనున్నదన్నట్లు బైటకు వెళ్ళింది.

నాయర్ తలెత్తి అమలవైపు చిరునవ్వుతో చూచాడు.

'నర్సమ్మ, నాయర్ నమ్మకస్తులయిన నౌకర్లు అనుకుంది. కాని తను పిచ్చిది అని తెలిసికూడా వాళ్ళిరువురు

తను రాంగానే చటుక్కున మాట ఎందుకు ఆపేయాలి నాయర్ కనుసైగ ఎందుకు చేయాలి? అది గ్రహించి నర్సమ్మ ఎందు కెళ్ళిపోవాలి? ఈ ఇంట్లో వీ రిరువురి గూఢుపురాణి ఏమిటి? ఇంట్లో సామానులు చాటుగా చేరవేసే ఇంటి దొంగలా? భగవాన్ గాడి మోచేతి నీళ్ళు తాగి పడున్న మోసగాళ్ళా?'

తను రాసిన లెటర్ నాయర్ కిగాని నర్సమ్మకిగాని ఇచ్చే ప్రయత్నం మానేసి, ఆలోచనలో పడిపోయింది అమల.

"ఏంటమ్మాయిగారూ! ఏం కావాలి?" అన్నాడు నాయర్ కుక్కర్ మీద వెయిట్ పెడుతూ.

అమల మాట్లాడలేదు. గోళ్ళు కొరుక్కుంటూ వుండి పోయింది.

"ఇదో పిచ్చిమాలోకం. గొప్పోళ్ళింట్లో కుక్కలకి రాజభోగమే, పిచ్చిముండలకి స్వర్గసౌఖ్యాలే," నాయర్ గొణిగాడు.

'తిన్న ఇంటి వాసాలు లెక్కపెట్టే వెధవ. ఈ ఆస్తికీ కాబోయే యజమానురాలు, యజమాని కూతురు, ఈ చవటకి పిచ్చిముండ అయింది. లక్షాధికారి కూతురుగా పుట్టికూడా ఏమి సౌఖ్యం అనుభవించావు సరోజా?' అనుకుంది అమల.

"ప్రభాకర్ గారు... గారు... వచ్చారా?" కనుగుడ్లు మిటకరించి అడిగింది అమల.

"ఆ...ఆ...వచ్చాడు. వచ్చారు. సరాసరి కళ్ళు మూసుకుపోండి. కనపడతారు, ప్రభాకరుడు" నాయర్ వ్యంగ్యంగా అన్నాడు.

"ఇదిగో కళ్ళు మూసుకుని నీవు చెప్పినట్లే వెళుతున్నా. ప్రభా, కనపడక పోయాడో, జాగ్రత్త నీ ముక్కు చెవులు కోసి పక్కలకు వేస్తా" అని అమల కళ్ళు తెరుచుకునే రెప్పలయినా ఆర్పకుండా గదిలోంచి బైటకు వచ్చింది.

'నాయర్‌ని, నర్సమ్మని, తనని ఈ ఇంట్లో ప్రవేశ పెట్టిన నౌకర్‌ని, శంకరంని, ఎవరిని నమ్మటానికి లేదు. మరి ఎవరిని నమ్మితే పనవుతుంది?' ఆలోచిస్తూ అమల ముందు గదిలోకి వచ్చింది.

ముఖ్యమైన వాళ్ళతో అతి ముఖ్యమైన పనులు మాట్లాడటానికి వరండా పక్కన ఉన్న ముందు గది వుపయోగిస్తుంటాడు భుజంగరావ్.

గది లోపలికి అడుగుపెట్టి ఆగిపోయింది అమల. గిరుక్కున వెనుతిరిగి పోదామనుకుంది. కాని ఆ ప్రయత్నం విరమించి, అక్కడే నుంచుంది.

"రోజా తల్లీ! రామ్మా! ఇంతకుముందే మన కృష్ణ వచ్చాడు. నీ బావమ్మా!" భుజంగరావ్ సోఫాలోంచి లేచి అమల వద్దకు వస్తూ అన్నాడు.

"రోజీ!" అన్నాడు కృష్ణ సోఫాలోంచి లేచినుంచుని.

అమల పిచ్చివాలకంతో కృష్ణని ఎగాదిగా చూస్తూ నుంచుంది.

సీమ దొరలా ఉన్నాడు కృష్ణ. ఖరీదైన సూటు, మంచి పర్సనాలిటి. నల్లని నొక్కుల దుబ్బు క్రాపు. గుబురుగా ఉన్న సైడ్‌లాక్స్. ఉండీ లేనట్లు సన్నని మీసకట్టు. ఎర్రటి పెదవులు విశాలమైన నుదురు. చురుకైన కళ్ళు. సూటిగా ఉన్న ముక్కు. అందము, హుందాతనము అతని సొత్తయినట్లున్నది.

"సరోజ, ఈ కృష్ణను కాదని ప్రభాకర్‌ని ప్రేమించిం దంటే, కృష్ణకన్నా ప్రభాకర్ అందమైనవాడా?" అమల ఆలోచిస్తున్నది.

"దా...తల్లీ!" అని అమల చెయ్యి పుచ్చుకుని సోఫా వద్దకు తీసుకెళ్ళాడు. భుజంగరావు.

ముగ్గురు సోఫాల్లో కూర్చున్నారు.

"రోజా! నన్ను గుర్తుపట్టావా? నీ బావ కృష్ణని." అన్నాడు కృష్ణ అమలచెయ్యి తన చేతిలోకి తీసుకొని మృదువుగా నిమురుతూ.

అమల శరీరం గగుర్పొడిచింది. సిగ్గు వేసింది. పిచ్చివాల కంగా చూడటానికి అవస్థపడింది.

"కృష్ణా! నా తల్లి నీవంటే ఇష్టంగానే ఉండేదిరా. ఆ ప్రభాకర్ ఏ దుర్ముహూర్తాన కళ్ళపడ్డాడో ప్రేమపిచ్చిలో పడిపోయింది. కూతురనే మమకారం, నీ విశాలహృదయం వల్ల, వివాహానికి ఒప్పుకోటం అయింది. కాని...కృష్ణా, విధిరా విధి! పూర్తిగా నన్ను వంచించింది. సరోజ పూర్తిగా పిచ్చిదయిపోయిందిరా!"

భుజంగరావ్ గారి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

"గతం ఇప్పుడెందుకు మామయ్యా! ముందు జరగ బోయేది ఆలోచిద్దాం.

మీకు హార్టెటాక్ వచ్చిందన్న వార్త, రోజా ఇంట్లోంచి మాయంకావటం, విని భరించలేని బాధపడ్డాను. మామయ్యా! అప్పటికప్పుడు బయలుదేరి వద్దామనుకుంటే, నువ్వు రావద్దని గట్టిగా లెటర్ రాస్తివి. మీ అజ్ఞ మీరటం అప్పుడు ఇప్పుడు ఎప్పుడూ లేదు. మామయ్యా, నే వచ్చేశాను. ఇంకేవిధమైన వర్రీస్ పెట్టుకోకు. పూర్తి

రెస్ట్ తీసుకో. రోజా సంగతి నే చూచుకుంటాను. రోజాకి పిచ్చికాదు మామయ్యా పట్టింది. మన పూర్వీకులలో ఎవరికైనా పిచ్చి ఉంటే ఆ రక్తం రోజాలో వుంది కాబట్టి పిచ్చిదయిందని అనుకోవచ్చు. ఆ పిచ్చి కుదర్చటంకూడా కొంచెం కష్టమే.

ఇది ప్రభాకర్ పోయిన వార్తవిని షాక్ తగిలింది. షాక్ వల్ల తలకి గాయాలు తగలటంవల్ల వచ్చిన మెంటల్ షాక్‌కి చక్కని ట్రీట్‌మెంట్ ఉంది. రోజాని అన్ని పరీక్షలు చేసి మామూలు మనిషిని చేస్తాను. సరేనా మామయ్యా?''
అమలవైపు చూస్తూ అన్నాడు కృష్ణ.

అమల ఉలిక్కిపడింది.

'తనకి పిచ్చిలేదు, వెర్రిలేదు. ఈయనగారు పరీక్షచేస్తే తనగుట్టు బైటపడదుకదా? లేక తనకి పిచ్చి ఏ రకమైనదో తెలియక ఈయనగారి బుర్ర గిర్రున తిరిగిపోతుందో?'

''ఏంటి రోజా, నీలో నీవు నవ్వుకుంటున్నావు?'' కృష్ణ అడిగాడు.

ఆవులిస్తే పేగులు లెక్కపెట్టేరకంలా ఉన్నాడు ఈ కృష్ణమూర్తి. చాప్‌రే జాగ్రత్తగా ఉండాలి, అనుకుంది అమల ''హిహి హీహీ'' అంటూ ఓ పిచ్చినవ్వు నవ్వింది. గోళ్లు కొరుక్కుంటూ కూర్చుంది.

''ఇదీ వరసరా కృష్ణా!'' అన్నారు భుజంగరావ్ గారు.

భారంగా నిట్టూర్పు విడిచాడు కృష్ణ.

''మామయ్యా! రోజా ఇంట్లోంచి ఎలా వెళ్ళింది? ఎవరూ గమనించలేదా? చివరిసారిగా ఆ రోజు రోజాని ఎవరు చూశారు? రోజా లేనట్లు ఎంత సేపటికి గ్రహించారు. మళ్ళీ

రోజాని ఎవరు చూశారు? అప్పుడు ఎక్కడ ఏ పరిస్థితిలో ఉంది?"

కృష్ణ వివరాలు అడిగితే భుజంగరావ్ గారు చెప్పటం మొదలుపెట్టారు జరిగింది.

'బాప్ రే, ఇతగాడు సెక్రీయాటిస్ట్ మాత్రమే గాదు, నా పాలిట యముడు. జేమ్స్‌బాండ్ తాతలా వున్నాడు,' అనుకుంది అమల.

# 8

"........

కృష్ణవల్ల నీవేం భయపడవద్దు. కృష్ణవల్ల ఏ చిన్న రిస్క్ ఏర్పడ్డా మేము చూచుకుంటాము. మీ వాళ్ళకు లెటర్ రాయి. అందజేస్తాను. ఇంకెన్ని రోజులని ఆందోళన పడ వద్దు. నీవు ఇక్కడ క్షేమంగా ఉన్నావు. మీవాళ్ళు అచ్చట క్షేమంగా ఉన్నారు. త్వరలోనే మా పని పూర్తి చేసుకోవాలని తీవ్ర ప్రయత్నంలో వున్నాము. తెలివిగా మసులుకో. లేకపోతే వేరే చెప్పే పనేముంది. మీ నాన్న రాసిన లెటర్ దీనితో జతచేస్తున్నాను.

భగవాన్."

నాన్నగారు లెటర్ రాశారుట. వీడు ఎంత శ్రద్ధగా అందజేస్తున్నాడో? దొంగ వెధవ. పేరు భగవాన్, చేసేది తప్పుడుపనులు. ఈ ఇంట్లో అడుగుపెట్టి నెలకావస్తున్నది. అమ్మ నాన్నగార్లు ఎలా వున్నారో? నాగురించి ఏమనుకుం టున్నారో? తెలివిగా ఈ చెరలోంచి విముక్తి పొందుదా మని నేరాసిన లెటర్ ఎవరికి అందివ్వాలో అర్థంకాలేదు. అలాగే వుండిపోయింది. పోనీ కృష్ణ తెలివి కలవాడిగా అవుపిస్తున్నాడు ఇతనికి అందిద్దామంటే, ఆవేశంతో అప్పటికప్పుడు ఎగిరిపడే రకం. లాభంలేదు. ఈ ఇంట్లో

సగం మంది తిన్న ఇంటి వాసాలు లెక్క పెట్టేవాళ్ళే. ఏం చేయాలి? ఎలా బైటపడాలి?

—తీవ్రంగా ఆలోచిస్తున్నది అమల.

కృష్ణ పిల్లిలా చప్పుడు చేయకుండా అమల గదిలోకి వచ్చి తలుపులు లోపల గడియవేశాడు. అమల యెదుటి కొచ్చి నుంచున్నాడు.

"రోజా!" కృష్ణ పిలిచాడు తగ్గుస్వరంతో.

అమల ఉలిక్కిపడి "ఊ" అంది.

కృష్ణ నవ్వాడు. నిప్పులు కక్కుతూ అమల కళ్ళలోకి చూచి నవ్వాడు.

అమల రవంత భయంతో కృష్ణవైపు చూచి నలువైపులా చూచింది. తలుపులు లోపల గడియ పెట్టినట్లు, కావాలనే కృష్ణ తనవద్దకు వచ్చినట్లు గ్రహించింది. ఓ అడుగు వెనక్కు వేసింది. శంకరంలా పిచ్చిపని చేయటానికి కృష్ణ రాలేదు కదా?

"ఎవరు నువ్వు?" అమలవైపు తీవ్రంగా చూస్తూ అడిగాడు కృష్ణ.

అమల మౌనం వహించింది. గుండె టకటక కొట్టుకుంది. పిచ్చిగా కృష్ణవైపు చూసింది.

"నిన్నే అడిగేది? సరోజ ఏమయింది? నీ పేరేమిటి?"

"ప్రభా, హారహార ప్రభా!" అంది తెలివి తెచ్చుకున్న అమల.

"నోరు ముయ్యి. ప్రభట ప్రభ... నేను ఇక్కడికొచ్చిన మూడో రోజునే గ్రహించాను, నీవు రోజావి కాదని. పరీక్ష చేయటంతో నీ బ్రెయిన్ నిక్షేపంగా వుందని, నీ కలాంటి పిచ్చి లేదని తెలిసిపోయింది. మామయ్యకి చెపితే

మళ్ళీ హార్టెటాక్ వస్తుందో అని నోరు మెదపలేదు. రోజాకి తగ్గిపోతుందని అబద్ధం ఆడాను. ఎవరు నువ్వు? ఎందుకు రోజా స్థానంలో ఉండి నాటకం ఆడుతున్నావు?"

అమల మాట్లాడలేదు.

కృష్ణ చెయ్యెత్తి ఛళ్ళున అమల చెంపపై కొట్టాడు బలమంతా ఉపయోగించి.

అమలకి ప్రాణంపోయి తిరిగొచ్చింది. కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. "అబ్బా" అంది. చెంప చేత్తో తడుముకుంటూ.

"అబ్బా కాదు. నాలుగు వడ్డించానంటే నీ అబ్బ ఏ లోకంలో వున్నా తిరిగివస్తాడు. చెప్పు, ఎవరు నువ్వు?"

'నేను సరోజనే. మీరు పొరపడుతున్నారంటే, ఓహో! నీకు పిచ్చి ఉందీ, లేనిదీ యీమాటే చాలు తెలిసిపోతున్నది, అంటాడు. సరోజను కాదంటే, కథంతా చెప్పాలి. ఆ స్త్రీకోసం తెగించిన భగవాన్ అర క్షణంలో ప్రాణం తీస్తాడు. వాడికి వెయ్యికళ్ళు, పదహారువందల చెవులు వున్నాయి. ప్రస్తుతానికి మౌనం వహించటమే శ్రేయస్కరం.'

"ఏమిటి ఆలోచిస్తున్నావు? కట్టుకథ చెపుదామనా?"

అమల పెదవి కదపలేదు.

"నువ్వెవరో నాకు తెలియదు. సరోజవు మటుకు కాదు. చావగొట్టి, చెవులుమూసి ఈ క్షణాన నీ నోట్లోంచి నిజం కక్కిద్దును. మామయ్యకోసం ఊరుకున్నాను. సరే ఇప్పటికి వెళుతున్నాను. జాగ్రత్త! ఈ కృష్ణ ముందు నీ ఆటలు, నాటకం సాగవు గుర్తుంచుకో. రెండురోజులు టైమ్ ఇస్తున్నాను. నువ్వెవరివో నిజం చెప్పకపోయావా, ప్రాణం తీస్తాను" అని కృష్ణ తలుపు తీసుకుని బైటకు

వెళ్ళిపోయాడు.

చెంప తడుముకుంటూ చాలాసేపు అమల పిచ్చిదానిలా అలా ఉండిపోయింది.

'ఊహూ, లాభంలేదు. ఇటు చూస్తే సింహం, అటు చూస్తే పులి. బోనులో మేకపిల్లను నేను. తెగించాల్సిందే. ఈ దెబ్బతో చావో, బ్రతుకో తేలిపోతుంది. కృష్ణకు అంతా చెప్పేసి భగవాన్ ఉనికిని కనిపెట్టమని కోరాలి,' అనుకుంది అమల మొండి ధైర్యంతో.

ఉన్నట్లుండి అమలకు కరెంట్ షాక్ తగిలినట్లు అనుమానం వచ్చింది.

కృష్ణకూడా భగవాన్ అంత ఎత్తు, లావులో వున్నాడు. భగవాన్, కృష్ణ ఎందుకు కాకూడదు? నామీద అనుమానం కలిగి నిజం చెపుతానా, లేదా అని చిన్న ప్రయోగం నాపై జరిపివుంటాడు. ఈ మధ్యనే ఊరినుంచి వచ్చినట్లు నటించాడేమో? నెలరోజుల క్రితమే ఈ ఊరు వచ్చి భగవాన్ పేరుతో కృష్ణ నన్నెత్తుకొచ్చి వుంటాడు. అంతే, ఈ కృష్ణనుకూడా నమ్మకూడదు.

కృష్ణ, భగవాన్...భగవాన్, కృష్ణ.

కసిగా పళ్ళు నూరి సరికొత్త పథకం ఆలోచిస్తూ కూర్చుంది అమల.

# 9

"ఏడ్వకు తల్లీ! నే చూడలేను," బాధగా అంటూ భుజంగరావ్, అమల కన్నీళ్ళు తుడిచాడు.

"నా ప్రభ కావాలి, నా ప్రభను తెచ్చివ్వండి. లేకపోతే నే పోతాను. చచ్చిపోతాను. ఊ...ఊ..." అంటూ అమల పిచ్చిపిచ్చిగా వాగుతున్నది. భుజంగరావ్ వడిలో తలదూర్చుకుని వెక్కి వెక్కి ఏడుస్తున్నది.

భుజంగరావ్, "ఊరుకో తల్లీ, ఊరుకో" అంటున్న కొద్దీ అంతకంతకు పిచ్చిగా వాగటం, ఏడ్వడం ఎక్కువైంది అమలకు.

సుందరమూర్తి, శంకరం, నాయర్ ఏంచేయాలో తెలియక అయోమయంగా ఎక్కడివాళ్ళక్కడ నుంచుండిపోయారు.

"కృష్ణ లాన్‌లో పేపరు చదువుతూ కూర్చున్నాడు. పిలుచుకురా శంకరం," అన్నాడు భుజంగరావ్.

శంకరం పరుగున వెళ్ళాడు.

"కృష్ణ లేదు, గ్రిష్ణ లేదు. ప్రభను పిలుచుకురండి. ఫోండి. అంతా ఫోండి. ప్రభను తీసుకురండి, లేకపోతే చస్తాను. మీ అందరినీ చంపేస్తాను," అంటూ అమల సుందరమూర్తి మీదకు, నాయర్ మీదకు చేతులు చాచి భద్రకాళిలా వెళ్ళింది.

నాయర్ భయంతో ఓ అడుగు వెనక్కువేశాడు.

సుందరమూర్తి బిగుసుకుపోయినట్లు నుంచుండిపోయాడు.

అమల చేయిచాచి ఈడ్చి సుందరమూర్తి చెంపమీద కొట్టింది. "ప్రభను తెమ్మంటే పోవేం, ఎద్దు మొద్దు వెధవ" అంది. వెంటనే నాయర్ వద్దకు పరుగు తీసింది.

నాయర్ పరుగున వెళ్ళిపోయాడు.

సుందరమూర్తి రెండడుగులు వెనక్కువేశాడు, అమల పిచ్చిని చూచి.

"పోతావా, చంపేయనా?" అంది పెద్దగా అరుస్తూ అమల.

భుజంగరావ్ వెళ్ళమన్నట్లు చెయ్యి ఊపుతూ సౌంజ్ఞ చేశాడు.

సుందరమూర్తి కోపంగా వెళ్ళిపోయాడు.

అమల మళ్ళీ భుజంగరావ్ వద్దకు వచ్చి గట్టిగా భుజంగరావ్‌ని వాటేసుకుంది. "ఇదిగో పిల్లెవరు? ప్రభను తీసుకు రాకపోతే, నీవన్నా తీసుకురావాలి. లేకపోతే ఊరుకోను. ప్రభా, ఓ ప్రభా, రావా?" అంటూ మళ్ళీ రాగంతీయటం మొదలుపెట్టింది.

భుజంగరావ్ "అలా గేనమ్మా" అని అమల భుజం నిమురుతూ కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు.

శంకరం, కృష్ణను తీసుకునివచ్చాడు.

అమల ఏడ్పుమాటలు చూచి నిర్ఘాంతపోయాడు కృష్ణ.

"ఏమయింది మామయ్యా?"

"నా తల్లి పిచ్చి ఈ పూట ఎక్కువయిందిరా, ఈ ఏడ్పు, ఈ హృదయాన్ని కదిలించే మాటలు వినలేకుండా ఉన్నారా? ఈ స్థితిలోవున్న రోజాని చూస్తూ చావలేక బ్రతకలేక ఉన్నారా కృష్ణా?"

"ఏమిటి మామయ్యా! పులిలాంటి నువ్వు ఇలా మాట్లాడటమేమిటి? ఇప్పుడేమైందని, ఇంతగా అధైర్యపడతావు? రోజాని మామూలు మనిషిని చేస్తానని మాటిచ్చాను. నా మీద నమ్మకం లేదా?"

"నీ మాటతో ఇంకా బ్రతికున్నారా కృష్ణా! రోజాని చూడు ఏమయిందో?"

కృష్ణ చరచర అమలవద్దకు వచ్చి అమల భుజంమీద చేతులువేసి తనవైపు బలవంతానా తిప్పుకున్నాడు. లాక్కెళుతున్నట్లే తీసుకెళ్ళి మంచంమీద పడుకో బెట్టాడు. అమల చేతులు కదలకుండా తన చేతులతో గట్టిగా మంచానికి నొక్కి పట్టుకున్నాడు.

# 10

"రోజా వున్నట్లుండి విపరీతంగా ప్రవర్తించటానికి ఏదో కారణం వుంది. మీరంతా దూరంగా ఉండండి పరీక్ష చేయాలి," అన్నాడు గంభీరంగా కృష్ణ.

భుజంగరావ్, శంకరం, అప్పుడే మేనేజర్ రామచంద్రతో వచ్చిన సుందరమూర్తి మంచంచుట్టూ గుమిగూడిన వాళ్ళు కృష్ణ మాటలతో దూరంగా పోయి నుంచున్నారు.

కృష్ణ తీవ్రంగా అమల కళ్ళల్లోకి చూశాడు.

అమల, కృష్ణ చూపుల్లో చూపులు కలపలేక కళ్ళు మూసుకుంది.

కృష్ణ కావాలని ఆదుర్దా నటిస్తూ, పల్స్ చూచి, అమల మీదకు వంగి తల నరం నొక్కి పరీక్ష చేయటం మొదలుపెట్టాడు.

"ఏం కావాలి రోజా?"

"ప్రభ...ప్రభ...ప్రభా తొందరగా రా!" అంది.

అమల తలమీద పరీక్ష చేస్తున్నట్లుగా చెవి ఆనించాడు కృష్ణ.

"ఇడియట్. నిప్పుతో చెలగాటమాడుతున్నావ్? పిచ్చిలేని నీకు ఇంకా పిచ్చి ఎక్కువయిందే? మామయ్యా హార్ట్ ట్రబుల్ పేషంట్ అని చూస్తున్నాను. ప్రభకాదు నీకు కావలసింది. మృత్యువు. పిచ్చి పనులు చేసి మామయ్యా మనసు క్షోభ పెట్టకు. మరోసారి ఇలా చేశావంటే సరాసరి యమపురికి పంపుతాను. జాగ్రత్త!" అతి నెమ్మదిగా అమలకు మాత్రమే వినిపించేటట్లు అన్నాడు కృష్ణ.

"ముందు నన్ను పంపు. నే వెళ్ళి నీకు అక్కడ సీటు రిజర్వ్ చేస్తాను," గొణిగింది అమల.

కృష్ణ కోపంగా అమల జబ్బమీద గిల్లాడు రక్తం

వచ్చేటట్లు.

"కేవ్" మని అరిచింది అమల.

"ఏమంది? ఏమయింది?" గాభరాపడుతూ మంచం వద్దకు పరుగున వచ్చాడు భుజంగరావ్.

"ఏం కాలేదు మామయ్యా! కలలో ప్రభాకర్ వచ్చి వుంటాడు. విపరీతంగా తలలో నరాలు చలిస్తున్నాయి. అందువల్ల ఇలా ప్రవర్తిస్తున్నది. మామయ్యా, రోజాని నాల్గు రోజుల్లో అసలు మనిషిగా నీముందు పెడతాను," అన్నాడు కృష్ణ మంచంమీదనుంచి లేస్తూ.

"నీమీద నాకా నమ్మకం వుందిరా కృష్ణా!" అంటూ భుజంగరావ్, అమల మంచంమీద కూర్చున్నాడు.

'నాకు సీటు రిజర్వ్ చేస్తుందా? తేలిపోయింది. నా అనుమానం నిజం అయింది. రోజా కాదు ఇది...ఇది... మాయలాడి' కృష్ణ అనుకున్నాడు.

'రక్తం వచ్చేటట్లు గిల్లుతావా? ఈ పిచ్చివేషంలో నీ రెండు జబ్బలు కండ లూడి వచ్చేటట్లు గిల్లకపోతే చూసుకో,' అనుకుంది అమల.

అమలవైపు చూస్తు కూర్చున్నాడు భుజంగరావ్.

## 11

రాత్రి పన్నెండు గంటలు దాటింది.

అమావాస్య రోజులు కావటంవల్ల బైటంతా చీకటిగా వుంది. భుజంగరావ్ ఇంట్లో అందరు నిద్రపోతున్నారు. ఆ ఇంటి మొత్తంమీద అమల ఒక్కతే నిద్ర మేల్కొని వుంది.

అమల చప్పుడు చేయకుండా మంచం దిగింది. ఏ మాత్రం చప్పుడు కాకుండా గదిలోంచి మెల్లిగా అడుగులు వేస్తూ బైటకు వచ్చింది. నలువైపులా ఓసారి చూచి వరండా దాటి బైటకు వచ్చింది. పరుగులాంటి నడకతో,

దొడ్డి దోవగుండా వీధిలోకి వచ్చి రోడ్డు ఎక్కింది.

చీకట్లో రెండు బలమైన హస్తాలు అమలను బంధించి, దొడ్డి గోడపక్కకు లాక్కొచ్చాయి.

"ఎవరు నన్ను పట్టుకుంది? వదలండి" అంది అమల పెనుగులాడుతూ.

"నా పేరే భగవాన్! ఎక్కడికి వెళుతున్నావ్ నా కళ్ళు గప్పి?" భగవాన్ కఠినంగా అడిగాడు.

"అరి భగవంతుడా? నీ కళ్ళు కప్పి పారిపోవటం..."

"ముందే చెప్పాగా నాకు వెయ్యి కళ్ళని. ప్రతి నిమిషం నీ చర్య కనిపెడుతూ వుంటామని. అసలెలా గది లోంచి బైటకు వచ్చావు. గది తలుపులు బైట వేసి ఉంటాయి కదా! పారిపోవటంలో నీ ఉద్దేశ్యం ఏమిటి?"

"నీకేం నువ్విక్కడ చల్లగా వున్నావ్, నా పని సాలె గూడులో చిక్కుకున్న ఈగలా వుంది. శంకరం సమయం కోసం చూస్తున్నాడు, పిచ్చిదాన్ని కదా బలత్కరించ వచ్చని. కృష్ణ అనుమానించాడు. నే నెవరికో చెప్పక పోతే ప్రాణం తీస్తానని కూర్చున్నాడు. నిద్ర లేచాను. నా గది తలుపులు తీసి వున్నాయి. పారిపోటానికి ఇదే సందని బైలుదేరాను. నీ పనికో నమస్కారం! నా దోవన నన్ను పోనియ్యి."

"నీ దారిని నిన్ను పోనీయటానికి కాదు, ఇక్కడికి తీసుకొచ్చి నిన్నుంచింది. నాతో గట్టిగా చెపితే కృష్ణని, శంకరంగాడిని పై లోకానికి తరలించేవాడిని. మావాళ్ళు 'ఊ' అంటే క్విక్‌గా పని చెయ్యటానికి తయారు."

"ఆ పని భుజంగరావ్ గారినే చేస్తే ఆస్తి నా పేర ఉంటుంది. మీకొచ్చేది. నే వెళ్ళిపోయేదాన్ని కదా?"

"కృష్ణ మధ్యలో వస్తా డనుకోలేదు. లేకపోతే యీ

పాటికే భుజంగరావ్‌ని అడ్డు తొలిగించేవాడిని, ఆ స్తి మా పరం అయేది. హార్ట్ ఎటాక్‌తో ముసలాడు చచ్చాడని అనుకునేవారు. ఇప్పుడయినా మించిపోయిందిలేదు.

అమలా! నువ్వు యధావిధిగా వెళ్ళి నీ గదిలో పడుకో. త్వరలో పని పూర్తి చేస్తాను,'' అన్నాడు భగవాన్.

"భుజంగరావ్‌గారి చావుతో మీ పని పూర్తవుతుందేమోగాని నా పని కాదు. నేను ఆ ఇంట్లో వుంటేనే కదా నా ద్వారా ఆ స్తి మీకు దక్కేది. మీరు మొదటినుంచీ నన్ను మోసంతో మీ విషవలయంలోకి లాగారు. మా నాన్నగారికి నాకు లెటర్స్ అందిస్తున్నారు. అది నాన్నగారు రాసినవి కావు.''

"ఎలా తెలిసింది?'' అరిచినట్లే అడిగాడు భగవాన్.

"అంతేగాదు. ఆ ఇంట్లో నీ వెవరివో కూడా తెలిసిపోయింది.''

"ఆ...!''

"భుజంగరావ్‌ని ఏం చేస్తారో నాకనవసరం. నా దోవన నే పోతున్నాను. మీ ఇష్టం వచ్చింది మీరు చేసుకోండి.''

"నీ వెక్కడి కెళ్ళటానికీ వీలులేదు. మాపని పూర్తికాంది, మా కథ తెలిసిన నిన్ను పోనిస్తామా? మర్యాదగా ఇంట్లోకి నడువు. పిచ్చి రోజాగానే నటించు రేపురాత్రిలోగా భుజంగరావ్‌ని, కృష్ణని ఏంచేయాలో చేసేస్తాను.''

"చంపుతావా?''

"అదేం బ్రహ్మవిద్యకాదు. మా మాట వినకపోతె నీగతీ అంతే.''

అమల చటుక్కున పరుగుతీసింది ముందుకు. భగవాన్ వేగంగా వెళ్ళి అమలను పట్టుకున్నాడు.

"చంపేస్తున్నాడు రండి, రండి." అరిచింది అమల.

అమల నోరు ఓ చేత్తో నొక్కి, రెండో చేత్తో అమల పారిపోకుండా పట్టుకున్నాడు భగవాన్.

"నామాట వినవ్ కదూ? సరే ఇప్పుడే చంపను. నరక యాతన పెట్టి కొద్దికొద్దిగా ప్రాణం తీస్తాను. ఎంతకమ్మగా ఉంటుందో చూద్దువుగాని."

అదే సమయంలో వెనుకనుంచి వచ్చిన ఓ వ్యక్తి పిస్టల్‌తో భగవాన్ తలపై కొట్టాడు. వెంటనే ఈల వేశాడు.

ఈల వింటూనే బిలబిలమంటూ నలువైపులనుంచీ అర డజనుమంది వచ్చారు.

## 12

హాలులో సోఫాల్లో అందరూ కూర్చున్నారు.

ముందుగా అమలే పెదవి విప్పింది.

"నాన్నగారూ! నే ఇంట్లోంచి మాయంకావటంగురించి ఏమనుకున్నారు, మీరు అమ్మానూ?"

"ఊరినుండి రాగానే ఇంటి తలుపులకి తాళంవేసి వుండటం చూశాను. ఈ తాళం చెవులు నీవద్ద నావద్ద వున్నాయిగా, తాళం తీసుకుని లోపలికి వెళ్ళాను. నీవు లేచిపోయి పెళ్ళిచేసుకున్నట్లు రాశిన లెటర్ చదివి బాధ పడ్డాము. మీ అమ్మ ఆ నిమిషంనుండే మనోవ్యాధితో పిచ్చి దానిలా అయిపోయింది. ఈ విషయం ఎవరికి తెలియటం ఇష్టంలేక మీ అమ్మమ్మగారి ఊరికి పంపాను అమ్మను. నేను ఇంట్లో 'ఎందుకిలాంటి పని చేశావు అమలా! నీమాట కాదంటామని ఎట్లా అనుకున్నావమ్మా!' అనుకుంటూ దిగులులో రోజులు గడిపేస్తుంటే నిన్న భుజంగరావ్‌గారి వద్ద

నుండి లెటర్ తీసుకుని వారి నౌకరు వచ్చాడు. నీవు క్షేమంగా వున్నట్లు అమ్మకు టెలిగ్రాం ఇచ్చివచ్చాను," అని పరంధామయ్య చెప్పాడు.

"అమలా! నీ ధైర్యం, సమయస్ఫూర్తి మెచ్చుకోదగింది. జరిగింది వివరంగా నీ నోటివెంట వినిపించు," అన్నాడు భుజంగరావ్.

అక్షరం పొల్లుపోకుండా జరిగిందంతా చెప్పింది అమల. తర్వాత అంది. "ఈ ఇంట్లో ఎవర్ని నమ్మాలో తెలియలేదు. తెగించాను. బాగా పిచ్చి ముదిరినట్లు నటించి, ఏడుస్తూ భుజంగరావ్ గారి వడిలో తల దూర్చుకుని... 'నేను పిచ్చిగా నటిస్తున్నాను. నాకేం పిచ్చి లేదు. మీ జేబులో నే వివరంగా రాసిన లెటర్ పెట్టాను. చదివి తర్వాత నేనేం చేయాలో చెప్పండి,' అని లెటర్ జేబులో పెట్టాను.

ఏదో గూడుపుఠాని జరుగుతుందని గ్రహించిన భుజంగరావ్ గారు వెంటనే అలాగే అన్నారు. ఆ తర్వాత లెటర్ చదువుకుని ఉంటారు. లెటర్‌లో నా వివరాలు. ఎలా ఈ ఇంట్లో ప్రవేశపెట్టబడిందీ రాశాను. భగవాన్ ఎవరయినదీ బైటపడటానికి మార్గం ఆలోచించి చెప్పమన్నాను.

ఆ తర్వాత భుజంగరావ్ గారు మినీ టేప్ రికార్డర్ అందించారు. దానితో ఓ లెటర్ కూడా. 'రాత్రిపూట నీ గది తలుపులు బైటగడియ తీసి ఉంచుతాను. నీవు ఇంట్లోంచి పారిపోయినట్లు నటించు. భగవాన్ గాని, వాడి అనుచరులు గాని నిన్ను బంధిస్తారు. నీవు వాళ్ళని మాట్లాడించు. రికార్డ్ అయిపోతోంది. నీకే ఆపద రాకుండా నీ వెనకనే ఇన్‌స్పెక్టర్‌ని పరివారాన్ని వుంచుతాము,' అని వుంది.

భుజంగరావ్ గారి ప్లాన్ సక్‌సెస్ అయింది."

ఫోన్ మోగటంతో కృష్ణ లేచి వెళ్ళి రిసీవర్ అందు కున్నాడు. మాట్లాడి తర్వాత రిసీవర్ క్రెడిల్ పై వుంచి వచ్చి, సోఫాలో కూర్చున్నాడు.

"ఇన్ స్పెక్టర్ విజయ్, ఫోన్ చేశారు మావయ్యా! సుందరమూర్తి తానే భగవాన్ గా నటించినట్లు ఒప్పు కున్నాడుట. సుందరమూర్తితో చేతులు కల్పిన మేనేజర్ రామచంద్ర, నాయర్ కూడా నేరం ఒప్పుకున్నారుట. మరో పావు గంటలో ఇచ్చటికి వస్తానని ఇన్ స్పెక్టర్ విజయ్ చెప్పారు." కృష్ణ అన్నాడు.

"సుందరమూర్తి ఇంత నీచుడనుకోలేదు. వేషాలు మార్చటం, కంఠధ్వని మార్చటం, ఫోర్జరీ చేయటం వాడికి తెలిసిన విద్యే. ఆస్తికోసం నా తల్లి రోజాని వీళ్ళుపొట్టన పెట్టుకుని వుంటారు. రోజాతల్లి ఇక లేదురా కృష్ణా! వీళ్ళ ఎత్తులు పారలేదు నా యావదాస్తి అనాధ శరణాలయాలకు రాసినందున ప్లాన్ పన్ని అమలను రోజాగా నా ఇంట్లో ప్రవేశపెట్టారు. అమలా! నా రోజాతల్లిలా వున్నా నీవు నా మనశ్శాంతికయినా మధ్యమధ్య వస్తూ వుండు. మీ కెవరికీ అభ్యంతరం లేకపోతే నీవూ నీవాళ్ళూ మా ఇంట్లోనే వుండండి," అన్నాడు భుజంగరావ్.

"మా అమల దూరమయినందుకు ఈ నెల రోజులు చావ లేక బ్రతకలేక రోజులు ఈడ్చాను భుజంగరావ్ గారూ! మాకే కానుకలూ వద్దు. అమల ఇహపై మీకూ నాకూ కూతురే. బిడ్డ దగ్గరలేని బాధ అనుభవించాను. మీ మన శ్శాంతికి అమల మీ బిడ్డగా భావించండి," అన్నాడు పరంధామయ్య.

"సారీ అమలా! నీవో మోసగత్తెవనుకుని చెంపదెబ్బ బహుకరించాను, తులనాడాను, చేతిపై గాటుపడేటట్లు

గిల్లాను. రోజా అంటే నాకు ప్రాణం. రోజా స్థానంలో ఆ స్త్రీకోసం మోసంగా నీవు తయారయావని రాక్షసుడిలా ప్రవర్తించాను," కృష్ణ బాధగా అన్నాడు.

"మనిషికి రూపం ఒక్కటే కాదు, హృదయంకూడా అందంగా వుండాలి. ఆ రెండు సుగుణాలు మీవద్ద ఉన్నాయి. తెలివికలవారంటే నాకెంతో ఇష్టం. మీరు తెలివితేటలతో నన్ను గుర్తించినందుకు ఆనాడే అభినందించేదాన్నే. నేనున్న పరిస్థితి చూచారుగా? మీరే భగవాన్ అని పొరపడి, పిచ్చిలోనే నా కసి తీర్చుకోటానికి సమయం ఎప్పుడు దొరుకుతుందా? వళ్ళంతా గోళ్ళతో గీరిపెట్టి, చెంపలు వాయిద్దామనుకున్నాను," ఉన్న మాట చెప్పింది అమల.

"ఇప్పుడుమటుకు సమయం ఏం మించిపోయింది? ఊ... కానియ్, రక్కుతావో, గిల్లుతావో, చెంపలు వాయిస్తావో, నీ ఇష్టం! నా శరీరమే నీ కప్పగించేస్తున్నాను," కృష్ణ నవ్వుతూ అన్నాడు.

అమల బుగ్గలు ఎర్రపడ్డాయి. సిగ్గుతో తల వంచుకుంది.

భుజంగరావ్, పరంధామయ్య ముఖాముఖాలు చూచుకుని నవ్వుకున్నారు.

—: ఐపోయింది :—




(25 వ భాగము)

“అదేదో వెతికి, కనుపించకపోతే, అనుకుందాం! కదులు!” అన్నాను ముందుకు నడుస్తూ.

ఆమె అయిష్టంగానే నాతో అడుగులు కలిపింది.

ఆ ప్రాంతమంతా అల్లిబిల్లి తిరిగినట్లు తిరిగాం మరో రెండుమూడు గంటలసేపు. ఎక్కడా ఆమె జాడ కనుపించలేదు. నా పాంటు జేబులో దాచుకొన్నాను అంతకు ముందు దొరికిన డెల్లా పర్సు.

“మిస్టర్ రాజ్!” భుజంపైన చెయ్యివేసి పిలిచింది.

ఏమిటన్నట్లు వెనక్కి తిరిగిచూశాను.

“ఇంక నడవలేను. కాళ్ళు పచ్చి పుండ్లయినాయి. ఆకలి ఎముకల్ని కొరికేస్తూంది” అంది నిస్త్రాణపడిపోతూ.

“ఏం చేద్దామంటావ్?” అడిగాను నాకూ తోచక.

"తినేందుకేమీ లేదు! కనీసం కాసేపు యెక్కడన్నా కూర్చుందాం!" అంది.

"చీకటి పడ్డతర్వాత ఎటూ రెస్టు తీసుకుంటాం. కనీసం అందాకయినా డెల్లాను వెతకటం మంచిదని తోస్తూంది నాకు. ఇంకొంత ముందుకువెళ్తే డెల్లా కనుపించకున్నా, ఆకలి తీరేందుకు ఏదైనా దారి కనుపించే అవకాశమన్నా వుంటుందేమో? చూద్దాం!" అన్నాను.

"అంత మొండితనం పనికిరాదు!" అంది కోపంగా.

"ఇలాంటి పరిస్థితుల్లో పనికివచ్చేదదే! నువ్వు ఇక్కడే కూర్చో. నేను అలా వెళ్ళి చీకటి పడేసరికి నీ దగ్గర కొచ్చేస్తాను!" అన్నాను.

"వద్దు! నాకు భయం!" అంది దీనంగా ఆమె.

"భయమా? ఎందుకు?"

"ఈ ఎడారిలో నన్ను బికారిలా వదిలేసిపోతే ఏ క్రూరమృగమో వచ్చి పైనబడి చీల్చుకుతింటే ఏం చెయ్యాలి?" అడిగింది.

"క్రూరమృగాలకన్నా క్రూరమైనదానివి నీవు. నీవల్లనే కదా ఇంత జరిగింది" అన్నాను కోపంగా.

"రాజా! తెల్లారాక వెతుకుదాం! నేనూ వస్తాను. ఇవాళింక నీడ చూసుకుని విశ్రాంతి తీసుకుందాం!" అందామె దీనంగా ఏడుస్తూ.

"నో! సారీ!" అన్నాను అడుగు ముందుకువేస్తూ.

"యూ! క్రేజీ!" అంటూ విధిలేక వెంటబడిందామె.

"ఆ డెల్లానుకూడా ఇలానే ఏడిపించేవాడివా?" అడిగిందామె కొంతదూరం వెళ్ళాక.

"అంటే! నేను నిన్నేడిపిస్తున్నానా?" అడిగాను ఆమెవంక చూస్తూ.

"మరి?"

"అదే నీకూ, జెల్లాకూ తేడా? ఇంతకన్నా విపత్కర మైన సమయాల్లో, ఆమె నాకు ఉత్సాహాన్నీ, ఉద్రే కాన్ని కలిగించి, మృత్యువుతో పోరాడేందుకు అవసరమైన ఊపిరి పోసింది. నీలా పిరికిమందు నూరలేదెప్పుడూ" అన్నాను.

"విశ్రాంతి తీసుకుందామనడం పిరికితనమా?"

"అవును!" అన్నాను.

"అలాగని నేననుకోలేదు" అందామె.

"అనవసరంగా విసిగించకు. నీతో మాట్లాడుతుంటే అడుగులు ముందుకు పడుతున్నాయి గానీ, చుట్టూ ఏముందో గమనించే వీలు లేకుండా పోతూంది" అన్నాను.

"జెల్లా ఏమీ నల్లపూస కాదు కనుపించకుండా వుండేందుకు. చిల్లపెంకు అంతకన్నా కాదు, ఏ చెట్టు మొదట్లోనో పడివుండటానికి. ఆమె మనిషి. నిన్నూ, నన్నూ చూడగానే పరుగెత్తుకొస్తుంది" అందామె కాస్త వెక్కసంగా.

"అది నిజమే! కానీ ప్రాణంతో లేకుంటే..." అన్నాను. అలా అనటం ఇష్టం లేకున్నా.

"ఆ మాట నేనింతకుముందంటే నువ్వు ఒప్పుకో లేదుగా? మరి ఆ అనుమానం ఇప్పుడెందుకొచ్చింది?" అడిగిందామె.

"అనుమానం కలిగి కాదు! అలాంటి అవకాశంకూడా వుండొచ్చు గదా అన్నాను."

ఆ తర్వాత ఆమె మాట్లాడలేదు.

ఇద్దరం మౌనంగా ముందుకు నడిచాం.

దాదాపు గంటపైనే కలయ తిరిగాం. ఎక్కడా జెల్లా

జాడ కనుపించలేదు. నాలో అంతకు ముందుదాకా వున్న ఆశ ఆరిపోవటం మొదలెట్టింది. అంతసేపు తిరిగినా, నా కెక్కడా ఏ విధమైన క్రూరమృగం గానీ, జంతువుగానీ కనుపించలేదు. మనుషుల మాట సరేసరి. అసలు లేరు. ఇలాంటి ప్రదేశంకూడా భూమి ఉపరితలంపైన వున్నందుకు విస్తుపోయాను.

ఆకాశంకేసి తలెత్తి చూశాను.

సూర్యుడు దాదాపు పడమటివైపుకు వాలిపోయాడు. ఎండ తీవ్రతగూడా తగ్గింది. చల్లటిగాలి రావటం మొదలెట్టింది.

ఉత్తరంవేపునుండి ఝుంయ్‌మని పెద్ద శబ్దం వినిపించింది. వంద విమానాలు ఒక్కుమ్మడిగా ఆకాశంలోకి లేచేటప్పుడు కలిగే విధంగా వినవచ్చింది ఆ శబ్దం.

ఎవరివైనా శత్రువిమానాలు వస్తున్నాయేమో ననుకుని, అమెరికన్ నర్సుని లాక్కుని ఒక చిన్న చెట్టుచాటుకు వెళ్ళాను. శబ్దం దగ్గరయింది.

సముద్రపు హోరులా, జోరుగా వినవచ్చింది.

"విమానాలా?" అడిగిందామె.

"ఏమో? అలాగే వుంది!" అన్నాను ఆ దిక్కు చూస్తూ.

ఆకాశంలో ఎత్తుగా చిన్నచిన్న నల్లటిమేఘాల గుంపొకటి వేగంగా వస్తున్నట్లు తోచింది నాకు.

ఆవైపు చూడమన్నాను ఆమెను.

తలెత్తి చూసిందామె. వెంటనే అర్థంగానట్లు నాకేసి చూసింది. నాకూ అర్థంగాలేదు. అందుకే ఆమెకేసి చూడకుండా తల వెనక్కి వంచి ఆకాశంకేసి చూడసాగాను.

ఆ మేఘాలగుంపు నాకు దగ్గరకంటా వచ్చింది. సరిగ్గా నడినెత్తిపైకి కదలింది. దాటి మరికొంత ముందుకు పోయింది.

ఆ తర్వాత విసురుగా జారిపడే ఉల్కల్లా, జర్రున నిటారుగా భూమిపైకి విరుచుకుపడ్డదా గుంపు.

నాకు భయం పుట్టింది. కళ్ళు గట్టిగా మూసుకున్నాను.

వెంటనున్న అమెరికన్ నర్సుక్కూడా భయంవేసింది గాబోలు, నన్ను రెండుచేతులతో బిగించి పట్టుకుంది. తల మెడకేసి రుద్దసాగింది.

శబ్దం ఆగిపోయింది. ప్రకృతి ప్రశాంతంగా వున్నట్లు తోచింది.

మెల్లగా కళ్ళు తెరచి చూశాను.

నాకు కొద్దిదూరంలో నాలుగడుగుల ఎత్తునున్న పెద్ద పెద్ద కోళ్ళలాంటి పక్షులు వందదాకా కనుపించాయి. చిన్న తలలు, సన్నటి మెడలు, పెద్ద పొట్టలు, విశాలమైన రెక్కలతో, గాలిలో రెక్కలుగట్టుకొని ఎగరగలిగే మనుషుల్లా వున్నాయి.

పొడుగ్గావున్న ముక్కుల్తో భూమిని లోడి, ఏదేదో తీసుకుని తింటున్నట్లు గమనించాను.

"అవేం పక్షులు?" అడిగింది అమెరికన్ నర్సు.

"అదే ఆలోచిస్తున్నాను!" అన్నాను.

"నే నింతకుముం దెప్పుడూ చూడలేదు!"

"నేను కూడాను."

"అమాంతం మనల్ని ముక్కుతో పొడిచి, లోనున్న మాంసమూ, కండలు, తినేలా వున్నాయి కదూ!" అడిగిందామె.

"అవును!" అన్నాను. చూస్తుంటే వాటి కలాంటి

పనేం పెద్ద కష్టంకాదని నాకూ అనిపించింది.

"వాటి దృష్టిలో పడకుండా తప్పించుకోవడం మంచిదేమో?" అడిగింది నన్ను.

"పక్షిజాతిలో మనిషిని...అదీ ప్రాణాలతో వున్న జీవిని చంపుకతినే రకంగురించి నే నెక్కడా చదవలేదు. ఇవికూడా మనిషికి హానిచేసే రకమని నేను ఊహించలేకుండా వున్నాను" అంటూ నా అభిప్రాయం తెలియపరచాను.

"అయితే వెళ్తావా వాటి దగ్గరకు?"

"వెళ్ళొద్దంటావా?"

"నీ ఇష్టం! నేను మాత్రం రాను. వాట్ని ఇంతదూరం నుండి చూస్తుంటేనే ఊపిరి ఆగిపోతుంది నాకు!" అంది.

"అయితే నువ్విక్కడే వుండు. నే వెళ్ళి వాటి సంగతి కనుక్కుంటాను" అంటూ ముందుకు కదిలాను.

ఆ మెరికన్ నర్స్ముందు చెప్పినంత ధైర్యంగా, ఆ పక్షుల గుంపువేపు నడవలేక పోతున్నట్లు నాకు నాకే అర్ధమయింది. అంటే నాలోనూ, ఏదో మూల వాటిని గురించి భయం వుండివుంటుందని నిర్ధారించుకున్నాను. గుండెలు చిక్కబట్టుకొన్నాను.

నెమ్మదిగా అడుగు తీసి అడుగు ముందుకు వెయ్యసాగాను.

పడుతున్నది అడుగులే అయినా నడుస్తున్నది మైళ్ళులాగుంది నాకు. బాగా దగ్గరకంటూ వెళ్ళాను. ఇప్పుడు నాకూ, ఆ గుంపుకూ పట్టుమని పదిగజాల దూరంకన్నా ఎక్కువలేదు.

ఆ గుంపు నా కదలికను ఏమాత్రం గమనించలేదు. వాటి పనిలో అవి నిమగ్నమై వున్నాయి. ఒకదాన్నొకటి

రాసుకుంటూ, నేలను ముక్కుల్లో పొడిచి కెలుకుతూ ముందుకూ, వెనక్కూ తిరుగుతూనే వున్నాయి.

ఇంకొంచెం ముందుకు కదిలాను.

ఇప్పుడా మా మధ్యదూరం మరీ తగ్గిపోయింది. నాలుగు గజా లుంటుం దనుకుంటాను.

దగ్గరనించి గమనించాను. ఒక్కో పక్షి చేతులు నేల కానించి నడిచే మనుషుల్లా వున్నాయి. వీపు భాగం విశా లంగా వుంది. మెడ సన్నగా పొడుగ్గా వుంది. నాలాంటి వాడు ఎక్కి కూచున్నా సులభంగా మోసుకెళ్ళగలిగేలా వున్నాయి.

మెల్లిగా అడుగులు వేసుకుంటూ వాటి మధ్యకు వెళ్ళాను.

నన్ను అవి గమనించాయి. అయినా భయపడి పారి పోవటంకానీ, ఎగరటంగానీ చేయలేదు. నన్ను రాసు కుంటూ తిరుగుతూనే వున్నాయి. అక్కడ్నుంచి అమె రికన్ నర్స్ వున్నవేపు చూశాను.

ఆమెకూడా నా వెనుకే కొంతదూరం వచ్చినట్లుంది. నాకు దగ్గరగానే వినా పక్షులగుంపుకు కాస్త దూరంగా నిలుచుని వుంది.

నా దగ్గరకు రమ్మని చెయ్యి ఊపుతూ సైగ చేశాను.

ముందో క్షణం తటపటాయించింది. మళ్ళీ ధైర్యం తెచ్చుకొంది కాబోలు. చకచక నడచివచ్చింది దగ్గర కంటా.

"ఇది భయంకరంగా వుంటే బెంబేలెత్తిపోయాను. మనుషుల్ని చూసినా వీటికి భయంలేదు లాగుంది!" అంది.

"అవును!" అన్నాను నా ప్రక్కగా వచ్చిన ఒక దాన్ని వీపుపైన చెయ్యివేసి నిమురుతూ.

"ఎక్కడ్నించి వచ్చాయో ఇవి?" అడిగింది.

ఆ విషయమే ఆలోచిస్తున్నాను నేను. ఇలాంటి పక్షులు రాత్రిళ్ళు ఒక ప్రాంతాన్ని మకాంగా వుంచుకొంటాయి. ఆహారంకోసం రోజూ వందల మైళ్లు గుంపుగా ప్రయాణం చేస్తాయి. హిచ్ కాక్ పిక్చర్ 'బర్డ్స్' చూశాను యం. ఎస్ సీ. చదివేప్పుడు బొంబాయిలో. ఇవిగాకున్నా, ఇలాంటివే మరోజాతి గురించి, వాటి అలవాట్ల గురించి చాలా వివరంగా చూపించారందులో. ఈ గుంపుకూడా ఏదో దూరప్రాంతాన్నుండి వచ్చివుండాలి.

ఇక్కడ్నుంచి వీటిల్లో ఒకదానిపైనెక్కి వెళ్దామా అనుకున్నాను. పైగా డెల్టా పర్వ ఈ ప్రాంతాల కనుపించింది. మనిషిమాత్రం జాడలేకుండా పోయింది.

మాలాగే ఆమెకూ ఆ రోజు ఈ గుంపు కనిపించివుంటే, సాహసంచేసి ఒకదానిపై ఎక్కి వెళ్ళిపోయి వుండవచ్చునని అనిపించింది నాకు. ఆ ఆలోచన రాగానే, నిర్ణయం చేసుకున్నాను వెళ్ళిపోయేందుకు వాటితో. నా అభిప్రాయం ఆమెకు చెప్పాను.

"ఇవి పిచ్చి పట్టినట్లు ఎగురుతాయి. పట్టుకునేందుకు ఏ ఆధారం లేదు. పైగా ఎక్కడికి వెళ్తాయో తెలీదు. మన కర్మ కాలి ఈ గుంపు ఏ కీకారణ్యంలోనో వదిలేశాయంటే అక్కడ్నుంచి బైటపడే మార్గంలేక ఏ క్రూరజంతువులకో ఆహారంగా మారిపోవాల్సి వుంటుంది!" అందామె భయపడుతూ.

"అయితే నువ్వు వెనక్కి పోగలవా ఒంటరిగా?" అడిగాను.

"వెనక్కి వెళ్ళిమాత్రం చేసేదేముంది. పద నీతోనే వస్తాను!" అందామె చివరికి.

(సశేషం)

# సప్లిమెంట్ పోటీ - 21.

G, H, I, J, K — అక్షరాలను తీసుకొని మీకు నచ్చిన వరుసక్రమంలో, ఈ క్రింది గళ్ళను పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, దానితో 75 పైసల స్టాంపులు జతపరిచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి.

| | | | | |
|---|---|---|---|---|

మా ఆఫీసులో సీలుచేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఏడాదిపాటు 'సప్లిమెంట్' ఉచితంగా పంపుతాం. ఫలితాలు ఆగస్టు '76 నెల మాస పత్రికలో చూడండి.

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంటు" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపు మాకు చేరేట్లు పంపండి. 'హోమ్ డెలివరీ' సభ్యులు తమ సభ్యత్వము నెంబరు వ్రాస్తేచాలు. సభ్యులు కానివారు తమవ్యాఖ్యలతో 30పై.లు స్టాంపులుపంపాలి.

మాకు నచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రూ. 20 లు నగదు బహుమతి పంపుతాము.

## మీరే ఎన్నుకోండి ?

ఈ "సప్లిమెంటు"లో మీకు బాగా నచ్చిన నవల పేరును ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల10 వ తేదీ లోపు మాకు పంపండి. హోమ్ డెలివరీ సభ్యులు తమ నెంబరు తప్పక వ్రాయాలి. ఇతరులు తమ జవాబుతో ఈ కూపన్ కత్తిరించి పంపాలి. ఉత్తమ నవలకు రూ. 116 లు బహుమతి ఇవ్వబడుతుంది.



# క్రైమ్‌లో తమాషాలు

## అదృష్టవంతుడివయ్యా భగవాన్లు!!

భగవాన్లు డ్యూటీ పనిమీద కలకత్తా వెళ్ళుతున్నాడు. భార్య పిల్లలిద్దరికి రెండు గొడుగులు తెమ్మని, మరిచిపోవద్దని మరీ మరీ చెప్పింది.

గొడుగులు గురించి మరిచిపోకుండ మనస్సులో స్మరించుకుంటూ బండెక్కాడు, భగవాన్లు.

హవురాలో దిగేటప్పుడు పొరపాటున ఓ పెద్దమనిషి గొడుగు పట్టుకొని దిగిపోయాడు. ఆ పెద్దమనిషి తల వాచేటట్లు చివాట్లుపెట్టి తన గొడుగు లాక్కున్నాడు.

మర్నాడు కలకత్తాలో రెండు గొడుగులు కొనుక్కొని భగవాన్లు బండెక్కాడు. దురదృష్టవశాత్తు ముందురోజు పెద్దమనిషికూడ అదే కంపార్టుమెంటు ఎక్కాడు.

మన భగవాన్లుని చూచి, "నీ అదృష్టం బాగున్నట్లుందే యివాళ రెండు గొడుగులు సంపాదించావు" అన్నాడు.

—ఇ.ఏ.ఎన్. నారాయణ, కంటాబంజీ.

## ప్రేమావేశం?

కిటికి దగ్గరున్న అప్పల నర్సమ్మతో ప్రేమ కవిత్వం మొదలెట్టాడు వెంకటేశం—

"అహహ నా ప్రేయసీ!

ఊహల్లో నా ఊర్వశీ!!

ఇవ్వవా ఓ వేడి ముద్దు?
నువ్వ కాదంటె జన్మే వద్దు!!"

అప్పుడే లోపలికి వచ్చిన ఇంటి ఓనర్ పరంధామయ్య అందుకున్నాడు—

"అయ్యా! వెంకటేశం!
చాల్చాలు నీ ప్రేమావేశం!!
వచ్చానోయ్ ఇంటద్దె కోసం!
ఇవ్వపోతే రోడ్డే నీకు శరణ్యం!!"

వెంకటేశం తెల్లముఖం వేశాడు గాభరాలో.

—కాసారపు సంజీవయ్య, జగిత్యాల.

## గులాబి—కవ్వాలి

ఓ కవిత్వాల కామరాజు, దారెంట వెళుతున్న అమ్మాయిని చూసి—

"ఓహో! ఒయ్యారి గులాబి,
నేతిలోని జిలేబి!
నాకు జోడు నీవు కావాలి
నేను పాడుతా నీపై కవ్వాలీ!!"

అన్నాడు. దానికి చలాకీగా ఇలా అంది ఆ అమ్మాయి—

"గులాబి వెనక ముళ్ళున్నాయి,
నీ తలపై కళ్ళున్నాయి,
నువ్వు కవ్వాలి పాడావంటే
నేను తవ్వాలి నీకో గోరి!"

—శంకర్ అండ్ చలం, బెల్లంపల్లి.

## రక్షించండి!!

పాపారావు రోడ్డుమీద వెళుతున్నాడు.

ప్రక్కనే ఉన్న బంగళాలో ఒక వ్యక్తి నిలబడి,

"హత్య! హత్య!! రక్షించండి, హత్యజరిగింది, రక్షించండి!!!" అంటూ కేకలు పెడ్తున్నాడు.

పాపారావు ఆ అరుపులు విని ఆ వ్యక్తిని ఒక్కంగలో చేరుకొని "ఎక్కడ హత్య జరిగింది? ఎప్పుడు జరిగింది? శవమేది?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించాడు.

అంతలో అటుగా వచ్చిన ఒక నర్స్ పాపారావుని ఎగాదిగా చూచి, "ఏమయ్యా అతనికంటే పిచ్చెక్కింది. నీకెక్కడ పిచ్చెక్కిందా వెళ్ళు, వెళ్ళు" అంటూ కసిరింది.

పాపం! మన పాపారావు ఆ బంగళా గేటుమీంచి రోడ్డు మీదకు ఒక్క హైజంప్ చేసాడు. బయటకు వచ్చి బోర్డు చూశాడు. అపుడు తెలిపింది అది పిచ్చాసుపత్రి అని.

—ఎస్. షమీమారఫీ, కడప.

## కుకింగ్ క్లాస్?

మహిళా మండలి కార్యదర్శి తన సభ్యురాల్ని కలుసుకుంది.

"ఇవాలట్నుంచి వారం రోజులు యూత్ సెంటర్‌లో కుకింగ్ క్లాసెస్ జరుగుతాయి. మీరు తప్పకుండారావాలి."

"సారీ నాకు వేరే ఎంగేజ్‌మెంట్సున్నాయి. మా వార్ని పంపుతాను. రిసీవ్‌చేసుకోండి." అంది ఆవిడ వాచ్ చూస్తూ.

—శాంతిశ్రీ, రుద్రంపూర్.

## కొత్త చిట్కా!!

పండు డాక్టరు: ఏమోయ్ కంపౌండర్! నేను ప్రాక్టీసు మొదలుపెట్టి దాదాపు మూడు సంవత్సరా లవుతూంది కదా! పేషంట్సందరూ నిన్నగాక మొన్న ప్రాక్టీసు పెట్టిన డాక్టర్ సుబ్బశ్రీ వద్దకు వెళ్తారేమోయ్?

కంపౌండర్: ఆవిడ పండ్లూడబెరుకుటకు మీ మాదిరి కత్తులు కటారులు వాడదంటసార్! ఆమె స్వయంగా చేసిన నేతి కుడుములను పేషంట్స్ కిచ్చి కొరకమంటుందట. దాంతో బాగున్న పండ్లుకూడ ఊడి చేతిలోకి వస్తాయట.

యస్. షమీమారఫీ, కడప.

## తెలివిగల పిల్ల!

ఆ ఊళ్ళో రాధ అనే అందమైన యువతి వున్నది. కాని ఆమెకు నా అన్నవారెవరూ లేరు. ఇంకా పెళ్ళి కాలేదు; ఒంటరిగా ఒక ఇంట్లో వుంటూ సంగీత పాఠాలు చెప్పుకుంటూ, అల్లికలు, డిజైన్సు కుట్టుకుంటూ కాలం గడుపుతోంది.

„ ఆ సుందర ముఖారవిందమైన రాధను ఎలాగైనా తన దానిగా చేసుకోవాలని ఆ వూళ్ళో ప్రతి యువకుడు పట్ట పగలే కలలు కనేస్తూ, పడరాని పాట్లు పడుతున్నారు.

ఆ వూళ్ళోనే రంగారావ్, రమణరావ్ అనే ఇద్దరు స్నేహితులున్నారు. ఇద్దరూ రాధను ప్రేమించారు.

రాధను నన్ను ప్రేమించిందంటే, నన్ను ప్రేమించిం దని పోట్లాడుకున్నారు ఓ రోజు.

చివరికిద్దరూ పందెం వేసుకున్నారు.

"నన్ను రాధ మనసారా ప్రేమించింది గనుక ఈ రాత్రి ఎంతో చనువుగా ఆమె ఇంటికి వెళ్ళి అక్కడ పడు కుంటాను హాయిగా!" అన్నాడు రంగారావ్.

"నన్నే రాధ గాఢంగా ప్రేమించింది గనుక నేను వెళ్ళి ఈ రాత్రి అక్కడే పడుకుంటాను" అన్నాడు రమణరావ్ అందమైన రాధను తలుచుకుంటూ. పందెం కలిపారు.

ఆ రాత్రి ముందుగా రంగారావ్ రాధ ఇంటికి వెళ్ళి

భయపడుతూనే తలుపు తట్టాడు.

రాధ తలుపు తీసింది. ఆమెను చూడగానే రంగారావ్ ఒణికిపోయాడు. గుండె దడదడ అంటున్నది. అయినా చివరికి ఎలాగో ధైర్యంచేసి "చూ....చూ....చూడండి, నేను సైకిలుమీద చాలా దూరం వెళ్ళాలి. ఈ వెధవ సైకిల్‌కి టైరు పగిలింది. నా ప్రయాణం ఆగింది. ఈ రాత్రి ఎక్కడికీ వెళ్ళలేను. కనుక దయచేసి ఈ రాత్రికి మీ ఇంట్లో పడుకోనిస్తే, మీ మేలు ఈ జన్మలో మరిచిపోను" అంటూ ప్రాధేయపడ్డాడు రంగారావ్ బెదురుతూనే.

రాధ అతన్ని చూసి జాలిపడింది. ఆప్యాయంగా లోనికి ఆహ్వానించి వసారా గదిలో మంచంవేసి పడుకోమంది.

రంగారావ్‌కి చెప్పలేనంత ఆనందంగా వుంది. నా ప్రియ రాధ ఎంత మంచిది అనుకున్నాడు, గాలిలో ఎన్నో రంగుల మేడలు కట్టుకొంటూ.

ఒక గంట తర్వాత రాధ గదిలోనికి వస్తూ "ఏం నిద్ర రావడం లేదా?" అని అడిగింది నవ్వుతూ.

"ఒంటరిగా వుంటే ఎలా నిద్రపడుతుంది?" రాధ కళ్ళ లోకి ప్రేమగా చూస్తూ అన్నాడు.

వెంటనే రాధ పకాల్న నవ్వేసింది. ఎక్కడికో వెళ్ళి రెండు నిమిషాల్లో తిరిగొచ్చి "అవును మరి! ఒంటరిగా వుంటే క్రొత్తచోట ఏం నిద్రపడుతుంది? ఇకనుంచి మీరలా బాధపడనవసరంలేదు! మీలాగే ఈయనకు కూడా సైకిల్ పాడైపోయిందట పాపం! ఇప్పుడే వచ్చాడు ఈ రాత్రికి ఇక్కడ పడుకుంటానని! మీకు తోడుగా వుంటాడు" అంటూ రమణరావ్‌ని గదిలోకి ఒక్క తోపు తోసి, తలుపు భళ్ళున వేసింది రాధ.

—జి. ఈశ్వర్, గార్ల.



